K. Parthasarathy Iyengar

శ్రీ

# నైషధీయ చరితము

శృంగారతరంగిణి

శ్రీమహామహోపాధ్యాయ, కళాప్రపూర్ణ, కవిరాజ, కవిసార్వభౌమ

## శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి

ప్రణీతము.



చెన్నపురి:

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్‌వారి

'వావిళ్ల' ప్రెస్సున

ముద్రితము

టు] 1941 [వెల రు 1-0-0

# విమర్శకపీఠిక.

---

కేవలపీఠిక, విమర్శకపీఠిక— అని పీఠిక ద్వివిధము. అందు, గ్రంథోద్దేశమే కాని, కథలోని మార్పులు మొదలగునవి కూడఁగాని తెలుపునది కేవలపీఠిక. గ్రంథప్రాశస్త్యమును వలయునెడల దోషసూచనలను దెలుపునది విమర్శకపీఠిక. మొదటిది కృతికర్తలును, రెండవది విమర్శకులును వ్రాయనగు. కవిహృదయము పరులకు సుస్పష్టము కావింజేసి కృతికర్తలే రెండవదిమాత్ర మేల వ్రాయరాదని యెవరేని ప్రశ్నింపవచ్చును. నిండుగాను— అంతటను గాకున్నను మొత్తముమీఁదనైనను విమర్శకులు కవిహృదయమును గ్రహింపఁజాలక పోరు గావునను, కృతికర్తలు తమగ్రంథముల ప్రాశస్త్యము తామే పొగడుకొనుట యొప్పదు గావునను, తామే దోషసూచనలం దెలుపుట పొసఁగదుగావునను, విమర్శకులే ప్రశస్తకావ్యముల పీఠికలు వ్రాయుట యెంతయు నొప్పు.

విమర్శనమునకు దోషాన్వేషణముకంటె గుణగ్రహణమే ముఖ్యలక్షణముగా నుండనగు. వలయునెడల దోషము లేవేని చూపవలసియున్నను వానికే ప్రాధాన్య మీయరాదు. దోషములనేనియు సూచనలుగాఁ దెలుపుట, అరయికకు మఱింతనాజూకుతనము తేఁజాలిన వెరవు. అట్లని మేఱమీఱిన పొగడికలకుం దావిచ్చు పొరపాటునకు లోనగుటయుం దగదు. ఇది సత్కావ్యములంగూర్చి. ఇంక దుష్కావ్యములం గూర్చియన్ననో, వ్యక్తిప్రధానముగాఁగాక విషయప్రధానముగా, దోషములను బాగుగా నిరూపించి చూపనగు.

విమర్శకపీఠిక నెమ్మదిగా వ్రాయవలసినదిగాని తొందరపాటున వ్రాయవలసినది కాదు. అది వ్రాయువారికి గ్రంథము పలుసార్లు చదువుటకు వలయు వ్యవధి యుండవలయును. తొందరతొందరగా వ్రాసిన విమర్శనము పొత్తపువిలువను సరిగా వెల్లడింపఁజాలదు.

ఇక్కడ మా కొకచిక్కు వచ్చినది. దీనికృతికర్త కవిసార్వభౌముఁడు కాఁజాలినదిట్ట. ఆయనవ్రాసినకావ్యము విమర్శించి, పీఠికవ్రాయువారు వారితో సమానులు కావలయు. కాని, విమర్శకబిరుదముల వాసనయే లేని మే మొక్కసారి విమర్శకసార్వభౌముల మెట్లు కాఁగలము? అయిన, దీనివిమర్శకపీఠిక వ్రాయ మీ రేలసిద్ధపడితి రనవచ్చు. కృతికర్తృవిద్వత్పాఠకరాజహంసములు మాపీఠికలోని గుణక్షీరములనే గ్రహించునను విశ్వాసముచేతనే; భరోసాచేతనైత మనుటకును జంకము. కాని, యిక్కడ మే మొకముక్క చెప్పవలసివచ్చినది. విమర్శకులము ముగ్గురము; పైపెచ్చు మూఁడుహాళ్లవారము; కార్యాంతరనిమగ్నులము; దానికిందోడు గ్రంథప్రతియు మా కొక్కటియే. ఇదంతయుఁ దెలిసియే కృతికర్తగారు వ్యవధి యిచ్చినారు. కాని, పైవారు వారిం దొందరపెట్టుటంబట్టి వారు దానినిగూర్చి వ్రాయవలసివచ్చె. అందువలనఁ దుదకు మేము తొందరపడవలసియే వచ్చినది. దానికి మా తొందరపనులును సాయపడినవి. కాన, దాని లోటుండునని వగచెదము. ఇంతకుఁ దృప్తి కంత మెక్కడ? కవిసార్వభౌమునికిఁ దనివి కలిగించు పీఠిక వ్రాయఁగలుగుదు మనుకొనుటకంటె వెఱ్ఱి వేఱొండు కలదా? కొండంత దేవుని నేభక్తులు కొండంతపత్తిరి పెట్టి పూజింపఁగలరు? కనుక, మాపని మే ముడుతభక్తిరీతి నొనర్చువారము. ఈపీఠిక వ్రాయఁగోరి మమ్ము గౌరవించిన కవిసార్వభౌమునకు మాకృతజ్ఞత తెలుపువారము.

మే మీపీఠికవ్రాయవలసివచ్చుట కేవలము దైవికము. మాలో నొకరు మధురకవి శ్రీనాళము కృష్ణరాయషష్టిపూర్తిమహోత్సవసమయమున జరిగిన గ్రంథాలయమహాసభపనిమీఁద రాజమహేంద్రవరమునకుఁ జని శాస్త్రిగారియాతిథ్యము పొందుట తటస్థించినపుడు, వారు ముప్వురను నైషధీయచరితపీఠిక వ్రాయఁగోరిరి. అం దొకరభిప్రాయము మాత్రము వ్రాసియిచ్చిరి. తక్కినయిరువురమును మఱొకరిని మాతోఁ జేర్చుకొని యిది వ్రాసితిమి. ఇట్లు శాస్త్రిగారుకోరిన ముప్వురముగాకున్నను, ముప్వురమే వారిశృంగారతరంగిణీపీఠిక వ్రాయుట జరిగినది. ఈపద్ధతియు మంచిదే యగుఁగాక!

## ఆక్షేపములకు సమాధానము

నలచరిత్ర మెందఱో యింతకుముందు వ్రాసియుండ మరల నిది యేల? యని యెవరేని యందురేమో! రామకథ పలువురు వ్రాయుట కేమి, నలకథ పలువురు వ్రాయుటకేమి, సత్కథాగౌరవమే కారణము. ఇంతకు వ్రాతకారులు తమకు నచ్చిన కథ కైకొందురు. అటులే శాస్త్రి గారును నలకథ కైకొనిరి. దానికిఁదోడు కృతిపతియు నదే కోరె. మఱొకమాట. "ముఖే ముఖే సరస్వతీ" అను పెద్దలమాట పాటింప వలదా? ఎవరిముఖముననుండి సరస్వతి యెట్లు పలికించునో చూచి, రసా స్వాదన మొనరించుటకదా రసజ్ఞులపని? కాన, మనకవిసార్వభౌముఁడు శృంగారతరంగిణిరచింపఁబూనుట ముదావహమేకాని వేఱొండుకాదు. ఇది చదువరులకు బోధపడకపోదు.

ఇఁక, నైషధీయచరితమునకు శృంగారతరంగిణి యను మఱొక పేరు పెట్టనేల? యను ప్రశ్న మొకటి బయలుదేఱవచ్చును. దానికత ము, శాస్త్రిగారు కవిసార్వభౌమబిరుదాంకితు లగుటచే మునుపటికవి సార్వభౌముఁడగు శ్రీనాథుఁడు శ్రీహర్షమహాకవీంద్రుని విద్వదౌషధ మగు నైషధము శృంగారనైషధ మనుపేర నాంధ్రీకరించియుండుటం బట్టి తాము నాకథ కావ్యముగా రచించునెడ దానికి శృంగారపదసమే తమగు నామ మిడఁదగు నని తలంచుట కానోపును. అగుఁగాక! అది సార్థక మగున ట్లిది సార్థకమా? యందురేని, కావ్యములోని హెచ్చు భాగము శృంగారరసప్రధానమే యగుటచే సార్థకమే యని యంగీక రింపవచ్చును.

## కావ్యావశ్యకత

"సంసారవిషవృక్షస్య, ద్వే ఫలే అమృతోపమే;
కావ్యామృతరసాస్వాదః; సల్లాప స్సజ్జనై స్సహ".

సంసారము విషవృక్షము, కాన దానిఫలము లన్నియు విషఫల ములే కావలె. అయినను దైవానుగ్రహమున రెండుపండ్లు మాత్ర మమృతోపమము లఁట; మొదటిది కావ్యామృతరసాస్వాదము; రెండ వది సజ్జనులతోడి సల్లాపము. కాన, సత్కావ్యము మానవుల కావశ్య కమే. కాని, సుకవులవలనఁగాని సత్కావ్యము లభింపదు.

"నరత్వం దుర్లభం లోకే; విద్యా తత్ర సుదుర్లభా;
కవిత్వం దుర్లభం తత్ర; శక్తి స్తత్ర సుదుర్లభా". అగ్నిపురాణము.

కవితాశక్తి గలిగి కావ్యముం గూర్చు సుకవిని స్తుతింప నెవరి తరము?

"జననాథాగ్రణి యాత్మరాజ్యమున నిచ్చల్ పూజ్యుఁ డాసీమఁ బా
సినఁ దా గవ్వయుఁ జేయఁ డన్నికడలన్ శ్రేష్ఠుండు విద్వాంసుఁ డా
యనకన్నం గవి మేటియా "సుకవితా యద్యస్తి రాజ్యేన కి"
మ్మను వాక్యంబు నిజంబు దీనిఁ గని కావ్యంబుల్ రచింపందగున్". అప్పకవీయము.

## కృతికర్తృసమర్థత.

"జగ మెఱిఁగిన బ్రాహ్మణునకు జందెం బేలా?" యనునట్లు మహా మహోపాధ్యాయ; కళాప్రపూర్ణ, కవిరాజ, కవిసార్వభౌమ బిరుదాంకితులై వెలయు శ్రీవేదమూర్తులగు బ్రహ్మశ్రీ శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారి నెఱుఁగనివార లాంధ్రపాఠకలోకమున నెవరు గలరు?

"అవధానములను విద్దెలఁ దవిలితిఁ గడు కబ్బములను దగ సలిపితి నేఁ
గవిసార్వభౌమబిరుదం బవుననఁ గైకొంటి".

అని శాస్త్రిగారే తమసమర్థతం దెలిపినారు. వీరు గ్రాంథికాంధ్రభాష కొనర్చిన సేవ యింతం తనరానిది. ౧౧ వ శతాబ్దముననే నన్నయ భట్టు ప్రారంభించినను, తిక్కనసోమయాజియు, ఎఱ్ఱాప్రెగడయు ముగించునప్పటికి ౧౪ వ శతాబ్దమువఱకును సంపూర్ణత్వ మొందినది కాదు మన మొదటియాంధ్రమహాభారతము. అట్టిచో, మూలానుసారముగను, రసవంతముగను శ్రీకృష్ణభారతమును రచించి, తెనుఁగుకవుల మెప్పందిన వీరికవితాశక్తి యనంత మైన దనిన నతిశయోక్తి కానేరదు. అదిగాక, నాటకములు, విమర్శనములు, ప్రహసనములు మొదలగు పొత్తములు ౧౩౦ కంటె హెచ్చుగా వ్రాసి, తెనుఁగువ్రాగమి పెంపొందించినారు. "కలావతి", "వజ్రాయుధము" అను మాసపత్రికలు నెలకొల్పి, పెక్కేండ్లవి నడపినారు, ఇపుడు నైషధీయచరితము రచించినారు. ఇట్టిమహాకవిఋణము తెనుఁగువా రెట్లు తీర్చుకొనఁగలరు? బిరుదు లీయ లేదా? యని యెవ రేని యనవచ్చును. ఇచ్చినారు; నిజమే.

కాని గౌరవదాయకములయ్యును బిరుదులు గాలిప్రోగులు; అవి నా నాఁడు కాదుగదా యొక్కనాఁడేని పిడికెఁడు మెతుకు లిడఁజాలవు. కాన, బిరుదు లిచ్చువా రవి యిచ్చుటతోడ నేకాక వానితో స్థిరోపాధులు సైత మమర్పఁజాలినపుడే తనియనగును. పైని దెలిపిన ౧౩౦ కి మించిన పాత్తములను శాస్త్రిగారియెడ నభిమానముగలకొందఱు పెద్దలు రాజ మహేంద్రవరమున "గ్రంథప్రకటనసంఘము"గా నేర్పడి, సంపుట ములుగా ముద్రింప సంకల్పించినారు. ఆసంఘువిజ్ఞాపన మీపాత్తము తుదిని గలదు. అది చూచి, దాని ననుసరించి మాతృభాషాభిమానులగు వారు చందాదారులై, శాస్త్రిగారియెడఁ దమకున్న కృతజ్ఞతను క్రియా రూపముగాఁ జూపి, వారిఋణము తీర్చుకొందురుగాక!

## కృతికర్తృసుగుణములు, వినయము.

సమర్థులయ్యును శాస్త్రిగారు వినయభూషితులు. ఇందలి క్రింది పద్యమే యిందులకు నిదర్శనము.

"ప్రమదం బేర్పడఁ దొల్లిటం గురుకులావాసంబునన్ నేర్చి కా
వ్యములున్ నాటకముల్, పరిష్కృతులు, శబ్దార్థంబులున్, సత్పరి
శ్రమచే నీకృతి సర్వసమ్మతముగా సంధింతు నట్లైన దో
షము లెందే నగు దిద్దుఁ డార్యులు నమస్కారంబు లర్పించెదన్". 1 త. 16.

## దేశాభిమానము.

"దక్షిణకాశి...ప్రభవించె నాప్రదేశ మాంధ్రమాతకుఁ బుట్టిని ల్లయ్యె నధిప".
2 త. 53.

అర్జునుని తీర్థయాత్రాసందర్భమున నన్నయభట్టు వేఁగీదేశవిభ వము వర్ణించినట్లు మనకవిరాజిం దాంధ్రమాతకుఁ బుట్టినిల్లని రాజ మహేంద్రవరమును వర్ణించుటేకాక, ఆంధ్రకవివలన నలునికి దమ యంతియెడఁ గల యనురాగము నెంతో పెంపొందింపఁజేసె.

## అతిథిసత్కారము.

శాస్త్రిగారు తమయింటికి వచ్చినవారికేకాక, తమపురమున నెక్క డకో వచ్చినవారినిసైత మింటికిఁ దీసికొనిపోయి, వారి కతిథిసత్కా

రము లాచరింతురు. వారిసతీమణి కార్యార్థులగు నాయతిథు లెప్పుడు వచ్చినను వారికొఱకు వేచియుండి, అన్నపూర్ణాదేవివలె నన్నదాన మొనర్చి యాదరించును.

## కృతిపతిప్రశంస.

నెల్లూరిలో న్యాయవాదియై కవితాప్రీతి గలిగి, మన్నన లందుచున్న శ్రీతూములూరి వేంకటశివరామయ్యగారి సుగుణములు విని, మన శాస్త్రిగా రాయనను దర్శింపఁజని, అతిథిసత్కారము పొంది, ముదమంది,

"ఉత్తమనాయకుండ వని యుల్లము పల్లవితంబుగాఁ పునన్
మెత్తనిపాకముం గలుగ మేలుకృతిన్ రచియించి నీ కిడన్
జిత్తము చేసితిన్ గొనుము శ్రీయును సంపదయున్ యశంబు నిన్
హత్తఁగవచ్చు నందున ననంతములై ద్విజరాజశేఖరా". 1 త. 34.

అని రఁట. దాని కాయన యియ్యకొని, సంతసించి,

"కవిసార్వభౌమ, నాయెడ, నవిరళమగు కరుణ గలుగు నట్టిదయేనిన్
దవు నటు కలికల్మషహర, మవు కథ రచియించి యొసఁగు మాకుఁ గృతిగన్."
1 త. 38.

అని కోరినా రఁట. ఆకోరిక తీర్చుటకు శాస్త్రిగారు తా "మించుక రచించియుంచిన నలకథాభాగంబున మఱికొన్ని క్రొత్తలుం గలయఁ గూర్చి పేర్చిన విజ్ఞానంబున "శృంగారతరంగిణి" యను మారుపేర నైషధీయచరితంబు రచియింప నెంచి" తలంచినటులే యది ముగించినారు.

మారయామాత్యకుమారుఁడగు శ్రీనాథుఁడు, తోడిసింగనామాత్యునకుఁ దనశృంగారనైషధ మంకిత మొనర్ప శ్రీకృష్ణమూర్తిశాస్త్రిగారు తోడి వెలనాటివైదికబ్రాహ్మణులగు శివరామయ్యగారికిఁ దమ శృంగారతరంగిణి యంకిత మొనర్పఁగలుగుట యెంతయు సొంపుగానున్నది.

శ్రీశివరామయ్యగారు తమసుగుణములచేత నింతకుముందే తెనుఁగునాట వాసిగాంచి యున్నారు. ఇపుడు కవిసార్వభౌముని మెప్పొంది, కృతిపతిత్వమునకుఁ బాత్రులగుటవలనఁ దమపేరు స్థిరపఱుచుకొనఁజాలినారు; ధన్యు లయినారు. ఆయనయే యన నేల? కృతిముఖ

మున వర్ణితులై, వారివంశమువారు పురుషులును, స్త్రీలును—ధన్యులు కాఁజాలినారు. సుగుణవంతులగు పురుషులతోను పతివ్రతలగు స్త్రీలతోను వెలసినవారివంశము కవిసార్వభౌమునిస్తుతిచే ధన్యము కాఁజాలినది.

## కావ్యభేదములు.

కావ్యములు సంస్కృతమున మూఁడు తెగలు:—౧ పద్యకావ్యములు; ౨ గద్యకావ్యములు; 3 మిశ్రకావ్యములు. తెనుఁగున గద్యకావ్యములు వచనకావ్యము లన నొప్పు. రఘువంశాదులగు సంస్కృత పద్యకావ్యములు గద్యరహితములు. అట్టివి తెనుఁగున నిర్వచనోత్తర రామాయణాదు లేవో కొన్నిమాత్రము కలవు. ముఖ్యములగు తెనుఁగుకావ్యములు మిశ్రకావ్యములే. వీనిని, నిర్వచనపద్యకావ్యములను సైతము ప్రబంధము లనియే తెనుఁగువారు వ్యవహరించుచున్నారు. "గద్యపద్యమయం కావ్యం చంపూ రిత్యభిధీయతే" అను నిర్వచనముంబట్టి తెనుఁగుమిశ్రకావ్యములు చంపువులే. తెనుఁగుసవచన నిర్వచనకావ్యభాగములకు సాధారణమగు పేరు "ఆశ్వాసము" 18 వర్ణనములు గలది సంస్కృతమున మహాకావ్యము; అట్టిది తెనుఁగున మహాప్రబంధము. మహాకావ్య మను వాడుకయు లేకపోలేదు.

## 18 వర్ణనములు.

"పుర సింధు నగర్తు ర్త్విన శశి సరసీ వన మధు రతి ప్రసంగ విరహముల్
పరిణయ తనయోదయ నయ విరచన యాత్రా జి దౌత్య విభు వర్ణనముల్".

నరసభూపాలీయము.

"పుర వారాశి మహీధ రర్తు శశభృ త్పూషో దయో ద్యాన పు
ష్కర కేళీ మధుపాన మోహన వియోగ క్షేమ యాన స్వయం
వర పుత్రోత్సవ మంత్ర దూత్య రణ దోర్వైభ క్రాంతి సంకీర్తనా
కర మష్టాదశవర్ణనాన్వితము తత్కావ్యంబు భవ్యం బిలన్".

కావ్యాలంకారచూడామణి.

"ఇరువదియురెండువర్ణనలు గూర్చి చెప్పవలయుఁ బ్రబంధంబు శ్రీనివాస".

అప్పకవీయము.

కాని, యివి కాలభేదముంబట్టియు, అభిరుచిభేదముంబట్టియు మాఱును. కాన, వీనిలోఁ గొన్ని తగ్గవచ్చును. క్రొత్తవి కొన్ని చేర వచ్చును. దీనింబట్టియే,

"ఇందు నొకకొన్ని కడమైన నెంచి చూడ,నదియు నవని మహాకావ్య మనఁగఁబరఁగు".

అనినాఁడు నరసభూపాలీయకర్త.

## కావ్యలక్షణము.

"విగతదోషంబులును గుణాన్వితము లధికలసదలంకారభావోపలక్షితములునైన శబ్దార్థములు గావ్య మనఁ జెలంగు". నరసభూ.

"రసాత్మకం వాక్యం కావ్యమ్". సాహిత్యదర్పణము.

పై రెండును దెలిపినది కావ్యలక్షణమే. మొదటిది విస్తరించి తెలుప, రెండవది సంగ్రహించి తెలిపె. కాన, రసాత్మక మగునదే కావ్య మని మనము గ్రహింపనగు.

## నైషధీయచరిత మెట్టి కావ్యము?

కృతికర్త ప్రతినంబట్టి యిది సర్వసమ్మతముగా సంధించిన మృత్తిఁపాకముతోడి మేలుకృతి. ధర్మార్థకామమోక్షదాయకమై, కీర్తిప్రీతుల నొసంగఁజాలునది కావ్యనిషేవణమే యని యెఱింగి, అద్దానివలన నొందు నానందమే బ్రహ్మానంద మని గుర్తించి "స్వయం తీర్ణః పరాం స్తారయేత్" అను నార్యోక్తి ననుసరించియే మనకలాప్రపూర్ణుఁ డిది సృష్టించె. ఇయ్యది నాచనసోమునికవితయందలి నాడెమును, తిమ్మనార్యుని ముద్దుపలుకులలోని తీయందనమును, చేమకూరవానిలోని చమత్కారమును, కూచిమంచివారిలోని మంచితనము నొక్కసారియే కొంతకొంత పుణికి పుచ్చుకొన్నది. అంతేకాదు. అఖండగౌతమీతీరనివాసులైన నన్నయశ్రీనాథులరచనాప్రాబల్యము కూడ నిందు బాగుగా గోచరించుచునే యున్నది. పుర ఋతు విరహ వివాహ పర్వత స్వయంవర చంద్రోదయ పుత్త్రోత్పత్తి సూర్యాస్తమయాదివర్ణనములతో వన్నె గాంచుటం జేసి యిది మహాప్రబంధమే. అయినను, శాస్త్రిగారు గద్యమున నటు తెలుపక వినయమును వెల్లడించుట యెంతయు శ్లాఘనీయము.

## భాగములపేరు.

చంపువగు నైషధీయచరితము శృంగారతరంగిణి కాన దీనిభాగ ములపేరు 'తరంగ' మయ్యె. ఇట్టి ౬ తరంగములతో నిది చెలంగు చున్నది.

## ఇష్టదేవతాప్రార్థన.

కృతికర్త లాశ్వాసముల మొదట నొకయిష్టదేవతను వేడికొనుట యాచారము. సర్వదేవతాసమత్వముం దెలుప నాయాచారము మార్చి, ప్రథమద్వితీయపంచమతరంగముల శివుని, తృతీయతరంగమున రంగ విభుని, చతుర్థతరంగమున శ్రీశుని, షష్ఠతరంగమున రాముని బేర్కొని, కృతిపతిని రక్షింపఁ గొన్నియెడలఁ బ్రార్థించియు, కృతిపతి వారికరుణచే వర్థిల్లుఁగాక యని కోరియు, శాస్త్రిగారు తమమహామహోపాధ్యాయ విశిష్టతను గనఁబఱచిరి. అదియునుగాక, కథాప్రారంభమున "విరాట్స్వ రూపుఁడగు దేవుఁడు మమ్ముఁ బ్రోచుఁగాక" అని క్రొత్తచేర్పు చేర్చి, తమ వ్యక్తిత్వమును వెల్లడించిరి.

## పద్యగద్యపరిమితి.

ఇందలి పద్యగద్యములు ౧౦౭౭ పంక్తులమొత్తము ౮, ౫౦౦; అందు వచనపంక్తులు ౮౩౦. కాన, వచన మిందు సుమారైదింట నొక పాలు. దానిరీతి నన్నయభట్టారకుని వచనరచనను స్ఫురింపఁజేయుచున్నది.

## వృత్తములు.

చంపకమాల మొదలగు సాధారణవృత్తములేకాక అలసగతి, సుగంధి, పద్మనాభము మొదలగునవి వాడుటచే దీనికి వైవిధ్యము కలిగి, సొగసు హెచ్చినది.

## కావ్యప్రాశస్త్యము.

కథాసంవిధాననైపుణ్యము, శీలపోషణము, సలక్షణమును రస వంతమునగు భాష, లోకజ్ఞానము, ప్రతిభ మొదలగునవి కావ్యప్రాశ స్త్యమునకు సాధనములు. అవి యన్నియుఁ గాకున్న ముఖ్యములైన వైనఁ గైకొని, నైషధీయచరిత మెట్లు మేలుకృతియో చూతము.

## కథాసంవిధాననైపుణ్యము.

కుమారసంభవము, భారవి, మాఘము అనుకావ్యకథలకువలెనే నైషధకథకును భారతరత్నాకరము పుట్టినిల్లు. వనవాస మొనరించు ధర్మరాజునకు బృహదశ్వమహర్షి నలోపాఖ్యానము చెప్పి, అతని నూఱడించె. షట్చక్రవర్తులలో రెండవవాఁడగు నలుఁడు, సప్తవ్యసనములలో రెండవదగు జూదమునకు బానిసయై, పలుబాముల పాలయ్యె. జూదమువలన గలిగినపాటును నేర్పుగా వర్ణించి, చదువరుల కంటఁ గట్టునట్లు చేసినజూదము కూడనిదని తెలుపునది కావున నలకథ సత్కథ; సుప్రసిద్ధము; కలికల్మషహరము. కావుననే కృతిపతి దీనిం గోరె.

ఇట్టితొంటిసత్కథయగు పుట్టురత్నమును జేకొని, మనకవిసార్వభౌముఁడు వసుచరిత్రమునఁ దెలిపినట్లు తనకల్పనలచే నలంకరించి, శృంగారతరంగిణి యను సానఁబట్టిన జాతిరత్నముగా సంతరించె. ౨౭౯ పద్యవచనములలో నలోపాఖ్యానమున నిమిడిన కథయే యిందు వర్ణనాదులతో ౯౨౫ పద్యవచనములపరిమితికిఁ బెరిఁగినది. కథకు వన్నె తెచ్చుటకయి కళాప్రపూర్ణుఁడు తననైపుణ్యము చూపి చేసిన యీ క్రిందిచేర్పుమార్పులు గనుఁడు —

(౧) దమయంతి నలునియెడ ననురాగము తెలుపునపుడు,

"నడుమ న్నా కలికష్టమైన సుఖమైన న్వానితో లోకమా
నడవుల్ వీడులు నొక్కరూప కద నా కాతండు నే నుండినన్". 2 త. 32.

"అతనింగాక...కాలసర్ప మెమరంగా నోడ నొక్కింతయున్". ,, 33.

"నాపాలివెన్నిధానము నలుం డాతనిఁగోరి చింతామణిఁ గోరఁబోవ". 3 త. 66.

అని దమయంతిచే ననిపించి, ముందుకథ సూచించె.

(౨) దమయంతిగుణములు నలునికి వర్ణించి తెలుప నొకవైదేశికుని సృష్టించి, అతనిస్థితి చెప్పించునెపమున రాజమహేంద్రవరమును, గౌతమిని వర్ణించి జన్మభూమియందలి గౌరవమునేకాక, తనమనుగడకూడ నేర్పుగా నెఱిఁగించి, తాను రాజసన్మానము పొందినట్లు సైతము తెలిపె.

(3) దేవేంద్రుఁడు దమయంతికడకు దేవదూతికలను పంపినట్లు కల్పించె.

(౪) పుష్కరుఁడు స్వయంవరానంతరము నలు నెదిరించి యోడి పోయినట్లు చేసె.

(౫) ఆదర్శప్రాయమగు నలునిరాజ్యపరిపాలనము చేర్చి, వర్ణించె.

(౬) దమయంతి కార్చిచ్చులోఁ బ్రవేశింప నది చల్లఁబడినట్లు కథాకల్పన మొనరించె.

ఇట్టి సంవిధాననైపుణ్యము సామాన్యకథకు మహాప్రబంధపదవి చేకూర్చుట కొకసాధన మైనది.

## శీలపోషణము.

కథాసంవిధాననైపుణ్య మెంత చూపఁగలిగినను, కథలో వచ్చు స్త్రీపురుషులశీలము పోషించునేర్పు చూపనిచో, కావ్యగౌరవము పోవును; ఆనే ర్పెంత హెచ్చుగాఁ జూపిన గౌరవమంత హెచ్చును. అందు, నాయికానాయకుల శీలపోషణము ప్రధాన మని వేఱె చెప్ప నక్కఱలేదు. అందును నాయికాశీలమునకే ప్రాముఖ్య మీయవలయు. అటులే చేసి, కవిసార్వభౌముఁడు కథాప్రాణమగు దమయంతీశీలముం జక్కఁగాఁ బోషించె.

జూద మాడరా దని పురాణాదులేకాక ప్రభుసమ్మితమగు వేద మును శాసనముగాఁ దెలిపినది. ఋగ్వేదమున ౧౦-వ మండలములోని ౩౪-వ సూక్తమందలి క్రిందిఋక్కులు పాచికలను గూర్చియు, జూద మునుగూర్చియు, ఎంతచక్కఁగాఁ దెలిపెనో కననగు.—

౨. నమామి మే థన జిహేళ ఏషాశివాసఖిభ్యఉ ఉత మహ్య మాసీత్
అక్ష స్యాహ మేక పరస్య హేతోరనువ్రతా మపజాయ మరోధం.

౯. నీచా వర్తంతఉ ఉపారిస్ఫురంత్యహస్తాసో హస్తవంతం సహం తే
దివ్యాఉ అంగారా ఇరిణేన్యుప్తాః శీతాః సంతో హృదయం నిర్దహంతి.

౧౦. జాయా తప్యతే కితవస్య హీనామాతాపుత్రస్య చరతః క్వ క్వ సిత్.

౧౩. అక్షై ర్మా దీవ్యః కృషి మిత్కృషస్వవిత్తే రమస్వ బహుమన్యమానః.
తత్ర గావః కితవ తత్ర జాయాత న్మే విచష్టే సవి తాయ మర్యః.

తాత్పర్యము (౬. ౭.)

౨. ఈపాచిక నన్నెపుడును విసికింపదు; ఎప్పుడును నాపై నలుగదు. అంతేకాదు, నామీఁదనేమి, నానెయ్యురమీఁద నేమి, కనికరమే కురియుచుండును. దానియొంటిచుక్కతో ఆట సరి. ఇట్టిపాచికకొఱకు నన్ను వలచు నాయిల్లాలి నెడచేసితి.

౯. (పాచికలు) క్రిందివైపు దొర్లును; అంతలో వడిగా పై కెగురును; చేతులులేనివయ్యు, మానిసిని మెడముప్పి, వానిచేతులతో తమ్ము కొలిపించుకొనును. తాము చల్లనివయినను పలకమీఁద పడఁగానే గారడినిప్పులకుప్పలవలె గుండెను బుగ్గిగా కాల్చివేయును.

౧౦. జూదరియిల్లాలు దీనురాలై తపించును. తలదాఁచుకొనుట కిల్లు లేక, అల్లాడు కొడుకునుగూర్చి తల్లి దురపిల్లును.

౧౩. పాచిక లాడకుము; ఆడకుము. నీపంటపొలము దున్నుకొనుము. ఉన్నసొత్తు వాడుకొని, నెమ్మిగనుము; అదే చాలు నని తనియుము. నీగొడ్లెక్కడ? నీయిల్లాలెక్కడ? ఓజూదరీ! ఇట్టు లీమంచివేల్పు సవితృఁడు నాతో వక్కాణించినాఁడు.

దమనుఁడను మహాముని వరప్రభావమున దమయంతి జన్మించినది. చిన్నతనమున బాలికలందఱవలెనే గుడుగుడుగుంచములు మొదలగు నాటలాడుకొనుచుఁ బెరిఁగినది. ఆమె దయాసత్యశౌచనిరతయు, గురుజనభక్తిభరితయునై, నిఱుపేదల నాదరించుచు, దిక్కుమాలినవారి కొక్కవిధమున దిక్కు గల్పించుచు, పోషించుచుండినది. నలమహారాజు గుణగణముల ప్రశంస వచ్చినపుడు చెవులు "దోరవెట్టి" వినుచుండినది. పలుకులును, హృదయమును నలార్పణము చేసి, కట్టెమాత్రము కదలుచున్నట్లా మెదేహము తిరుగు స్థితికి వచ్చినది. నలుఁడామెపాలిటిపెన్నిధి. నలార్పితమైన యామెచిత్తమును, చింతామణి లోనగు స్వర్గలోకవిశేషములుగాని, దేవేంద్రుని త్రిభువనసామ్రాజ్యవిభవముగాని, ఆకర్షింపఁ జాలకపోయె. తనసర్వస్వము నలుని కర్పించి, తదన్యములనెల్ల నామె తృణప్రాయముగఁ దిరస్కరించె. ఆమెగాఢానురాగవాహినిని మరల్ప దేవదూతికలకును దేవతలతరఫున దూతయై వచ్చిన నలునకును గూడ నసాధ్యమయ్యె.

వెక్కిరింపఁబోయి వెల్లకిలఁబడినట్లు దమయంతిని వంచింప నల రూపధారులై వచ్చిన దిక్పాలురు, నలునియందామెకున్న పవిత్రానురాగ జ్యోతిప్రభంజేసి పరాజితులై, నిలువుగ్రుడ్లు పడి, నేలకుఁ గాళ్లందక, తికమకలుపడవలసివచ్చె. వారియెదుటనే దమయంతి నలుని వరించె.

వివాహ మైనది. సంతానము కలిగినది. సుఖించువేళ నేదో విఘ్నము—నలునిజూదపువెఱ్ఱి—వచ్చినది. అపుడు దమయంతి జూదము మాను మని యతని వేఁడుకొనినది. కాని, లాభము లేకపోయినది. అది పరికించి బిడ్డలను వెంటనే పుట్టినింటి కంపినది. తాను నలుని విడువక, అతనితోడునీడయై యుండినది. అంత, భార్యాభర్త లిరువురు నడవుల పాలైరి. ఏకవస్త్రధారులైరి. భార్యదురవస్థ చూడఁజాలక భర్త తన మానము కాచుకొనుట కామెచీరలో సంగోరు చించి, ఆమె నెడఁబాసి పోయె. చీదరపడి, పాప మాయిల్లాలు మేల్కాని, పతింగానక, వెదకి, అలసి, సొలసి, పలుకడగండ్లు పడినది.

నలచక్రవర్తిభార్యకు, చక్రవర్తినికి, దమయంతికి, ఎంత పాటు! ఎంత దురవస్థ!! ఎంత జాలి!!!

"పారద మది సోఁకఁ బస చెడు బంగారమన వెలవెలఁబోవు తనువు గలిగి
చము రెఱుంగక మట్టిఁ జమురుట నడగట్టి నఱసి న ట్లగపడు నెఱులు గలిగి
బొట్టుగా నొకనల్లపూసయుం దాల్పమి జా నేదు వికృతవేషంబు గలిగి
నెఱమాసితోలు నా నెఱిఁ బాసి తుండెమై సరిపోని యేకవస్త్రంబు గలిగి
కోల యగు మోము లోతైనవాలుఁగనులు, వాడి వత్తలై కిక్కిస కాడలైన
కాలుసేతులు గలిగి యిక్కడ మెలంగు, నీమె యొక పేదముత్తైదు వేమొ యనుచు".

చేదిపురంబున సునందకడ నుండునపుడామెం జూచిన సుదేవుఁ డనుకొనవలసిన దుస్థితికి వచ్చినది దమయంతి.

ఎట్లో పుట్టినిల్లు చేరుకొనినది. సమర్థములగు పలుకులు సభలలోఁ బలికించి, ప్రతివచనంబులంబట్టి నలునిజాడ తీసినది. మిథ్యాపునస్స్వయంవరమిషచే నలునెట్లో తనతండ్రినగరమునకు రప్పించుకొనినది. అగ్నిశోధితముగాక బంగారు ప్రకాశింపదు. కఠినపరీక్షకులోనుగాక పాతివ్రత్యము ప్రసిద్ధి పొందదు. కాన, వాయుభట్టారకునిచే దమయంతి తన

నిష్కల్మషత్వమును వెల్లడింపఁజేసినది. మఱేమి కావలె? సతి కపుడ పతి పొందు చేకూరినది. పతితోడ మోదవార్ధి నోలలాడినది. త్వరలోనే సామ్రాజ్యము చేకూర దమయంతి తొంటియట్ల నలచక్రవర్తితో సకల సుఖంబులం దేలఁజాలినది.

ప్రశస్తమగు దమయంతిశీలమువలన మానవజాతి దేవతాజాతిని ధిక్కరించి, నైతికోన్నతి పొందఁగలిగినది. ఇట్టిదివ్యసందేశ మెంద తెన్ని చందముల నందిచ్చిన నందీయఁదగియుండును. దేవేంద్రాదిదేవతా తృణీకరణనైపుణీవిశేషంబుచే విభ్రాజితంబగు దమయంతీపాతివ్రత్యమహి మాభివర్ణనంబుతో భాసిల్లు నైషధీయచరిత మాంధ్రవాఙ్మయమునకు నిరుపమానభూషణము కాదా? ఇట్టిచో నైషధీయచరితము—దమ యంతీచరితమనిన మఱెంత యొప్పునది— తెనుఁగున నవసర మె ట్లగును?

నలునిశీలమునకును, భీమఋతుపర్ణాదులశీలమునకును వలయు పోషణము చేకూరినది.

## కావ్యభాష

"నిజదేశంబుల దేశభాషలపయి న్నిత్యాభిమానస్థులై
ప్రజ మెచ్చన్ రసలుబ్ధబుద్ధు లగుచుం బ్రాజ్ఞుల్ స్వదేశ్యంబులే
నిజ మంచుం గొని యన్యదేశములవాని న్మెచ్చ రేపట్టునన్" అప్పకవీయము.

కాన, స్వదేశ్యంబులయెడ రసలుబ్ధబుద్ధులగు ప్రాజ్ఞు లభిమానము చూపెదరు.

"అమరోక్తులు సకలభూములందును వెలయున్". అప్పకవీయము.

అందువలన సంస్కృతపదములును దేశ్యములకు సాయపడఁజనును. అట్లని మితిమీఱుటమాత్రము తగదు.

దేశ్య తత్సమ తద్భవాత్మకమగు నాంధ్రభాష మహామహోపా ధ్యాయబిరుదాంకితులగు శాస్త్రిగారికి స్వాధీన యనియు, గ్రాంథిక భాషాపోషకులగు వారిభాష సలక్షణ మనియు వేఱే చెప్పవలయునా? వీభాషలోఁగాని మఱుఁగులును, నానుడులును, వాడుకనుడులును రస

పోషణమునకు ముఖ్యసాధనములు. ఇవి విరివిగా వాడుటచే శృంగార తరంగిణి కెంతో మెఱుఁగు వచ్చినది. ఈక్రిందివి కనుఁడు.—

"ఆట నేనుంగంత విద్వాంసుఁడుం గడిమి నోర్చిరు మెదల్పలేఁ డనుట..." 1 త. 22

"అంకెకు వచ్చినట్టి కవియై...1 వేంకటరాయశాస్త్రి..." 1 త. 26

"ఆయనభాగ్యము పండె నాఁగ" 1 త 58

కాలు వెట్టిన మొదల్...ధనదునిల్ గా మాఱె..." 1 త. 59

"ఆఁడుదానిదియె యదృష్ట మనెడు మాట" 1 త. 61

"మంచివా రిక యింతలోః మరణ మనెను, మాటబడి నేమొ..." 1 త. 70

"ధుమధుమలు" 1 త. 77

"పుట్టి నేర్చె, నొక్కో పుట్టక నేర్చెనొక్కో" 2 త. 12

"మల్లెయత్తరు" 2 త. 45

"చివు రాని జివ గల్గి" 2 త. 43

"నిత్యకల్యాణము పచ్చతోరణమునై" 2 త. 59

"కా లూనలేక" 2 త. 101

"ఎ ల్లాగున" 2 త. 123

"గిల్లినఁ బా ల్గారెడు మేన్" 2 త. 133

"ఏమె తల్లి" 3 త. 12

"నీదుకాళ్ల కడ నిడ మొక్కో?" 3 త. 13

"మనసు విఱుగకుండ మాటలాడుచు" 3 త. 20

"పోయివచ్చిన దెల్లఁ బూస గ్రుచ్చినయట్లు వినిచితి" 3 త. 81

"గోరంతలు గొండయంత లని...పోఁగాలముం గంటిరే" 3 త. 102

"ఇక్కడివారి గౌరవము నేటను గల్పి బుభుక్షుఁ డేఁగి తా
నక్కడ మూట గట్టుకొనునట్టిది యెట్టిదొ మీఁద నిందు రీ
రక్కట! దైవతంత్ర మొకయట్లుగనై సకి దొంగకోడిచేఁ
జిక్కక త్రోసిరా జనినఁ జెప్పెడిదే మిఁక వీరిభాగ్యమున్". 3 త. 104

"నిలువుం గ్రుడ్డుల వారని" 3 త. 106

"*గిల్టులన్" 3 త. 108

---

* ఇది నేను గడించి, నుడికడలిలోఁ జేర్పఁ దాఁచుకొనియుంచిన నుడులలో నొకటి. శాస్త్రిగారు నిది గడించి వాడుటచే నాయాస్తి కొంత తగ్గిన ట్లనిపించినది. మా॥ రా॥ శా.

| | |
|---|---|
| "బంగరువు న్విడి పెట్టు గోఁటటే" | 3 త. 190 |
| "గ్రుడ్డిగవ్వకే కొఱవడు నన్ను" | 3 త. 193 |
| "నాకు, వారికిఁ బొందని దోమకు, వారణమున కట్టు లుండు" | 3 త. 194 |
| "పెడకలఁ బట్టె నీమమతి" | 3 త. 196 |
| "కంట నీరు గ్రుక్కుకొనుచు" | 3 త. 197 |
| "పూరికింగాని నైషధు" | 3 త. 202 |
| "పోయిన ప్రాణంబులు మరలం గూటం బడినట్లు" | 3 త. 209 |
| "మీఁదుమిక్కిలి వచ్చెడి" | 3 త. 216 |
| "పట్టఁ బగ్గము లేకుండఁ బరగె నపుడు" | 4 త. 8 |
| "తాలెబొట్టు" | 4 త. 101 |
| "నైషధునిరూప మచ్చు గ్రుద్దినట్లు గైకొని" | 4 త. 11 |
| "కంచెయే చేను మేసె" | 4 త. 62 |
| "నాపుణ్యం బ టెట్లున్నదో" | 4 త. 65 |
| "ఊ ర్పేరును లేని వానికి" | 4 త. 83 |
| "నాతులు చేతులు దట్టింబెట్టుగన్" | 4 త. 93 |
| "పుణ్యా మంచుఁ బోఁబాప మెదుర్కొనెన్" | 4 త. 102 |
| "అధ్వగులు విశ్రమింపం గట్టిన యొకచట్టిం గని" | 5 త. 27 |
| "ఎండకన్నును వానక న్నెఱుఁగకుండ" | 5 త. 35 |
| "చీమ చిటుక్కు మన్న" | 5 త. 128 |
| "పులుల్; గ్గోరికఁ బొట్టఁ బెట్టుకొని" | 5 త. 201 |
| "నీకట్టుకొన్న మగనికతమున" | 5 త. 202 |
| "తలఁచెద నిన్ను నీదయను నాతను వుండినయంతకాలమున్" | 6 త. 40 |
| "కీడులో నడిచె నొకింత మే లనఁగ" | 6 త. 47 |
| "జెక్కులు గలిగినయట్లు" | 6 త. 62 |
| "ధేయనన్" | 6 త. 84 |
| "రథ్యంబుల కిలువ సూపుటయుం" | 6 త. 102 |
| "ఏయింత కల్మషమున్" | 6 త. 150 |

## అచ్చ తెనుఁగుసొంపు

వ్యావహారికభాషావాదులు బాగుగా వాడుకలోనికిరాని యింగ్లీషునుడులును సంస్కృతపదములును వాడుచుండ, గ్రాంథిక

భాషావాదులు వాడుకనుడులు తమకావ్యములలో సైతము వాడుచుండుట బుద్ధిమంతులగు భాషాభిమానులు గుర్తింపనగు. శాస్త్రిగారు సంస్కృతపండితులయ్యు నీక్రిందిపద్దెములలో వాడి, అచ్చతెనుఁగు నుడులపైఁ జూపిన మక్కువ మెచ్చనగు. తొలుత నచ్చతెనుఁగుసొంపు మచ్చుచూపిన తెనుఁగుకవిసోముఁడు నాచనసోముఁడు.

| | |
|---|---|
| "పాలు నీ శేర్పర్పఁజాలిన వెలిజెక్కపక్కి..." | 1 త. 6 |
| "బ్రమకు ప్రొద్దుల నొసటిల వ్రాయువేల్పు..." | 1 త. 39 |
| "కమ్మనిమావిపూవులను..." | 2 త. 44 |
| "గమగమలాడు తావిఁ గడుఁ గ్రమ్మెడు పున్గుజవాది..." | 2 త. 45 |
| "చలువల్ గ్రమ్మెడు..." | 2 త. 46 |
| "కోడెకాండ్రమదులు పట్టఁగోరి మరుఁడు..." | 2 త. 72 |
| "పున్నమచందురుఁడగు..." | 2 త. 73 |
| "పువ్వువిలుతుఁడీద..." | 2 త. 74 |
| "మేటితమ్ములతోడనో..." | 2 త. 75 |
| "కొలఁకుల నీట బోటులను..." | 2 త. 109 |
| "సంపఁగెఁ దలరాసి చక్కనౌ నెఱకలు..." | 4 త. 17 |
| "ఒండొంటితో నుండు దండికొండలు..." | 5 త. 23 |

సజీవభాషలకు సమగ్రనిఘంటువ్యాకరణాదు లుండుట దుర్లభము. అందువలననే యొకప్పుడు సమగ్రము లనుకొనునవి వెనుకఁబడి, క్రొత్తవి బయలుదేఱుట తటస్థించుచుండును. ఆయాభాషలు వాడువారినోళ్లను, పండితులమెదడును నుడులువుట్టు గనులు. సాధారణకవులు లోకులు వాడునుడులను మార్చియో మార్పకయో, తమ పాత్రములలో వాడుకొందురు. పండితకవులు వానిని వలయునెడ సానబట్టి, వాడెదరు. అంతేకాదు. తగునుడులు లేనిచో భాషాజ్ఞానబలమునంజేసి క్రొత్తవి కూర్చికూడ భాష పెంపొందఁజేయుదురు. కాని, యిట్టివారు కడునరుదు. కవి కావచ్చునుగాని నుడితీర్పరి కాఁజాలుట కడిఁదిపని. పండితకవి యన శబ్దశాసనసమర్థుఁడగు కవియే. మన మొదటి పండితకవి నన్నయభట్టారకుఁడు భారతము రచించు తనసమర్థతను గూర్చియు, అర్హతనుగూర్చియు,

"......అవిరళజపహోమతత్పరు విపులశబ్ద,శాసను సంహితాభ్యాసు బ్రహ్మాండాది
నానాపురాణవిజ్ఞాననిరతుఁ, బాత్రు...సద్వినుతావదాతచరితు
లోకజ్ఞు నుభయభాషాకావ్యరచనాభి, శోభితు సత్ప్రతిభాభియోగ్యు
నిత్యసత్యవచను మత్యమరాధిపా,చార్యు సుజను నన్నపార్యు..."

అని నాటికిఁ దగినట్లు, వినయముం జూపఁ బ్రథమపురుషమునఁ దెలిపె. ఇం దాయన తెలిపిన లక్షణములెల్ల మనవారు కొందఱ జెప్ప డక్కఱ లే దనుకొనినను, పండితకవులకుఁ జాలవఱకేని కావలసినవే. పాత్తపుంగూర్పరుల కెంత జ్ఞాన మున్న నంతమంచిదే కదా? ఇంతకు ముందు చూపినవిగాక క్రింద వాడిన మఱికొన్ని క్రొత్తనుడులంబట్టియు నుడికూర్పులంబట్టియు మనకవిసార్వభౌముఁడు మాతృభాష కొనర్చిన సేవ గుర్తింపనగు.

## క్రొత్తనుడులు

కాళ్లగజ్జెలు, చిపచిప్పగోళ్లు, చిళ్ల, వాసలప్ప, వెన్నెలవత్తులు— ఇవి బాలిక లాడుకొనునాటలపేళ్లు. క్రొత్తగా వెలువడిన "ఆంధ్రవాచస్పత్యము"లో సైత మీనుడులు కానరావు. ఈయాటలనుగూర్చి కృతికర్తగారు పాత్తముతుదిని దెలుపుట మంచిది. అటు చేసినఁగాని వానినిగూర్చి సరియగు జ్ఞానము కలుగదు.

## సక్కెము చక్కెరకేళులు
## క్రొత్తనుడికూర్పులు

మాటబడి, కాదాడు, ఉహ్వాయను, దొంగకోడి, క్రొంజూపుల దొంగలు, కెంపుడాల్చక్కెరకేళులు, చదువుంబూఁబోఁడి మొదలగునవి. "పురుగు గొఱికిన కఱ్ఱనక్కర మొకండు దేలునటు" అనునది "ఘుణాక్షరన్యాయమున" అను దానియచ్చ తెనుఁగురూపు.

నలశబ్దము సఖులు వాడినట్లు దమయంతికి గోచరింపఁజేయఁ గూర్చిన క్రిందిపద్యములోని నుడులకూర్పు నేర్పు సొంపు నింపుచున్నది. కనుఁడు—

"నలుగడఁ గమ్మవాసనలు నల్వొఱ నఃనన లొప్పెఁ దివతు
నలు నలు వొందెడ నంగనలు నానలు వీడి గతాభిమానలుఁ

లలనలునై మనోహరులల్లాలనలుఁ నయగారము ల్గొనన్
గలిగి తదీయయాచనలు గైకొని పైకొనుచుండ్రు పయ్యెరన్" 2 త. 37

## సంస్కృతపాండిత్యప్రకర్షము

"మనసునన్ వాక్కునన్ గాయమున నకార, మెన్నఁడును జేరనీయని సన్నుతమతి
వగుచు దానిని ఖండించినట్టిఁడవయి, నలవరాహ్వయమందితో నరవరేణ్య"
3 త. 125

కృతికర్త దీనింగూర్చి తెలిపిన యర్థము చూడనగు.

"నీవు కఱవు మనిన నేను గఱచితి నే, కాదులను గణించునప్పుడు దశ
యంటె వనినఁ గఱవు మని యర్థ మవుఁగాదె, యిందు నాదుదోష మింతగలదె?"
5 త. 187

ఇది కర్కోటకుఁడు నలుని గఱచుటను సమర్థించుకొనుచుఁ జెప్పిన సమాధానము.

## ప్రౌఢప్రయోగములు

"నెల్లురు" 1 త. 20. "మోసరూపముగ్" 2 త. 15; "దృష్టిరుగ్" 4 త. 19. "పొల్చెద రాల్మగ ల్గొగిఁ" 2 త. 45. "జరీసరిగంచు" 2 త. 111.

## రసములు

"భావరుచిరసుప్రసన్నవిభవంబు రసంబు" కావ్యాలంకారచూ.

ఈశృంగారతరంగిణిలో శృంగారరసము ప్రధాన మని యెవరికి స్ఫురింపకుండును?

## శృంగారము

"అతులానందాత్మికయగు, రతియె విభావాదిభావరంజనముల సం
వృతమై శృంగారరసాకృతిఁ జెందు మనోనురాగకీలితగతులన్." కా. చూ.

సంభోగవిప్రలంభభేదములచే ద్వివిధమగు శృంగారమున, నలదమయంతుల విప్రలంభమే హెచ్చుగావర్ణితమగుటచే నిందలిప్రధానరసము విప్రలంభశృంగారమే.

“లలిత శ్రవణాలోకన, కలహాసూయా ప్రవాసకలనలచేతన్.
గలిగెడు దశావిశేషము, చెలువారఁగ విప్రలంభశృంగార మగున్.” కా. చూ.

అందునైతము దూతయగు రాజహంస వచించినమాటలంబట్టి నాయికానాయకుల కొండొరులకు నిష్కల్మషమగు గాఢానురాగ మంకురించుటచే,

“శ్రవణా ద్దర్శనా ద్వాపి మిథస్సంరూఢరాగయోః,
దశావిశేషో యో ప్రాప్తో పూర్వరాగః స ఉచ్యతే.”

అను సాహిత్యదర్పణనిర్వచనముంబట్టి, అయ్యది పూర్వరాగ రూపవిప్రలంభము. అందు,

## నలవిరహము

“ఇఁక నే నాసతిఁ జూచు టెన్నఁడొ మనోఽభీష్టంబు సిద్ధింపఁగా
సుకముం గాంచుట యెన్నఁడో సుదతితో శోభించుచున్ సంసృతిం
బ్రకటింపఁగల భాగ్య మెన్నఁడొ జగద్వర్ణ్యంబుగాఁ గాలమున్
సకలశ్రేయము లందుచుం గడపు టెన్నండో కదా చేకుఱున్.” 3 త. 7

## దమయంతీవిరహము

.“సరగున లేచి యాకసము సందిటఁ జేర్చెడు మోవిపానకం
బరయఁగ మోముఁ ద్రిప్పెడుఁ బ్రియంబున నేమియొ పల్కరించెడున్
జురజురఁ జూచెడున్ గినిసి సోలెడు వ్రాలెడు నవ్వెడున్ గడున్
విరహము నొందెడున్ తెలివి వీఁగి నెలంత దురంతచింతమై.” 3 త. 18

వివాహానంతరము జూదమున నోడి, అడవిలో నొండొరుల నెడబాసిన నలదమయంతుల విరహము,

“ప్రవాసో భిన్నదేశత్వం కార్యా చ్ఛాపాచ్చ సంభ్రమాత్.”
అను సాహిత్యదర్పణనిర్వచనముంబట్టి, ప్రవాసవిరహము.

“నిదుర పోవు నన్ను నెఱి వీడి ఘోరాట,విని మృగాళిఁ బడఁగ విడిచిపోతి
వకట! నష్ట నైతి నతిభీతి కైతిఁ జచ్చితి నయొ! యిఁక నేమి సేయుదాన.”
5 త. 43

విస్తరభీతిచే విరమించితిమిగాని, పూర్వరాగప్రవాసరూపముల కెన్ని యేని నిదర్శనములు కలవు.

## కరుణము

ప్రధానమగు పైవిప్రలంభశృంగారమునకు ముఖ్యాంగము కరుణము.

"శోకము విభావముఖభావాకలనముచేతఁ గరుణమను రస మయ్యెన్" కా. చూ.

"దిక్కిసుమంత లేక యిట దేవుడు గొట్టన పెట్టుచున్న న
న్నిక్కడ మొక్కలీఁ డగుచు నీపెనుఁబాము గ్రసించె నక్కటా!
యెక్కడ కేగినాఁడవొ హృదీశ్వర! న న్విడి సేగి యయ్యొ నీ
వక్కటికంబునం గదియ వై హృదయేశ్వరి నన్నుఁ గావవే" 5 త. 54

వీరాద్భుతభయానకరసము లితరాంగములు.

## వీరము

"అనుచుర్ సన్నద్ధుఁడై శౌర్యమున నిషధరా జట్టె..." 4 త. 87

## అద్భుతము

"ఒకచో నింతులు..............." 3 త. 135

## భయానకము

"పెదపెదనల్లమచ్చ లతిభీష్మములై యొడ లెల్ల మొల్లమై
బెద రిడుచుండఁ గొండవలె విగ్రహ మాగ్రహమే యనంగ నై
పొదల మహాగుహం బెగడు పోలిక నాలిక లార్చునోటితో
నదటున వచ్చి పట్టుకొనె నట్టిటు మెట్టెడు నత్తలోదరిన్" 5 త. 51

## వర్ణనములు

నిషధపురము—"ధరణీమండలమండనంబు..." 1 త. 105
వసంతఋతువు—"చిరకాలాప్తవనాంగనావిరహముం..." 2 త. 42
సూర్యాస్తమయము—"వనజముఖియైన..." 3 త. 20
చంద్రోదయము—"గర్భవతి గాన..." 3 త. 25
వివాహము—"తెరచీర సెత్త..." 4 త. 101
అంధకారము—"పుడమి యిది యాకసం బిది..." 5 త. 75
అరణ్యము—"ఒండొంటితో నుండు—" 5 త. 23
జలాశయము—"చదుకము విశాలతయుఁ గల్గి..." 2 త. 97

విరహము—"పూవిలుకానివిం డ్లగుచు..." 3 త. 9

నాయకభేదం—"కొందఱు పత్న్యోపిదుండు..." 1 త. 122

నలపరిపాలనము—"పుష్ప నొవ్వకయుండఁ బూడేసె గొను మధుపమురీతి..." 4 త. 129

కాటుకకన్నీరు—"కలికి వేఁడివేఁడికాటుకకన్నీరు, కాల్వ లగుచు నిలువఁ గాఱుచుండ గంధకోష్ణమైన గనినుండి కాళింది, పఱచుచున్న దనఁగ నరయ నయ్యె" 3 త. 205

ఇందు ధాతుశాస్త్రసంబంధమగు సత్య మొకటి యెంతో హృదయంగమముగా వర్ణిత మైనది. గంధకమునకు స్వర్ణముతో సమ్మేళనము ఘటిల్లినపు డేర్పడు గంధకవిధము (Sulphide) నల్లగా నుండుట ధాతుశాస్త్రప్రసిద్ధము. ప్రకృతిశాస్త్రవిజ్ఞానము టెనిసన్ మొదలగు నాంగ్ల కవులు తమకావ్యములలో వెల్లడించుటచే శ్లాఘ్యు లగుచున్నారు. మన కవివరులు సైత మారీతి ననుసరింతురుగాక!

ఉత్తమరథాశ్వములు—"అవి పృథుప్రోతములు..." 6 త. 76

"ఒకటి నుదుటను రెండు మీ స్తకమునందు..." 6 త. 78

రథగమనవేగము—"దవులం బ్రక్కలఁ బోల్చు వస్తువులు..." 6 త. 89

"నడుమన్ వాఁగులు నేల లడ్డ మయినన్..." 6 త. 90

విమానములు—"ఇరుగడ సొన్నపుందళుకు..." 3 త. 99

"కని కనునంతలో మఱియుఁ గ న్గొన నోపని..." 3 త. 100

దృష్టి—"తరుణవయస్కుఁడైన నృపతల్లజుదృష్టి విదర్భరాట్సుతా
వరపదమందుఁ బొందుపడి పై ననఁటుల్ స్పృశియించి పోయి యం
బరమున బావిలోఁ బడి క్రమంబున బంగరుమెట్ల నెక్కి భూ
ధరములసందునన్ బడి పథం బరయం బస లేక దద్దిఱెన్" 3 త. 144

ఈపద్యమందలి భావ మించుమించుగా గ్రిందిశ్లోకములోని దానిం బోలియున్నది.

"లగ్నం పాదతలేషు జానువిలుఠత్సంసక్త మూర్వోర్ద్వయాగే
విశ్రాంతం జఘనే స్థలే నిపతితం నాభీసరోమండలే,
శూన్యం మధ్య మవేక్ష్య రోమలతికా మాలంబమానం క్రమా
దారూఢం స్తనయోః ప్లుతం నయనయో ర్లీనం మనః కైశికే."

అయినను శ్లోకమందలి చమత్కారము వాచ్య మగుటచే నం తగా నొప్పకయుండ, మనకవిసార్వభౌముని పద్యము విషయనిగరణముం దెలుపున దగుటచే వ్యంగమర్యాదతో నొప్పి, ఎంతయు రమణీయముగ నున్నది.

దమయంతి—"నడుము మాయ కేదారము నాభి కుచయుగమ్ము శ్రీగిరి కూర్మము
కాళ్లమీఁదు మోవి మధురాంక మని కాంచి పువ్వుఁబోఁడిఁ బైర్థికులు దలంచె
దరు క్షేత్రచయ మనుచు" 2 త. 22

ఈపద్య మీక్రిందిశ్లోకమును బోలియున్నది.—

"మధ్యం విష్ణుపదం కుచౌ శివపదం వక్త్రం విధాతుః పదం
ధమ్మిల్లం సుమనఃపదం ప్రవిలసత్కాంచీ నితంబస్థలీ
వాణీ చేన్మధురాధరో ఒరుణధరః శ్రీరంగభూమి ర్వపు
స్తస్యాః కిం కథయామి ధన్యచరితం మాన్యా సదా నిర్జరైః."

ఈశ్లోకమున శ్లేషము గలదు. కాని, "మాన్యా సదా నిర్జరైః" అనుచోట, అది పామరమర్యాద ననుసరించియున్నది. ఇఁక, నాయికాశీలపోషణబాధ్యత నెఱింగిన మహామహోపాధ్యాయుఁడు, శ్రుతి రతుల నేకీభవింపఁజేసిన పెద్దనామాత్యునివలె, దమయంతీసౌందర్య వర్ణనమును, ఆమెశీలపోషణము నొనరించి, అవి జోడించి, సెబా సని పించుకొనఁజాలె.

బాల్యవర్ణనము—"దాఁగురుమూఁతలాడు మని..." 2 త. 15
"నీతికి వెలి యని తోఁచిన..." 2 త. 16

"ఆటలసందడింబట్టి పాటలు మఱచినట్లు" వర్ణనోద్రేకమున శీల పోషణము మఱచుట ప్రబంధములలో గొన్నియెడలఁ గానవచ్చును. పైపద్యములనుగూర్చి పర్యాలోచించుచో వర్ణన మొనర్చునప్పుడును శాస్త్రిగారు తమకవిసార్వభౌమత్వమును ఠీవిగాఁ జూపినా రననగు. దమయంతీసౌందర్యవర్ణనపద్యములు మనోహరము లగునవి పెక్కులు కలవు

## చరిత్రాంశములు.

1 త. 24, 25, 26 లోను, 2 త. 53, 54, 55 లోను, చరిత్రాంశ ములు వర్ణితములయినవి.

## నీతులు.

3 త. 124, 134 లును, 4 త. 108, 109, 129 లును, 5 త. 13, 14, 18, 44, 64, 65 లును, 6 త. 21, 67, 143 లును నీతులు తెలుపును.

## శైలి.

"కనిరొక్ భీమసుతన్..." 3 త. 143

ఇట్టిపద్యములశైలి సోమన, పోతన, పెద్దనల శైలిం దలఁపించుచున్నది.

## పాకము.

"పాక ముదీరితార్థపరిపాకము." నరసభూ.

పాకమనంగానర్థనిరాకులగంభీరయుక్తి" కా. చూ.

శృంగారనైషధము నారికేళపాకమున నున్న దనిరి కీ॥ శే॥ కలాప్రపూర్ణ వేదము వేఁకటరాయశాస్త్రిగారు. మనకలాప్రపూర్ణుఁడు శృంగారతరంగిణిని మెత్తనిపాకమున ద్రాక్షాపాకమున రచింతునని తెలిపి, అటులే చేసె. ఇప్పటి కీపీఠికలో వచ్చిన పద్యములే దానికి నిదర్శనములు. కథాసందర్భావశ్యకతం బట్టియో, చమత్కారవర్ణనావశ్యకతంబట్టియో, పాండిత్యప్రకర్షప్రదర్శనావశ్యకతంబట్టియో, కొన్నిపద్యములు నారికేళపాకమునఁ బడినఁ బడుఁగాక! మొత్తముమీఁద శాస్త్రిగారు తమప్రతిన ననుసరించి మెత్తని ద్రాక్షాపాకముననే తమకృతి కూర్చినారని యొప్పుకొనక తప్పదు.

"బహిరంతఃస్ఫురితార్థో, పహితరసప్రసర మగుచుఁ బద్యము సుఖసం
గ్రహపద మెచ్చట నది వో,మహి ద్రాక్షా పాక మనఁగ మధురం బెపుడున్." కా.చూ.

ద్రాక్షాపాకమున కుదాహరణము లిచ్చుటకంటె శృంగారతరంగిణియంతయుఁ జదువుఁడని చదువరులఁ గోరుటయే మంచిది.

## అలంకారములు

"కావ్యశ్రీల నలంకరించుట నలంకారంబులై" కా. చూ.

"అలంక్రియావితానము సొమ్ముల్" నరసభూ.

ఇవి శబ్దాలంకారములు, అర్థాలంకారములు— అని రెండు తెఱంగులు. అందు ముఖ్యము లర్థాలంకారములే. అందు, ఉత్ప్రేక్ష-అతిశయోక్తి మొదలగునవి స్వభావవిరుద్ధము లని యింగ్లీషు కావ్యములు చదివినవారు పెక్కురు వానిని మెచ్చరు. ఇంతకు వర్ణించు వస్తువు కన్నులకుఁ గట్టునట్లు చేసి, దానికి మెఱుఁ గిడునదే— అలంకారము.

నిషధపురికోటకొమ్మలమీఁదివజ్రములు తాఁకుటచే సూర్యుఁడు పండ్రెండువ్రక్కలై, త్రుళ్లడఁగి, ముందువెనుకల కూఁగుచుండుటవలననే, ఉత్తరదక్షిణాయనములును—సూర్యునికి ద్వాదశాత్మకతయుఁ గలిగిన వని (1 త. 106) వర్ణించుటచేత, మనకవిసార్వభౌముఁడుకూడ నుత్ప్రేక్షాద్యలంకారరచనమున వెనుకటిప్రబంధకవుల కేమాత్రము తీసిపోనట్లు స్పష్ట మగుచున్నది.

## ఉపమ

"అందమునకుఁ జందమునకు, నెందులకుం దగినమీర లిద్దఱు గూడం
గుందనము మణియుఁ గూడిన, చందం బగుఁ గాదె రాజచంద్రా! కలఁపన్" ౧త.79

ఈపద్య ముపమతో నందచందములకు మూలకందంబై, నలుని డెందముం దనియింపఁజాలినది; చదువరులడెందముం దనియింపఁజాలదా?

## రూపకోత్ప్రేక్షలు

"పొలుపుగ నొక్కకూటమున విరియఁబూచిన మల్లెపొదం గడంగి తేఁ
టులు గలయంగ వ్రాలి యెపుడున్ విడకుండఁగ నొప్పె నప్డు పెం
పలరఁగఁ బెండ్లియాడి యట నామనివెన్నుఁడు తోఁటలచ్చియున్
దోలిఁ గళింజాలుముత్తెములునుం దలఁబ్రాలుగఁ గొన్న ప్రోవనన్" 2 త. 48

"ఆమనివెన్నుఁడు", తోఁటలచ్చి"— ఎంత సొంపగు రూపకములు! అచ్చతెనుఁగులు!! ఉత్ప్రేక్షయు యథార్థస్థితిని దెలుపుటలో మఱెంత తోడ్పడుటంబట్టి యెంతో యొప్పియున్నది.

## అర్థాంతరన్యాసము

"అవహా! సత్కులజుండ వీవు......
సహవాసంబున దోస మబ్బు నను బాసల్ రిత్త వో నేర్చునే!" 3 త. 33

## భ్రాంతిమంతము.

"మెలి గొని యొం డొకం డరయ...యిపుడర్క బమ వాడు న త్తఱిన్." 2 త. 47

## నిరుక్తి.

"నలునిసోయగము న్విని......నిలుచుట ననిమేషు లైరి వారు" 3 త. 55

## సందేహము.

"ఎవతెవు తల్లి!...వనదేవివో తెలియఁ బర్వతదేవివొ లేక వారిదేవివో..."
5 త. 115

## శ్లేషము.

"కచకుచోరునితంబకమ్మలు గురువులు...
నకియఁ గవు లెంత్రు లక్షణశాస్త్ర మనుచు" 2 త. 22

## స్వభావోక్తి.

"చల్లఁగ గాలి వీచెను...సుత గల్గు న త్తఱిన్" 2 త. 7

ఇట్టివర్ణనము ప్రకృతివిరుద్ధమని నవనాగరకులు కొందఱు పరిహసించెదరు. కాని, మహాపురుషు లుదయించినపుడు ప్రకృతి చల్లఁగనుండుటయు, మహోపద్రవములు రాఁగలకాలమునఁ దోఁకచుక్కలు పుట్టుట-ఉల్కలు రాలుట మొదలగునవి సంభవించుటయు సహజము. యూరపుఖండమున జరుగుయుద్ధము మహోపద్రవకారణ మగునని తెలుపుటకో యన నిపుడు తోఁకచుక్క పుట్టుటయే దీనికి నిదర్శనము. తెలియనివారి కిది వింతయనిపింపవచ్చునుగాని తెలిసినవారికి రవంతయు వింతగాదు. కనుఁ డీక్రిందికాళిదాసునిశ్లోకము.—

ప్రసన్నది క్పాంసువివిక్త వాతం శంఖస్వనానంతరపుష్పవృష్టి
శరీరిణాం స్థావరజంగమానాం సుఖాయ తజ్జన్మదినం బభూవ"

## క్రమము.

"ఇందుబింబమునందుఁ గందుచేసిన రట్టు..." 2 త. 130

ఇవి మచ్చుగా నిచ్చితిమి. అలంకారప్రియులు తక్కినవి పొత్తము చదువునెడ గుర్తింపనగు.

## కొన్ని సూచనలు.

ఇప్పటికి మాకు నచ్చిన కావ్యగుణములు కొన్ని తెలిపితిమి. మిగిలినవెల్ల రసజ్ఞులు గ్రహింతురు గాక! గుణములు దెలుపుటతోడనే విమర్శకులపని ముగియదు. కాన, వలయు నని తోఁచిన కొన్ని సూచనలం దెలిపెదము. ఎంత మెలఁకువగా నుండఁ దలఁచినగూడ నెప్పుడో యే మఱుపాటుతఱినేని పొరపాటు లెవరికేని రావచ్చును. "ప్రమాదో ధీమతా మపి" అనుమాట పుట్టుటకు హేతు వదియే. ఇది యెఱింగియే కవిసార్వభౌములయ్యును శాస్త్రిగారు "దోషము లెందే నగు" నని తెలిపినారు. అయినను, మావిమర్శననియమము ననుసరించి, ఇం దేదిగాని దోష మనియేని, ప్రమాద మనియేని తెలుపఁజాలము. సంస్కరణ మావశ్యక మని తోఁచినపట్టుల, మాధర్మముంబట్టి కావ్యగౌరవము హెచ్చింపఁగోరి, కొన్ని సూచనలు చేసెదము. అందులకు శాస్త్రిగారు మమ్ము మన్నింతు రని నమ్మెదము.

అచ్చుతప్పులను గూర్చి కాని, వ్రాఁతపొరపాట్లనుగూర్చి కాని కృతికర్తగారే చూచుకొందురు. కాన, వానింగూర్చి మే మెత్త నక్కఱ లేదు. రెండవకూర్పున మీఁదఁదెలిపినట్లు మేము చేయుసూచనలంబట్టి సంస్కరణము చేయఁగోరెదము.—

(౧) నలుఁడు దూతగా వచ్చినపుడు శృంగారనైషధము ననుస రించియేయైనను దమయంతిచెలులశీలమునకు భంగకరముగ వారిచర్యలు వర్ణించిన వర్ణనములు తొలఁగింప నగును.

(౨) ద్వితీయస్వయంవరసందర్భముననున్న "బ్రదికెనో చచ్చెనో" అనుపద్యము మార్పనగును.

(3) "తిరుగుచుండిరి" (3 త. 43), "చెన్నలరారుచుండెనో" (3 త. 148), "వాఁడెట నుండెనో" (5 త. 107), "తెల్పుచు నుంటి" (3 త. 98), "అర్థించు చుంటి" (3 త. 128), "నీ కుండెనో" (4 త. 86) మొదలగు భూతార్థకక్రియాప్రయోగములు నన్నయాది పూర్వకవి ప్రయోగపద్ధతి ననుసరించి సంస్కరింపనగు.

## కొలికిముక్క.

చమత్కారకల్పనాకల్పవల్లియు, సత్కావ్యలక్షణలక్షితయు, హ్లాదమయయు, రసస్వరూపిణియు, నలదమయంతీశీలాశంసినియు నయి శృంగారతరంగిణి యను రెండవపేరఁ జెలంగు నైషధీయచరితము పూర్వ మహాప్రబంధశ్రేణిలోఁ జేరి, కృతికర్తృకృతిపతులకు మంచిపేరు తెచ్చి, తాను పేరొందుఁగాక!

ఈప్రబంధరత్నముం గొని, చదివి, తద్రసము గ్రోలి, రసజ్ఞు లానంద మొందుదురుగాక!!

ఇది చదివిన "విద్వాన్" శ్రీగంటి జోగిసోమయాజి, ఎం. ఏ., ఎల్. టి., గారు, ఆంధ్రవిశ్వకలాపరిషదుపన్యాసకులు, "ప్రాచీనుల పోకడల ననుసరించి ధారాశుద్ధి గలిగి పాండిత్యమునఁ గబ్బములు వ్రాయువారు నేఁడు లేనే లేరుగదా. అట్టిసందర్భమున నాలోటును లేకుండఁ జేసి నిజముగ శ్రీనాథాదులను మఱపించు నట్టు లీగ్రంథమును వ్రాసి కవిసార్వభౌమబిరుదమును వీరు సార్థకపఱచుకొని రనుట మిక్కిలి ముదావహము. శ్రీకృష్ణభారతాద్యనేకకృతికర్తలైన శ్రీకవిసార్వభౌము లిట్లు సొంపుగ నైషధీయచరితమును వ్రాయఁగల్గి రనుట యొకవిశేషము కాదనియుఁ జెప్పనొప్పును."

అని యభిప్రాయ మిచ్చియున్నారు.

దీనియందే చేసిన కవిసార్వభౌముని యీశ్వరస్తుతితోడనే మా విమర్శకపీఠిక ముగింతుము.

"వెలయఁగ వేయిశీర్షములు వేయిపదంబులు వేయికన్నులుం
గలిగి విరాట్స్వరూపము జగంబుల నించి సృజించి పెంచుచున్
విలయ మొనర్చుచున్ వెలుఁగువేల్పు నిరంజన నిర్వికల్ప ని
శ్చల నిరుపద్రవాఖ్యల నెసంగెడు దేవుఁడు మమ్ముఁ బ్రోచుతన్"

దిం-౨-౧౯౪౧,
కవితాసమితి,
విశాఖపట్టణము.

మారేపల్లి రామచంద్రశాస్త్రి.
గొబ్బూరు వేంకటానందరాఘవరావు.
నిరోగి రామమూర్తిశాస్త్రి.

VIDWAN
G. J. SOMAYAJI, M.A., L.T.,
LECTURER, ANDHRA UNIVERSITY.

MAHARANIPETA P.
VIZAGAPATAM.

*Dated 21—2—1941.*

"ప్రాచీనుల పోకడల ననుసరించి ధారాశుద్ధి గలిగి పాండిత్యమునఁ గబ్బములు వ్రాయువారు నేఁడు లేనే లేరుగదా. అట్టిసందర్భమున నాలోటును లేకుండఁజేసి నిజముగ శ్రీనాథాదులను మఱపించునట్టు లీగ్రంథమును వ్రాసి కవిసార్వభౌమబిరుదమును వీరు సార్థకపఱచుకొని రనుట మిక్కిలి ముదావహము. శ్రీకృష్ణభారతాద్యనేకకృతికర్తలైన శ్రీకవిసార్వభౌము లిట్లు సొంపుగ నైషధీయచరితమును వ్రాయఁగల్గి రనుట యొకవిశేషము కాదనియుఁ జెప్పనొప్పును."

గంటి. జోగి. సోమయాజి వ్రాలు.

# విజ్ఞప్తి.

సుమారు మూఁడుసంవత్సరముల క్రిందట నేను నెల్లూరికిం బోయియున్నప్పు డీగ్రంథ మిట్లు చేయవలసిన యదృష్ట మేర్పడినది. దీనికి కృత్యాదిమర్యాదలుం జరిగినవి. ఇప్పటికి ముద్రించుముచ్చటలుం దీరినవి. దీనిని మొదట నాయెదుటనే ముద్రించుట కంగీకరించియుఁ గన్ను చక్కఁగ లేనికతంబున నాకార్యము శ్రీతూములూరి వేంకటశివరామయ్యగారిమీఁదనే మోవంబెట్టితిని. వా రెవరిచేతనో తగినవారిచేతనే ప్రూపులు దిద్దించియుందురు. కడపటిది నాకును వచ్చుచుండెంగాని పై కారణంబున నేనును సరిగాఁ జూడలేకపోయితిని. దీని ప్రూపుచూచినవా రరసున్నలు లోనగునవి చక్కఁగాఁ బరిశీలింతురు. సామాన్యముగా గణముపోయినను, యతి పోయినను, ప్రాసము పోయిన నంతగా గమనింపరు. అది కవితప్పే యనుకొనరు. కవియుఁ గంపోజిటరు నొకేగతిఁ బ్రమాదము గలవా రని తలంపరు. ఆకారణమున నిందుఁ బెక్కులు తప్పులుపడినవి. ఇపుడు వాని కొకపట్టిక వ్రాయుట తప్ప నొండేమియుం జేయవీలు లేదు కదా! దీనికి రెండవముద్రణ మగు భాగ్య మున్నచో నప్పటివారు సవరింతురని నమ్ముచున్నాను.

ఇప్పటియాచారమునుబట్టి యీగ్రంథమున కొకపీఠిక వ్రాయ నెంచియున్నప్పుడు రాజమహేంద్రవరములో మధురకవి నాళము కృష్ణరావుగారి షష్టిపూర్త్యుత్సవముం బురస్కరించుకొని విశాఖపత్తనము నుండి శ్రీమారేపల్లి రామచంద్రశాస్త్రిగారు మాయింటి కతిథులుగా దయచేసిరి. ఆసందర్భమున వారిచేత దీనికిఁ బీఠిక వ్రాయింపవలయు నని యభిలాష జనించినది. రామచంద్రశాస్త్రిగారు— ఇంగ్లీషు, తెలుఁగు, సంస్కృతము, చక్కఁగా నెఱింగిన విమర్శకులు. పెక్కుకృతులు రచించినవారు. ఇప్పు డొకయపూర్వమైన తెలుఁగునిఘంటువు వ్రాయుచున్నారు. అట్టివారు గ్రంథమునకుఁ బీఠిక వ్రాసినచో లేని ప్రాశస్త్య మేర్పడు నని తలంచుకొని వారికి విన్నవించితి. వా రనేకములు ప్రతికూలోక్తు

లాడియు నాప్రార్థనముం ద్రోసివేయఁజాలక "గొబ్బూరు వేంకటానంద రాఘవరావుగారు లోనగువారు నాకు మిత్రులు కలరు. వారు మీకును మిత్రులు, విమర్శకులు వారును నేనునుం గలసి పీఠిక వ్రాయుదు" మని సెల విచ్చుటం జేసి నాయొద్దనున్న పుస్తక మొక్కటియు వారి కిచ్చితిని. వారు మిక్కిలి శ్రమ చేసి యిట్లు పీఠిక వ్రాసియిచ్చినందులకు నేనెంతయుం గృతజ్ఞుఁడ నయి ఆత్రిమూర్తుల కభివందన మాచరించుచున్నాను.

పీఠిక యనునప్పుడు తప్పొప్పులను జెప్పునదియే పీఠికగాని తక్కిన పీఠికలు పీఠికలు కాఁజాలవు వీరు ముప్వురును మూఁడుమూర్తులై నా గ్రంథముం బరిశీలించి నాకుఁ గొన్ని సూచనలు చేసియున్నారు. లోగడ గ్రంథగుణాభివర్ణనము చేసినప్పటికన్న నీసూచన చేసినప్పుడు చదివిన నేనెంతయో సంతసించితి ననుట సత్యదూరము కాదు. "హేమ్నః స్సంలక్ష్యతే హ్యగ్నౌ విశుద్ధి శ్శ్యామికాపి వా" కాల్చినప్పుడుగాని బంగారమువన్నె తెలియరాకుండునట్లే యిట్టి సూచనలు చేసినప్పుడే గుణదోషప్రకటన మగుననుట నిశ్చయము. వారు చేసిన సూచనల ప్రకారము నా దోసములను నేను సవరించుటకే ప్రయత్నింతునుగాని ఆయాచోట్ల నేను బడినప్రమాదము లోకమున కించుక తెలుపుట సముచితము కాకపోదు.

1 "నలుఁడు దూతగా వచ్చినప్పుడు దమయంతిచెలుల శీలమునకు భంగకరముగ వారిచర్యలు వర్ణించిన ఘట్టము తొలఁగింప నగు" తొలఁగించెదను గాని—చెలులశీలమునకు భంగకరములుగనైన వారి చర్యలెవ్వియో? చర్చించుకొందము:— 3 త. 134 పద్యము.

మ. "నరనాథాగ్రణి బాహుకీర్తిమణులన్ లగ్నంబుగా లాగికో
వరచేలాంచల మల్లజాఱిపడుటన్ వక్షోజముల్ గప్పకే
తరుణీరత్న మొకర్తు పోవఁ గనుటల్ తప్పించుఁ దప్పించి మో
మరిలన్ వేఱొకవైపు గాఁ గలిగెఁ గాంతాంగాతిసంస్పర్శమున్".

అది యేకాంతస్థలము. స్త్రీలు మాత్రమే యుండునది. పురుషులందుఁ బ్రవేశించుట మిక్కిలి తప్పు. దేవతలు పుచ్చుట నలుఁ డటకు వచ్చుట మొదటితప్పు సరే యుండనిండు. తరుణి పయ్యెట జాఱిపోయినది. అది సరిచేసికొనలేదు. సిగ్గు లేక వక్షోజములు గప్పుకొనలేదు.

పురుషు లున్నప్పుడే సిగ్గు. స్త్రీలలో స్త్రీలకు సిగ్గుండదు. ఇందు స్త్రీల శీలము పోయియుండునా? అది యెట్టిదోష మైనఁ జేసియున్నదా? అట్లున్న స్త్రీనిఁ జూచుట దోష మని నలుఁడు మాఱుమోము పెట్టినాఁడు. ఇంతటి తప్పు కనఁబడుచున్నదా? అటుమోము పెట్టునప్పుడు మఱియొక స్త్రీశరీరము తాఁకినది ఇది దోష మందురా? ఎవరిది? నలునిదా? స్త్రీలు క్రిక్కిరిసియున్న చోటికిఁ బోయెఁ గావున నతనిదే యనవలయును. పోక తప్పినది కాదు పాపము!! 134 పద్యము:—

మ. "ఒకచో నింతులు బంతు లాడుకొనఁగా నుత్సాహముం జేసి మీఁ
దికి బంతి న్విసరంగఁబోయి నలధాత్రీనాథుచేఁ జిక్క ము
ద్రికచే నొక్కి యతండు దాని మరలన్ ప్రేయంగ వా ర్విస్మయో
త్సుకలై చూపిరి దానిపై నలలిపుల్ గన్పట్టుటల్ భైమికిన్".

స్త్రీలు బంతు లాడుకొనుచున్నారు. బంతి వచ్చి సమీపమున సంచరించు నలునిచేతఁ జిక్కినది. దానిపై తనముద్రిక నొక్కి తిరుగ వ్రేసె. ఇందు స్త్రీలశీలము పోయినట్టు పోకడ కలదా? 136 వ పద్యము:-

మ. "సుకుమారుం డట నైషధుండు "ముకమల్ సోఫా" పయిన్ మేను సే
ర్చి కడం గందుకకేళిఁ దేలు సఖులం బ్రీతి న్విలోకించుచో
సకి యొక్కర్తుక వచ్చి సంభ్రమముతో క్ష్మానాథుపై వ్రాలి లో
సుకమైన న్వెఱఁ గొట నెచ్చెలుల కాచో వ్వెల్లఁ జెప్పెం దగన్".

సుకుమారుఁడగు నలుఁ డటఁ దిరిగి తిరిగి యలసి యట నొక సోఫా యుండ దానిపై మేను చేర్చియుండె. అప్పుడొక స్త్రీ దానిపైఁ బురుషుఁ డున్న సన్నయెఱుంగక తొందరతో వచ్చి పండుకొని, మనుష్య సంపర్కమైనట్లు తలంచి నివ్వెఱంపడి నెచ్చెలులకుం జెప్పినది. ఇందు శీలమునకు లవమాత్రమైన లోటు వాటిల్లునా? 137 వ పద్యము:—

తే. "నిషధరా జొక్కచవికలో నిలువ నటకుఁ,దటుకున న్వచ్చి యొకచేఁడె తనయురోజ
ముల నతని నొత్తి నలుగడం గలయఁ జూచి, పడియె న్భ్రమ తనసుఖస్పర్శమునకు"

ఇదియు పైపద్యములవంటిదే. చవికలో నిషధరా జున్న ట్లెఱుంగదు. స్వైరవిహారమును చేయుచు నటరా నట్లు జరిగిన సుఖస్పర్శమున

కచ్చెరువు పడినది. ఇందు నలునిదోషమును జ్ఞాపట్టదు. తాను దొలంగి యున్న నట్లు తటస్థింపవచ్చును. 138 వ పద్యము:—

క. "ఆనాఁ డష్టమిఘటికలు, గాన సుఖస్పర్శ మగుటఁ గళ గరఁగి కడుౕ
మానసమున నానందము, మానిని దా ననుభవించె మఱియుౕ మఱియున్"

అష్టమినాఁడు స్త్రీకిఁ గళ యురోజముల నుండును. అట దైవ ఘటనం జేసి పురుష దేహస్పర్శ మైనది. కళ గరగినదని కల్పనము. ఇందు దానిశీలమునకు భంగపాటు వాటిల్లెనా? అది యేమి తప్పుచేసినది? అష్టమి చేసినది. 139-వ పద్యము—ఇందు దమయంతీప్రీతికై స్త్రీ లం దఱుగలని నాటకముం బ్రదర్శించిరి. ఇది శీలముం బోగొట్టునా? రంగస్థల ములో మహారాజులసమక్షమున గాదు. అంతఃపురములో నాఁడువాం డ్రలో నాఁడువాండ్రే. 140—ఇందులో మాయలాఁ డెవ్వఁడో యిటకు రాఁబోలు నని భయావృతాబలస్వాంతలై వెదకఁబూనుట, పురుషుఁ డంతిపురిలోనికి వచ్చెనన్నచో రాజువలనిభయము, అంతిపురము నందలి కట్టుబాట్లు తెలియుచున్నవి. ఇవియే సూచనలో విమర్శకులు శీలముం బాపునవి యని వ్రాసియున్నారు. ఇదియంతయును దిరస్కరిణీ ప్రభావముగాని మఱియొకటికాదు. ఇందు చెలులశీలము రక్షింపఁబడి యేయున్నదని నే ననుకొంటిని. మఱియును అంతిపురములలోని స్త్రీలు స్వేచ్ఛావిహారము సేయుచుందురు. దమయంతిచెలికత్తె లనంబడు నీ స్త్రీ లెవ్వరు? భర్తలతో సంసారము చేయుపుణ్యస్త్రీలా? కారు. వా రంతి పురంబులకు రారు. పరిచర్య చేయరు. వీరు పరిచర్య సేయు దాసీలవంటి వారు. వీరికి సామాన్యముగా వివాహము చేసికొనుట యుండ దని తలంచెదను. ఇట్లు నేనేకాదు, నైషధములో శ్రీహర్షుఁడు:— 6-వ సర్గము:—

శ్లో. "దోర్మూల మాలోక్య కచం రురుత్సో స్తతః కచౌ తా వసు లేపయన్త్యాః,
నాభీ మధ్యైక్షి శ్లథవాససోను మిమీల దిక్షు క్రమకృష్టచక్షుః"

శ్లో. "పాతః కయాచిత్పృథి కందుకేన సంఘట్య భిన్నః కరజైః కయాపి,
కయా చ సా త్తః కుచకుంతుమేన సంభుక్తకల్పస్య బభూవ తాభిః"

ఇట్లు చెప్పియున్నాఁడు. ఈయర్థములనే వెల్లడించుచు శ్రీనాథుఁడు తనశృంగారనైషధములో నిట్లు చెప్పియున్నాఁడు. 3 ఆశ్వాసము 86-వ పద్యము:—

చ. "ప్రిదిలిన నీవి కేల సవరించు తలోదరి యోర్తుఁ గాంచి లోఁ
గదిరిన పాపభీతిఁ బతికన్నులు మోడ్వ నొక ర్తోకక్షకై
యెదురుగ వచ్చి వచ్చి యొకయిద్దఱుముద్దియ లార్తి రన్విభుక్
మదగజరాజకుంభముల మచ్చరికించు కుచద్వయంబులన్".

94 వ పద్యము:—"విరిసెను నీవిబంధ మది విస్మయ మొందఁగఁ దోడి భామినుల్".

95 వ పద్యము:—"కాంచనపుబంతులఁ గ్రచ్చఱవాటు లాడఁగా
ధరణిపుఁ డడ్డమై చనుడుఁ తద్భుజదండముఁ దాకి మెట్టి".

ఇట్లు మూలకవిని మించి యెన్నియో విధములఁజెప్పియున్నాడు. ఇదియుంగాక వ్యాసభగవానులు తనశ్రీమహాభారతములో ఆరణ్యపర్వము 56-వ అధ్యాయమున:—

శ్లో. "తతస్తా నైషధం దృష్ట్వా సంభ్రాంతాః పరమాంగనాః
ప్రశశంసుశ్చ సుప్రీతా నలం తా విస్మయాన్వితాః
న చైన మభ్యభాషంత మనోభి స్త్వభ్యపూజయన్
అహో రూపమహో కాంతి రహో ధైర్యం మహాత్మనః
తేజసా ధర్షితా స్తస్య లజ్జావత్యో వరాంగనాః."

అని వ్రాసియుండెను. ఇందు—సుప్రీతాః, మనోభి స్త్వభ్యపూజయన్, అహోరూప, మహోకాంతి, రహో, తేజసా ధర్షితా స్తస్య, లజ్జా వత్యః, ఇత్యాదులచే దమయంతిచెలికత్తియలు నలునిఁ జూచి మోహవివశలై మాటలాడలేక మనస్సునఁ బూజించి రనఁగా మనస్సులోనే కోరికిం జేసి రని యభిప్రాయము. ఇట్లు మహాపురుషునిం జూచి చలించి రనుటలో ఆస్త్రీలశీలమున కించుకలోపము చూపట్టక మాన దని నాతలంపు.

2 ద్వితీయస్వయంవరసందర్భమున నున్న "బ్రతికెనో చచ్చెనో?" అనునది యశ్లీల మనియు మార్పవలయు ననియు సూచన. బ్రదికెనో చచ్చెనోయనునప్పుడు విన్నవారికిఁ గష్టముగా నుండు నేమొ కాని,

ఇక్కడ నిట్లే చెప్పవలయునేమో యని వ్రాయుట నాపొరపాటు కావచ్చును. ఏకారణమున నిట్లు దమయంతిచేతఁ జెప్పింపవలసి వచ్చెనో కాని మూలమున నిట్లున్నది. శ్రీమహాభారతము నలోపాఖ్యానము 71 అధ్యాయము 28-వ శ్లోకము:— "న హి న జ్ఞాయతే ధీరో నలో జీవతి వా న వా" అని దమయంతి పలికిన ట్లున్నది. నే నిది చూచియే "బ్రదికెనో చచ్చెనో" అని వ్రాసితిని. ఇది సూచనలో సవరింపు మనిరి గావున నట్లు చేయుటయే నావిధి. మఱియుం గొన్ని భూతార్థక్రియలవిషయమై సూచించియున్నారు. వాని నెల్ల యథాన్యాయంబుగ సవరించుటకై ప్రయత్నింతును. మఱియు నెల్లరు, దృష్ట్లను లోనగునవి సూచించిరి. కోటి, పిప్పల్యాదుల కీరూప మొప్పు నని బాలవ్యాకరణము చెప్పుటయే కాక బహుప్రయోగములును గలవు. భారత మాదిపర్వమున నన్నయ భట్టారకుడు "దృష్ట్లు" అని వ్రాసియున్నాఁడని విన్నవించుచు వారిపీఠిక వ్రాయుటలోఁ బడిన పరిశ్రమకు మఱియు మఱియు నభినందించుచున్నాను. ఇందుపై నేను గోరకుండ నాయందలి కృపాతిశయముచే మంచియభిప్రాయ మొసంగిన విద్వాన్ శ్రీగంటి జోగి సోమయాజులు, యం. యే., యల్. టి., గారికి నాయభివందనము లర్పించుచున్నాను. ఇందుఁ గొన్నికొన్ని దేశీయపదములు, మాండలికములు చొప్పించుటయే కాక అ. ర. లకు యతిప్రాసముల మైత్రి గలిగించితి. దానికిఁ బండితులు నన్ను గర్హింపకుందురుగాక యని ప్రార్థించుచున్నాను.

శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి.

# తప్పొప్పుల పట్టిక

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 6 | 22 | కరణి | రమణ |
| 8 | 16 | నవియ | నవయ |
| 9 | 13 | వావార్వ | వారార్వ |
| 10 | 19 | పడఁగ | కూడ |
| 15 | 13 | అద్దెపవి | అద్దెపలి |
| 15 | 15 | లక్ష్మఁబెండ్లి | లక్ష్మిమమతఁబెండ్లి |
| 21 | 6 | గడకుమాసపు | గళకుమాసము |
| 27 | 10 | జెట్టి | పెట్టి |
| 27 | 16 | దాగ | దాఁగ |
| 27 | 16 | దాగు | దాఁగు |
| 28 | 10 | దోప | దోఁప |
| 29 | 2 | చూపఱు | చూపఱ |
| 29 | 27 | తేండ్లు | తేంట్లు |
| 31 | 10 | పయ్యెదర్ | పయ్యెరర్ |
| 34 | 5 | బెట్టుచెట్టు | బెట్టుఁజెట్టు |
| 44 | 1 | మొగముఁజేత | మొగముచేత |
| 44 | 26 | పెంపు | కెంపు |
| 50 | 21 | దాపురము | దాఁపురము |
| 54 | 4 | దూరుచు | దూఱుచు |
| 54 | 28 | జారు | జాఱు |
| 55 | 4 | బ్రాకె | బ్రాఁకె |
| 66 | 11 | గంజాక్షి | కంజాక్షి |
| 74 | 9 | జలియింపఁగలేక | జలియింప |
| 75 | 12 | బైమి | భైమి |

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 78 | 20 | తల్లివా | తల్లికా |
| 78 | 27 | గోర్క్యులిఁ | గోర్క్యులీఁ |
| 79 | 13 | వారిక్ | వానిక్ |
| 84 | 3 | నీవే | నీవో |
| 91 | 1 | కోమలి | కాంతను |
| 106 | 18 | గజారోహణంబు | గజావరోహణంబు |
| 106 | 9 | ఏగుబెండ్లి | ఏగుపెండ్లి |
| 116 | 8 | సేవితుఁడు | సేవకుఁడు |
| 121 | 7 | యెక్కిడి | యెక్కడ |
| 134 | 20 | ముట్టి | వట్టి |
| 146 | 26 | గుడుసు | గఱుసు |
| 155 | 12 | యెవర్తో | యెవర్తా |
| 156 | 12 | నన్ను | నిన్ను |
| 156 | 23 | పొగలి | పొగిలి |
| 162 | 9 | నిర్జన | నిర్జర |
| 163 | 4 | డరయనతండా | డితఁడయెన్నంగా |
| 171 | 3 | మణి! | మణీ! |
| 172 | 15 | ధరయెల్లక్ | నభమెల్లక్ |

# నైషధీయచరితము



## శృంగార తరంగిణి

### ప్రథమతరంగము

ఇష్టదేవతాప్రార్థనాదికము.



మీఱన్ గిరిరాజపుత్రిక మెయిం జేకో సగం బెంతయేఁ
బ్రేమన్ గంగయు శీర్షమెక్కి గరిమం బెంపం గుమారుల్ మహో
ద్దామేచ్ఛన్ విపులోరుయుగ్మమును బొందం బొల్చు దేవుండు ని
త్యామోదంబునఁదామలూరిశివరామార్యున్ దయంబ్రోచుతన్.

చ. అరుణశరీరకాంతి దెస లంతర మింతయు లేక నిండుకోఁ
గరముల నాల్గిటం గళయుఁ గంజము పుస్తక మక్షమాలయుం
బరఁగ శివాంకసంస్థ యయి బాలిక వైఖరి భక్తకోటులన్
సురుచిరలీల నేల్ త్రిపురసుందరి మాశివరాము నేలుతన్. 2

ఉ. విక్రమసింహపత్తనము వేడుకఁ జేసి వసించి యచ్చోటన్
సక్రమపద్ధతిం బ్రజల సాఁకుచుఁ బాకపరాదిదేవతా
చక్రసమర్చితుం డయి పొసంగెడు రంగవిభుండు ప్రోచు ని
ర్వక్రదయాతిసాంద్రు శివరామబుధేంద్రునిఁ గీర్తిచంద్రునిన్. 3

మ. కరుణాపాంగవిలోకనంబులను లోకంబందుఁ దా నింత యా
నరుఁ గొండంతగఁ జేసి వానిఁ గనుచుండం జూచి రక్షించునా
సిరి పద్మాలయ పద్మ పద్మముఖి మే ల్సేకూర నెల్లప్పుడున్
సిరులున్ సంపద లిచ్చి ప్రోచుత దయన్ సీతామనోవల్లభున్. 4

---

విక్రమసింహపత్తనము=నెల్లూరు; పాకపరుఁడు=పాకారి, ఇంద్రుఁడు.

చ. తలఁచినమాత్రమాధవుసువంచితనాభిసరోజమందుఁ బెం
పలర స్వయంభువై వెలసినట్టిఁడనై శ్రుతిసుప్రసంగతిన్
గలజగముల్ సృజించు నెఱకాఁ డగువాగధినేత నిత్యని
ర్మలమతిఁ దామములూరిశివరామున కిచ్చుఁ జిరాయురున్నతుల్. 5

సీ. పాలు నీ రేర్పర్పఁ జాలినవెలితెక్క
పక్కి యేదేవత యెక్కిరింత
చక్కెర లెక్కి యు క్కెక్కిన చదువుల
పులుఁ గేపొలంతికిఁ బలుకుతోడు
వెన్నెల ల్వోదచల్లు చిన్నిజాబిల్లి యే
చెలియకుఁ బాపట చేరుచుక్క
కలిగించు మగని మేల్నలుతలవాకిళ్లు
హెచ్చునేసకియకు రచ్చపట్టు

తే. లట్టిసైకతసుశ్రోణి యజునిరాణి, పరమకల్యాణి ఘనవేణి పద్మపాణి
సిద్ధనిశ్రేణి నవితసచ్ఛ్రేణి వాణి, రాణ లెసఁగ వేంకటశివరాము నేలు.

మ. గ్రహరాజై నిజతేజ మెల్లకడలం గ్రాలంగ లోకాళికిన్
స్పృహ గల్గించుచుఁ గర్మసాక్షి యగుచున్ బెంపొంది సప్తాశ్వుఁడై
బహుమార్గంబు పరిభ్రమించుచుఁ బ్రజన్ బాలించు దేవుండు ధూ
ర్వహుఁడై శ్రీశివరామపుత్రునకు శేవం గూర్చు నారోగ్యమున్. 7

చ. అనిలవరప్రసాదమున నంజనకుం బ్రభవించినంతనే
యినుని మహాఫలం బనుచు నెంచి గ్రహింపఁగ మిన్ను ముట్టి పెం
పునఁ జను సత్త్వమూర్తి, జవముం గలఁడై లవణాబ్ధి దాఁటి సీ
తను గని రామునిం దెలుచుదక్షుఁడు మాకృతినాథు నేలుతన్. 8

మ. నలుగుంబిండిని బొమ్మ చేసి యుమ ప్రాణంబుం బ్రతిష్ఠింప ము
ద్దులబిడ్డం డయి వాకిటన్ హరునిఁ బోఁ ద్రోలం గజాస్యంబునుం
గలలుం గల్గి గణాధిపత్యమున వేడ్కం గాంచు ద్వైమాతురుం
డెలమిన్ శ్రీరమణాంబికాసుతుమనోఽభీష్టంబులం దీర్చుతన్. 9

వ. అని కృతిపతి నాశీర్వదించి మఱియును. 10

క. తొలుదొల్త నెవని రసనాంచలమునఁ గవితావధూటి సమ్యగ్ఘనరీ
తుల నాట్య మాడె నక్కవితిలకున్ వాల్మీకిమౌనిఁ దిలకింతు మదిన్

క. ఆదిం బ్రోవగు నాలుగు, వేదంబుల వేఱుపఱిచి పిదపఁ బురాణా
ష్టాదశకం బొనరించిన, వేదవ్యాసుని నుతింతు విశ్రుతఫణితిన్. 12

క. ఘను వాగనుశాసనుఁ దిక్కన నెఱ్ఱాప్రెగడ నాంధ్రకవితాజుని నూ
తనదండి సహజపండితు, వినుతింతుం బాండురంగవిభు శ్రీనాథున్.

క. కవితం గూరిచి విద్వత్కవు లేమని యన్నఁ గౌతుకంబ పెరల్ కా
దవు నం చాడిన లోన వగవ నలవంగాఁ బ్రబంధకవులకుఁ బనియే.

క. అవధానము లనువిద్దెలఁ, దవిలితిఁ గడుకబ్బములను దగ సలిపితి నేఁ
గవిసార్వభౌమబిరుదం, బవుననఁ గైకొంటిఁ గృష్ణుఁడనియెడివాఁడన్

మ. ప్రమదం బేర్పడఁ దొల్లిటం గురుకులావాసంబునన్ నేర్చి కా
వ్యములున్, నాటకముల్, పరిష్కృతులు, శబ్దార్థంబులున్, సత్పరి
శ్రమచే నీకృతి సర్వసమ్మతముగా సంధింతు నట్టైన దో
షము లెందే నగు దిద్దుఁ డార్యులు నమస్కారంబు లర్పించెదన్. 16

వ. అని పూజ్యపూజాతత్పరుండనై యొక్కకాలంబునఁ జెన్నపురికిం బోయివచ్చుచు మార్గమధ్యమందున్న నెల్లూరు నన్నాకర్షించుటం జేసి యట ధూమశకటావరోహణంబు గావించితి నదియును. 17

విక్రమసింహపుర వర్ణనము.

సీ. ప్రవహించు నేప్రోలి పశ్చిమోత్తరముల
సౌన్నాలమణి పేరు పెన్న యేఱు
తళుకొత్తు నేపురి దక్షిణంబున జ్ఞాన
వాపి కోపిన బుద్ధితాపి వాపి
రమణించు నేవీటి ప్రాగ్దిశ నింతలో
నీర్వామి వాకలగుర్వ సామి

యింపొందు నేయూరి యీశాన్యమున నెప్డు
పాయకుండును రంగనాయకుండు
తే. వఱలు నెచ్చట సంస్కృతవాగ్విశాల
యగు కళాశాల హయాణవిద్యార్థిశాల
మండలన్యాయసభయు సన్నిహితమగుచు
నొప్ప నొప్పుచునుండు నెల్లూరుపురము. 18
మ. గురువిద్యావిభవం బదంతయును గైకొమ్మంచుఁ బోఁ గ్రక్కి భా
స్కరునిం గొల్చి మహామహత్త్వమున శుక్లం బైనవేదంబు గ
హ్వరికిం దెచ్చినయాజ్ఞవల్క్యముని లోకారాధ్యుండై లోకముం
బరిపాలింపఁగ నప్పురిన్ వెలయుటన్ వర్ణింపఁగా నయ్యెడిన్. 19
ఉ. ద్రావిడభాష 'నెల్ల'నఁగ ధాన్యవిశేషము చెప్ప వచ్చెడిన్
ద్రావిడు లాదికాలమునఁ దత్పురభూముల నల్కొలంకులన్
బ్రోవులు గాఁగ ధాన్యములు పోయుచు నుండినదాన సార్థకం
బై విలసిల్లె నెల్లు రనునాహ్వయ మప్డును నిప్డు నొప్పుగన్. 20
ఉ. విక్రమసింహుఁ డన్ బిరుదువే ర్గలరాజమహేంద్రుఁ డప్డు ని
ర్వక్రపరాక్రమంబున ధరాతల మేలుచు నందు నుండుటన్
విక్రమసింహనామమున విశ్రుత మయ్యెను బత్తనంబు భూ
చక్రమునందు దాని కెన సల్పఁగ రా వితరంబు లన్నగతిన్. 21
మ. పుడమిన్ సింహపురంబు శౌర్యగరిమం బొల్పొందు నచ్చోటఁ జే
ర్వడి పాటింపఁగ నైనయేనికలు నిద్రం బొందఁ బోవంచు నా
నుడి దేశంబుల మ్రోసి యుండె నట నేనుంగంతవిద్వాంసుఁడుం
గడిమి న్నోరు మెదల్పలేఁ డనుట నిక్కం బెల్లరు న్విజ్ఞులే. 22
చ. అట నొకబావి యుండె నఁట యందలినీళ్లను ద్రావినంతనే
పటుతరవాగ్విలాసములు పర్వఁగ బుద్ధిమదగ్రగణ్యులై
దిటపడి యుక్తియుక్త మగుధీ గలవా రయి జీవు లంతలన్
స్ఫుటగతి గెల్చువా రనుచుఁ బెద్దలు చెప్పుచునుందు రొద్దికన్. 23
ఉ. తిక్కనసోమయాజి యటఁ దియ్యని కైతలు నేర్చి పెన్నపై
చక్కిన యున్న దేవళముసామినిఁ గొల్చుచు భారతంబు న

ష్టక్క యనన్ రచించెఁ బదియైనగుపద్యము లుర్వి మెచ్చ నీ
యెక్కువసుం బురిం గలయహీనమహత్త్వమె కారణం బగున్ 24

మ. రణతిక్కం డటఁ బుట్టినట్టి డగుటన్ రారాజు లగ్గింపఁగా
రణమందున్ రిపురాజి నోర్చి నృపతిన్ రక్షించె ము న్నాక్షితిన్
గణుతింపన్ గుణమే ప్రధాన మగుచుం గన్పట్టు నప్పట్టునన్
రణసింహాల్ కవిసింహు లిప్పటికినిన్ రాజిల్లుచుం డ్రెన్నఁగన్. 25

ఉ. అంకెకు వచ్చినట్టికవి యై మొన మొన్నఁ గవీంద్రవంద్యుఁడై
వేంకటరాయశాస్త్రి యనువేదమువంశకులార్ణవాబ్జుఁ డా
తంకము లేనివైఖరులఁ డా వెలయింపఁడె తెల్గుబాస ని
శ్శంకుఁడు తత్ప్రబంధములె చాటెడు సింహపురీప్రభావమున్. 26

చ. అభినవకాళిదాస బిరుదాంకితులై కుకవీభసింహులై
విభవసమేతులై వివిధవిశ్రుతకావ్యకలాకలాపులై
ఋభుగురుతుల్యులై కవు లనేకులు నేఁటికి మేటిపేర్మిమైఁ
బ్రభవము నొందియుందు రని పత్తనరాజము ప్రస్తుతిం గనున్. 27

వ. ఇట్లఖిలాంధ్రదేశాభరణాయమానంబై కరంబు డంబుమీఱు నప్పురీ
వరంబున. 28.

కృతిపతి ప్రశం

సీ. అడిగినయర్థంబు లర్థుల కఱలేక
యిచ్చెడిముచ్చట నెసఁగువాఁడు
ఘనతర మీయుపకారంబు నీచేతఁ
గాఁ దగు నన్నచోఁ గడఁగువాఁడు
పరుఁ డైన బాధలఁ బడనున్నఁ జేత నై
నంతలోఁ దొలఁగింప నలరువాఁడు
భూతదయాళుత్వబుద్ధి నెల్లెడ మంచి
వాఁ డని పేరంది వఱలువాఁడు
తే. అతఁడు నలువొందు సత్యవాక్యప్రవర్త
కుండు శాంతుఁడు సుగుణసాంద్రుండు మృదుల

హ్రాపియుఁ డాచారనిరతుండు సదమలుండు
తూములువారి వేంకటశివరామసూరి. 29

చ. ఘనుఁ డయి న్యాయవాది యయి కావ్యరసానుభవాంతరంగుఁ డై
ధని యయి కార్యదక్షుఁ డయి దైవతభక్తిసమేతుఁడై మహా
మునిజనసేవకుం డయి సుపుత్రకళత్రసుమిత్రయుక్తుఁడై
తనరుచు నుండు నంచు విని దర్శనముం బొనరింప నేగితిన్. 30

ఉ. ఏగినయంత న న్నతఁ డనేకవిధంబుల నాదరించుచున్
వీఁగనిభక్తితో నెపుడు వేడుకఁ గూర్చుచు భక్ష్యభోజ్యసం
యోగమునందుఁ దండ్రి తనయుం బలెఁ జూచుచు నాకవిత్వమున్
నాగుణగౌరవాదులు మనంబున నెంచుచుఁ బెంచె హర్షమున్. 31

క. మనుగుడుపు సేయువియ్యం, బన నే నాబుధునియింట నభ్యవహారం
బొనరించుచుండి నెమ్మన, మున నెంతయు సంతసంబు ముప్పిఱిగొనఁగన్

ఉ. ఆతనిఁ గాంచి యొక్కదినమం దిటు లంటి, బుధేంద్రచంద్ర! "నీ
నీతియు నీదుదాతృతయు నీదగుయోగ్యత నీదుపాండితీ
రీతియు నీదుగౌరవగరిష్ఠత నీకవితాప్రియత్వమున్
చేతము పల్లవించునటు చేసె నటంచు నిజంబు చెప్పితిన్. 33

ఉ. ఉత్తమనాయకుండ వని యుల్లము పల్లవితంబు గావునన్
మెత్తనిపాకముం గలుగ మేలుకృతిన్ రచియించి నీ కిడన్
జిత్తముచేసితిన్ గొనుము శ్రీయును సంపదయున్ యశంబు నిన్
హత్తగ వచ్చు నందున ననంతములై ద్విజరాజశేఖరా." 34

క. అనినం గా దన కాతఁడు
ననుఁ గని యి ట్లనియె వినయనయవాక్యచయం
బనువొంద "నాదువంశము
తనరెడు నది యయ్యె నేను ధన్యుఁడ నైతిన్. 35

శా. ఓవిద్వత్కవిరాజ, నీదుకవనం బోహో యనం బొల్చెడున్,
నీ వొండొక్కదినంబులో నొకకృతి న్నిర్మింపఁగా నేర్తు, నీ
ప్రావీణ్యంబు జగం బెఱుంగు, నుతియింపం జాల, నీ వన్నిటన్
జేవ ల్దేఱితి వంచు నీదుకృతులే చెల్వొచ్చ వాక్రుచ్చెడిన్. 36

క. కవిసార్వభౌమ, నాయెడ, నవిరళ మగుకరుణ గలుగునట్టిద యేనిం
దపు నటుకలికల్మషహర,మవుకథ రచియించియొసఁగు మాశీఃకృతిగన్."

వ. అని సబహుమానంబుగం బలికి నూటపదియాఱురూప్యంబులతోఁ
గర్పూరతాంబూలం బొసంగినం బుచ్చుకొని వానియిచ్చకుం దగ
మున్ను నే నించుక రచించి యుంచిననలకథాభాగంబున మఱి
కొన్ని క్రొత్తలుం గలయ గూర్చి పేర్చిన విజ్ఞానంబున "శృంగారతరం
గిణి" యనుపేర నైషధీయచరితంబు నొక కావ్యంబుగా రచియింప
నెంచి ముందు మంగళాచరణంబుగా నమ్మహీదేవకులావతంసంబు
వంశావతారం బభివర్ణించెద. 38

కృతినాయకునివంశావతారవర్ణనము.

సీ. శ్రీరమణీమణీజీవితేశ్వరునాభి,సరసిజ మేస్వామిజన్మభూమి
తలవాకిళుల మెల్లఁ గలిగిలోకము లేలు,తరళాక్షి యే వేల్పుధర్మపత్ని
క్షీరనీరవిభాగ మారసి చేసెడు,పక్కి యే దేవరయెక్కిరింత
దేవమునీంద్రులు దీపించునిక్కపు,జగ మేమహాత్మునితగిన యింకి

తే. అతఁడు నలువొందు శ్రీకాయజాగ్రజుండు
బ్రదుకుప్రొద్దుల నొసళుల వ్రాయువేల్పు
వేల్పులకుఁ బెద్ద వెలిదమ్మి వెలుఁగు మేటి
జగములం జేయుదిట్ట మేల్ జన్నిగట్టు. 39

క. ఆతనివంగసముందుఁ
భూతలమున హారితుఁ డనఁగ మునిపుంగవుఁడై
ఖ్యాతిం గనెఁ దద్గోత్రో
ద్భూతులు పెక్కండ్రు ద్విజులు పొలిచిరి పృథ్విన్. 40

క. వారలు నానాదేశము, లారూఢిఁ మెట్టి మెట్టి యందం దుంటఁ
జే రయ్యె నాఁడునాఁటికి, వారికి నానాఁట నాఁటివా రన నందున్.

సీ. అఖిలవిద్యాధ్యయనాధ్యాపకాంచిత, నయకోవిదులు వెలనాటివారు
పౌండరీకాదిసవనకాండసుకరణా,నందసాంద్రులు వెలనాటివారు
ధిక్కృతశిబికర్ణదివ్యాగమవితర,ణప్రకాశులు వెలనాటివారు
అవ్యయజీవేశ్వరాద్వైతమతవ,ర్తనస్వభావులు వెలనాటివారు

తే. వారిలోపలఁ జెక్కుంద్రప్రు వరుసఁ జనిన
యంతఁ దూముటూరసుగ్రామమందుఁ దొలుతఁ
గాపురంబుగ నుండినకతనఁ దూము
టూరివా రన నొకకొంద ఱొప్పి రందు. 42

క. కామేశ్వరసన్నిభుఁ డై, కామేశ్వరశాస్త్రి శాస్త్రకలితోత్తమమే
ధామహితుఁ డగుచు విద్వ, త్స్తోమస్తుతుఁడై తలిర్చె క్షోణీస్థలిలోన్.

సీ. నలువయే వేనోళ్లచిలువయే రా నిమ్ము
వేదశాస్త్రమ్ముల వాదొనర్ప
జీవుఁడే కానిమ్ము దేవుఁడే కానిమ్ము
బుద్ధిస్ఫ్రూహం జేసి పోకడంతు
నింద్రుఁడే కాని యుపేంద్రుఁడే కాని నా
వైభవంబున సిగ్గుపడ సలుపుదుఁ
గానీనుఁడే కాదు వానీనుఁడే కాదు
వితరణంబునఁ జేసి వెడల నడఁతు

తే. రుద్రుఁ డైనను మఱి వీరభద్రుఁ డైన
నాదువాగాయుధంబుల నవియ నేతు
ననుచుఁ గైఁ గంగణము గట్టుకొనియె ననఁగఁ
ద్యాగియై భోగియై యోగి యయ్యె నతఁడు. 44

తే. అతనికిన్ శివకామ పట్టాభిరాము
లనఁగ నిర్వురుపుత్రకు లలరి రీశ్వ
రునకు సర్వమంగళయందు వెనకయయును
గొమరుసామియు నలరినకరణి ధరణి. 45

వ. ఆకామేశ్వరశాస్త్రిపుత్రులలో 46

మ. శివకామార్యుఁ డనార్యకార్యములకుం జేయూఁత గా కార్యు లె
న్న వదాన్యుండును ధన్యుఁడై తనరి యంతన్ సుబ్బమాంబ న్వివా
హావిధిం గైకొని యాత్మసోదరసుతుం డౌ నాదినారాయణున్
సువృత్తిన్ దత్తునిఁగా గ్రహించి కొనియెన్ దుర్యాశ్రమస్వీకృతిన్.

క. పట్టాభిరామయాఖ్యుఁడు, పట్టియె యగువయసునంద వారాణసికిఁ
బట్టుమెయి నేగి వేదము, పట్టంతయు నెఱిగివచ్చెఁ బ్రాజ్ఞులు మెచ్చన్.

సీ. పట్టాభిరామయ పట్టాభిరాముని
భాతి విఖ్యాతిమై భూతిఁ గాంచి
నారకూచికుమారి నారి సీతమఁ బెండ్లి
యాడి శ్రీశివకామయాఖ్యుఁ బుత్రు
నవల సీతారాము నాదినారాయణు
వేంకటరమణయ వెనుక రామ
కృష్ణయ సుబ్రాము నిచ్చమై నార్వురఁ
బుత్త్రులం గని జగత్పూజ్యుఁ డయ్యెఁ

తే. జక్రవర్తులు, ఋతువులు, శాస్త్రములు వి
శాఖముఖములు, కాలముల్, చక్రము లన
నన్నదమ్ములు వా వార్వు రతిశయించి
పేరు గాంచిరి జగమందుఁ బేర్మి మెఱసి. 49

సీ. అందు సీతారామయాఖ్యుఁడు లక్ష్మీన
రసమఁ బెండిలియాడి రమణ నామె
యందు సుబ్రహ్మణ్య సాంబశివుల్ వేంక
టేశ్వరునిఁ బిత్రృణ మేగఁ గనియె
నాదినారాయణుం డన్నమ్మఁ బెండ్లియై
తాను దత్తుం డయ్యెఁ దమ్మునిసుతుఁ
డైన సదాశివయ్యను దత్తుగాఁ గొనె
నతఁడు ద్వ్యాముష్యాయణాఖ్యఁబరఁగె

తే. వేంకటరమణయాఖ్యుఁడు వేడ్క మణెమ
యందుఁ బుత్త్రుల నాదినారాయణ శివ
కాము లనువారి నిర్వురఁ గాంచి లోక
విశ్రుతం బగుకీర్తిమై వెలసె జగతి. 50

తే. రామకృష్ణుఁ డుద్యోగియై ప్రబలి మొదటి
వనిత వేంకటసుబ్బాంబవలనఁ గనె స

దాశివునిఁ వెన్క సమణమాతన్వివలనఁ
బరమశివుఁ గాంచె దత్తుఁడా ప్రథమసుతుఁడు. 51

తే. సుబ్బరాముఁడు విద్యల సొంపుమిగిలి
సతి మహాలక్ష్మిఁ బెండ్లాడి సుతులు లేమి
భ్రాతృపుత్రుని వేంకటేశ్వరుని దత్త
పుత్రునిగ స్వీకరించి పెంపున నెసంగె. 52

వ. అల్ల పట్టాభిరామాత్మజులలో నగ్రజుం డగు శివకామయాహ్వా
యుండు. 53

ఆ. మొదలివారు ద్విజుల మొదలివా రని వారి
పేర్మిపట్టి గ్రైన వేంకటరమ
ణాంబ వేడ్కఁ బెండ్లియాడి గార్హస్థ్యము
వెలయఁజేసె నామె వలన నతఁడు. 54

ఉ. పిన్నతనంబునంద తమ పెంచెడుతండ్రి పరంబు నొందఁ గా
నన్నయె తండ్రి యట్లనుడి నిజానుజు లందఱుఁ దన్నుఁజేరఁ గాఁ
గన్నకుమారులం బలె నొకానొకయింతయు లోటు లేనియ
ట్లన్నివిధంబులం గనుచు నైదుగురం దగఁ బెంచె నెంచఁగన్ 55

తే. నయము మీఱంగ నుపనయనము లొనర్చి
చదువు చెప్పించి పెండ్లిండ్లు సరగఁజేసి
కూడుగుడ్డల కిడుములు పడఁగ నీక
సోదరులఁ బెంచె నాతఁ డత్యాదరమున. 56

మ. పదియాతేడులయీడునం దతఁడు విద్వత్పట్టముం గాంచి పెం
పొదవం బొల్చిగవర్నమెంటుపదమం దుద్యోగియై యుండి య
ప్పిదపం దా బెజవాడ నింజనియరాఫీస్‌లోన షేనేజరై
పెదజీతంబునఁ బెద్దపత్తనములం బ్రేమించె నుద్యోగమున్ 57

చ. అటువలె రాజకీయపదమం దయి సంస్కృతిపోషణార్థమై
యటమట మొందుచున్నతఱి నాయనభాగ్యము పండె నాఁగ వేం

కటరమణాంబ పద్ధ ధయి కాపురముం బొనరింప వచ్చె ము
చ్చటపడియ త్తవారియుటజంబున కయ్యది యెట్టిలగ్నమో?. 58

మ. తరుణీరత్నము కాలు వెట్టినమొదల్ తండోపతండంబులై
పురము ల్వాస్తులు వాహనంబులు ధనంబు ల్వస్త్రభూషాదులున్
వరధాన్యంబులు మాన్యముల్ గలిగి యాబ్రహ్మాన్వయోత్తంసునిల్
కర మాశ్చర్యకరంబుగా ధనదునిల్ గా మాతె నూ రెన్నఁగన్. 59

తే. అవనిఁ బెంపొందెఁ దూముఁలూఁర్యన్వవాయ
కలశవారాశిచంద్రుండు కాశ్యపీంద్ర
వినుతసద్గుణసాంద్రుండు పనితభూసు
రేంద్రుఁ డమలయశోజితార్యేంద్రుఁ డపుడు. 60

తే. అవని మగఁ డెంతయుద్యోగి యైన నూర్లు
వేలు గణియించువాఁ డైన విజ్ఞుఁ డైన
నాఁడుదానిదియె యదృష్ట మనెడుమాట
సార్థకం బయ్యెనిప్పట్ల నరసి చూడ. 61

సీ. చాపలంబునఁ బెరజనుఁ జేర నొల్లని
మంగళదేవి యీమంగళాంగి
బలుతాఁగయై నోళ్లఁ బడి రచ్చ లెక్కని
మంజులవాణి యీమంజువాణి
మగనిసామేను వోఁ దెగి గద్దరింపని
మృగరాజగమన యీమృగవరాక్షి
పాటి చెప్పినఁ గాని మాటాడఁ దలఁపని
విబుధేంద్రదేవి యీవిబుధదేవి

తే. అనుచు నెల్లరుఁ గొనియాడఁ బ్రాణనాథు
నెద వసించియు వార్ధక్యాన మెలమిఁ గొనియుఁ
గలసికొని యనువర్తనముల నిలిచియుఁ
గొలుచు వేంకటరమణాంబ గుణకదంబ. 62

సీ. శివకామబుధుఁడు భాగ్యవతీవతంసమై
యలరు వేంకటరమణాంబవలనఁ

గనియె వేంకటసుబ్బమను,సీతమను,మహా
లక్ష్మినిం బుత్రికలను ముగురను
బడపడి శివరామ పండితేంద్రుని నొక్క
పుత్త్రునిం బరమపవిత్రచరితు
మొదటి పుత్రిక నిచ్చె మొదలిశ్రీవేంకటే
శ్వరునకు, సీతమ్మఁ ధరణికోట
తే. సుబ్బరాయని కిచ్చెఁ, బైసుతను నోరు
గంటి వేంకటసుబ్బయాఖ్యాకునకును
నిచ్చి పెండ్లిండ్లు గావించె నిచ్చకొలఁది
కట్నము లొసంగి తనకీర్తి కడలుమ్రోయ.

సీ. వేంకటసుబ్బమా వేంకటేశ్వరులకు
నాత్మజుల్ లక్ష్మినారాయణ,శివ
కామ,సీతారామనాములు మువ్వురు
కామేశ్వరియుఁ, గనకమ్మ, సుంద
రమ్మ యనఁ పుత్రీత్రయమ్ము గల్గిరి; సీత
మాసుబ్బరాయనామకుల కైరి
సుతుఁడు సుబ్రహ్మణ్యసూరియు భ్రమరాంబ
సుత; మహాలక్ష్మియనఁ సతికి నోరు
తే. గంటివేంకటసుబ్బయాఖ్యాకునకును
వెలసి రవని సుబ్రహ్మణ్యవేంకటాద్య
కృష్ణవేంకటేశ్వరరాము లెన్న సుతులు
కమల మైత్రేయి, యనసూయ యమరుసుతలు. 64

క. శివకామాత్మజుఁ డగునా,శివరామయ తనదుతండ్రి చిన్నతనమునఁ
శివసాయుజ్యము నొందుట, సవిమర్శము గాఁగఁ దల్లి సాఁకం దనరెన్

క. తల్లియుఁ దండ్రియు గురుఁడును
దల్లియ యై యెల్లవేళఁ దన్ను భరింపఁ
దెల్లముగ విద్య నేర్పియు
సల్లక్షణవంతుఁ డయ్యె జగతి నతఁ డాగిన్.

శా. శ్రీశుం డాశివరామయాహ్వయుఁడు సర్వేష్టుండు నై యొప్పి కు
ప్పా శేషాచలపత్యభిఖ్యునకు విశ్వప్రస్తుతోద్యోగి క
ల్యాశం గూర్చెఁడుకన్న బిడ్డ యగుచుఁ హార్ద్వెందుసర్వాంగస
ద్వేశఁ సుందరరామమాంబఁ దొలుతఁ బెండ్లాడె బాల్యంబునన్

సీ. కలిగినవారింటికన్య గావున నట్టి
సుందరరామాంబ సొంపు మిగిలి
పుట్టాది నల్లారుముద్దుగాఁ బెరిఁగియుఁ
బెండ్లియాడినవెన్కఁ బెనిమిటికిని
నాఁడుబిడ్డల కత్త కధికభక్తిఁ సేవ
సేయుచు ననసూయ యీయమ యను
పేరు గాంచియు లోకవినుతికినై గేస్తు
రాలిధర్మంబుల నోలిఁ గ్రాలి

తే. అతిథిపూజలు నభ్యాగతార్చనలు వ్ర
తములు దానధర్మంబులు తవిలి సలిపి
మగనికిఁ మేనినీడ నాఁ బొగడితగని
కాపుర మొనర్చె సిరులతో నేపు మీఱి. 68

సీ. తనవారు పెరవారు తన కెంత తొందరల్
గలిగించినం గాని కలఁకఁ బాఱి
కనలంగఁ బోవ దోర్పున భూమిదేవికి
సరివచ్చు నీమె యఁగరిమఁ గాంచెఁ
దనహృదయం బెరికిని గాని తెలుపక
గాంభీర్యవతి యనుకడిమిఁ గొనియె
మది సంతసిలుపట్ల మందహాసమె కాని
పకపక నవ్వనిపగిది నేర్చె

తే. మగనితోఁ బుట్టువులనెల్లఁ దగినరీతి, నాదరించుచు భక్తిమై ననుసరించు
నాఁడుబిడ్డల బిడ్డల నరయుఁ బ్రేమ, నల్లసుందరరామమ్మ చల్లనమ్మ. 69

తే. మంచివారిక యింతలో మరణ మనెడు
మాటబడి నేమొ యిహ మెల్ల బూటక మని

యెంచిరో యిప్పటేనవయేట నామె
భౌతికాంగము విడి స్వర్గపదము నొందె. 70

వ. అవ్వల సంసృతినాయకుం డగుశివరామయార్యుండు. 71

తే. అపుడు వరలక్ష్మమ వసంత యనెడుసుతల
నాగరిత కన్నవారల నాత్మభాగి
నేయులకు నిచ్చి వైభవాన్వితముగను
పెండిలులు సేసె బంధుగుల్ ప్రీతినొంద. 72

తే. ధరణికోట సుబ్రహ్మణ్యధరణివిబుధుఁ
డల్లవరలక్ష్మి, మొదలి వంశాబ్ధిచంద్రుఁ
డైనశివరామయాహ్వయుఁ డావసంతఁ
జెట్టఁబట్టి తలిర్తురు చెన్ను మిగిలి. 73

చ. మనశివరాముఁ డాంగ్లము క్రమంబున భూ,నిధి,చంద్ర,ధాతృ,సం1919
ఖ్యను జనునప్పు తల్లినుడికారము సెల్లఁగఁ జేయనై జగ
ద్వినుతజగర్లపూడికుల వేంకటరామయ జానకమ్మయుం
గనినకొమార్త సీతమను గైకొని పెండిలియాడె వేడుకన్. 74

ఉ. సీతమతల్లి జానకమ చేసినపాటలు గద్య పద్యముల్
ఖ్యాతికి నెక్కె దేశములయందిపు డాకవయిత్రిపుత్రియై
ప్రీతి నెసంగుసీతమ కవిత్వము నాఁ గవికావ్య మన్నఁ దాఁ
జేతమునందు సంతసముఁ జేయుచు నుండు నటంట కబ్రమే. 75

క. సీతమ సీతమ కెనయై
భూతలమునఁ బేరు గాంచి పురుషోత్తముఁ డన్
ఖ్యాతిం గొనుశివరాముని
ప్రీతికి నగుచుండు ననుట వింతయె తెలియన్. 76

సీ. అత్తకున్ భర్తకు నడ్డాడ నెఱుఁగదు
నో రెత్తి మాటాడ నేర దెపుడు
పరపురుషుం డడ్డుపడిన మో మెత్తదు
పనివాండ్రపై నింత పదరఁ జనదు

తనబిడ్డ పెఱబిడ్డ యనుమతిం జేయదు
కలవాన నం చెప గర్వపడదు
పొరుగింటి కెన్నఁడు పోయి యెఱుంగదు
పరుషవాక్యంబులు పలుకఁ బోదు
తే. ధుమధుమలు మోమునం దెప్డు తోలఁకనీదు
శత్రుమిత్రవిభేదంబు సలుప దెడఁద
సన్నుత మెఱుఁగదు దైవభక్తిని విడువదు
ఖ్యాతసద్గుణనికురుంబ సీతమాంబ. 77

క. శివరాముఁ డామెవలనన్
సవ తెలుఁగనిగరిమఁ గనియె జయశంకరునిన్
శివకామసుందరాఖ్యుని
శివకాముఁడ నైయె కులంబు శ్రీ వెలయంగన్. 78

తే. అద్దెపవిరామచంద్రున కాత్మజాత
యయ్యు శ్రీసూర్యనారాయణాఖ్యున కభి •
మానసుత యగువరలక్ష్మిఁ బెండ్లి
యాడి జయశంకరుఁడు పొల్చు నవనియందు. 79

సీ. కలనైన నసృతంబు పలుకఁ బూనుట లేదు
లేదు లే దనుమాట లేనె లేదు
తెగనాడుదాయనేఁ దగుల నాడుట లేదు
లేదు లే దనుబుద్ధి లేనె లేదు
యొరులబాధలు చూచి యూరకుండుట లేదు
లేదు లే దనుచింత లేనె లేదు
నిజకులోచితకర్మ నియతి మీఱుట లేదు
లేదు లే దనువిద్య లేనె లేదు
తే. సన్నుతాచారనిరతుఁడై శాంతుఁడై ద
యాళుఁడై శ్రుతిప్రియుఁడై సమస్తసుగుణ
సాంద్రుఁడై విప్రచంద్రుఁడై జగతి నిపుడె
సంగు తూములూర్యన్వయక్ష్మాసురునకు. 80

ఉ. పండితతత్త్వపుండు కవివాక్యసమంచితచిత్తవృత్తి మా
ర్తాండసమోజుఁ డైనశివరామయ రేపును మాపుఁ బంక్తిలో
నుండి భుజింపఁగా నతిథు లొప్పుగ షడ్రసభోజనం బిడున్
దండిగ నర్థ మిచ్చు నిరతంబు నుతింపఁగ రాదె వానినిన్! 81

సీ. ఎంతకాలంబు దిగ్దంతిసంతతితోడఁ
దిరమై వసుంధర పరఁగుచుండు
నెంతకాలమ్ము తారేశదినేశాది
ముఖ్యగ్రహంబులు పొనరుచుండు
నెంతకాలము ప్రజాసృష్టి చేయుచుఁ బర
మేష్ఠి నిశ్చలతమై మెలఁగుచుండు
నెంతకాలమ్ము దేవేంద్రాదిదేవతా
వారంబు నిచ్చమై వఱలుచుండు

తే. అంతదాఁకను దూములూర్యన్వవాయ
వార్ధిచంద్రుఁడు శివరామపండితేంద్రుఁ
డాయురారోగ్యపుత్రపౌత్రాభివృద్ధిఁ
దనరుచుండెడుఁ గాత భూతలమునందు. 82

షష్ఠ్యంతములు.

క. ఏలాదృగ్విధవిభవ,ఖ్యాతమహీసురవరాన్వయాంబుధిరాకా
శీతఘృణికి రమణాంబా,పూతోదరశుక్తిసక్తముక్తామణికిన్. 83

క. పౌత్రునకున్ శివకామయ,పుత్రునకున్ సర్వదేశబుధమిత్రునకున్
సూత్రజ్ఞానవినిర్జిత,శత్రునకున్ సూరివినుతచారిత్రునకున్. 84

క. శ్రీమహితోన్నతసుగుణ,స్తోమునకున్ లోకవినుతశుభనామునకున్
సోమేశ్వరార్చనాత్త,క్షేమునకున్ దూములూరిశివరామునకున్. 85

వ. అభ్యుదయపరంపరాభివృద్ధియగున ట్లాశీర్వదించి. 86

క. శ్రీమత్కాశీనగరీ,ధామునకున్ విధృతశుభ్రధామునకు మహో
ద్దామున కనంతసన్నుత,నామున కగజాతికామునకు సోమునకున్. 87

వ. సమర్పణంబుగానాయొనర్పంబూనిన నైషధీయచరితం బనుమహా
ప్రబంధంబునకుఁ గథాక్రమం బెట్టిదనిన. 88

కథాప్రారంభము.

చ. వెలయఁగ వేయిశీర్షములు వేయిపదంబులు వేయికన్నులుం
గలిగి విరాట్స్వరూపము జగంబుల నించి సృజించి పెంచుచున్
విలయ మొనర్చుచు న్వెలుఁగువేల్పు నిరంజన నిర్వికల్ప ని
శ్చల నిరుపద్రవాఖ్యల నెసంగెడుదేవుఁడు మమ్ముఁ బ్రోచుతన్. 89

వ. దేవా! దివ్యచిత్తంబున నవధరింపుము. 90

ఉ. ఆతతపుణ్యగణ్యము మహర్షిశరణ్యము నైమిశాఖ్య వి
ఖ్యాత మరణ్య మందు ద్విజులందఱు పొందుగ దీర్ఘసత్త్రమున్
బ్రీతి నొనర్చుచుండ విని వేడుకఁ జూడఁగ వచ్చి పొప్పుచున్
సూతుఁడు శౌనకాదిమునిసోముల కిట్లని చెప్పె నొప్పుగన్. 91

మ. ధృతరాష్ట్రాత్మజు లెంతయుం గుటిలవృత్తిం గైతవద్యూత మొం
డతిదౌష్ట్యంబునఁ బన్ని పాండవుల నుడ్డాడించి యొడ్డంది పో
కిటివృత్తం బది వో వనుల్ సనఁగ వాకీ వారు విప్రాళితో
సతితోఁ గామ్యకకాననంబుఁ జని వాసం బున్న కాలంబునన్. 92

సీ. పండఁ బాఱినమేన బసుమంబునిగనిగల్
మెఱసి కన్నులు మిఱుమిట్లు గొలుపఁ
బల్లవారుణజటాపటలంబు భరముగా
నేలపై జీరాడి వ్రేలుచుండ
మెడను జందెములతో మెలికలు గొనుభద్ర
రుద్రాక్షమాలలు రూఢి మెఱయఁ
గుశపవిత్రము గేలఁ గొమరొప్ప సాంగకృ
ష్ణాజిన మొకచక్కి నతిశయిల్లఁ

తే. గేల దండకమండలుల్ గ్రాలుచుండ
శిష్యులకు వేదశిఖలను జెప్పికొనుచు
మహిమ బృహదశ్వుఁడనియెడు మౌనివరుఁడు
లీలఁ జనుదెంచె ధర్మజుపాలి కపుడు. 93

క. వచ్చినమునిఁ గని ధర్మజుఁ, డిచ్చో విచ్చేయుఁ డనుచు నెన్నికపీఠం
బిచ్చి సపర్యలచేఁ బొర,పొచ్చెము లేకుండఁ గొలిచి పొసరినభక్తిన్.

క. మునివర! భవదాగమనం
బునఁ జేసి సమస్తతాపము లడంగెను నే
ఘనతపమును మును బొమున
నొనరుతునో మిమ్ముఁ జూడ నొప్పెను నాకున్. 95

క. నేను గృతార్థుఁడ నైతిని
నానోము ఫలించె నేఁడు నాకుల మెల్లన్
మానుగఁ బావన మయ్యెన్
మౌనీంద్ర! భవత్సమాగమంబు గలుగుటన్. 96

ఉ. నావుడు మౌని తేఁడు యమనందను గన్గొని యిట్లు పల్కె నో
దేవసమానవైభవ! యుధిష్ఠిర! తమ్ములు పుత్త్రు లాప్తులున్
సేవకవర్గమున్ సుఖముఁ జెందునె? ద్రోవదికిన్ శుభంబె? నీ
భావము దేవతార్చనలఁ బట్టి చలింపక యుండునే కదా? 97

క. అవరజు లెప్పుడు నిన్నుం
దవిలి భజింతురు కదయ్య దాయలయావ
ళ్లవి కాకుండునె? షడరుల
దవుదవులం ద్రోలితయ్య! ధర్మతనూజా. 98

క. అనవుడు ధర్మజుఁ డిట్లను
మునివర! సామ్రాజ్య మెడలఁ బులులే జతగా
వనుల మెలంగెడు నే నే
మని కుశలము దెల్పువాఁడ నార్యులకెలనన్ 99

క. శ్రీ విడిచి సకలసుఖములఁ
బోవిడిచి మృగాలిఁ గూడి నొగిఁ గారడవిన్
మావలెఁ గుతిలం గుడిచిన
భూవరు లెవ రైనఁ గలరె మును మునినాథా. 100

వ. అని మఱియు ననేకవిధంబులం బలుకుచున్న పాండవాగ్రజుం గాంచి
బృహదశ్వుం డిట్లనియె. 101

ఉ. దేవసమృతులై బహుంలతేజమునం దగు భ్రాతృవర్యులుం
బావనచిత్త యైన సతి బ్రహ్మసమానులు బ్రాహ్మణోత్తముల్
భూవర! నీకుఁ దోడుపడ భూరిరథంబులతో భటాలితో
నీ వరుదెంచి యుంటివి వనిం విభవం బది విస్తరిల్లఁగన్. 102

చ. అరయఁగఁ బెద్దగా దివి నరాధిప, తొల్లి నలుండు నా మహీ
వరుఁడు దురోదరంబునను వైభవ మంతయు నోడి కాంతతో
గురుతర కాననంబులను గ్రుమ్మరె ముమ్మర మైనకష్టి కా
కరుఁ డయి యొక్కరుండ యయి కారుమెకంబుల తోడు నీడ యై.

ఆ. అనిన ధర్మతనయుఁ డమ్మునిఁ గని యిట్లు
పడిన నలమహీశు కడిఁదిచరిత
వినఁగ వలతుఁ దెలుపవే మునివర! యన
నాతఁ డతని కిట్టు లనియెఁ బ్రీతి. 104

నిషధపురవర్ణనము.

మ. ధరణీమండలమండనంబు త్రిజగద్వర్ణ్యప్రభావంబు భా
స్వరతేజోవిభవాఢ్య మై నిషధదేశం బొప్పు నద్దేశమం
దరు దారం నిషధాఖ్యపత్తనము దివ్యప్రాభవోపేత మై
పరఁగుం భారతవర్షమధ్యమున భాస్వద్వంశరాట్స్థానమై. 105

ఉ. అప్పురికోటకొమ్మలకు నల్లినవజ్రపుటాలతాఁకునం
ముప్పిరి వోయి తే జటి నభోమణి తాఁ బది రెండు వ్రక్కలై
యప్పటినుండి త్రుళ్ళడఁగి యట్టిటుగా నటఁ బోవఁ గానిచో
నొప్పునె ద్వాదశాత్మతయు నుత్తరదక్షిణదిగ్గతం బిలన్. 106

తే. గోపురము నాపు నాపురగోపురములఁ
జెలఁగు సౌవర్ణసాలభంజికలు ప్రోలి
మేలు సింగారమును జూచి మేను మఱచి
ప్రాసువడియున్న యచ్చరచాన లనఁగ. 107

చ. మగఁ డగునయ్యుషాంపతి క్రమంబున గ్లా యుదయించు నెప్పుడుం
గగనతరంగిణీమణి ప్రకాశిలి తత్పురసౌధకుట్టిమ

స్థగితవిధూపలప్రపదదభ్రపయస్తత యై పతివ్రతా
త్యగరిమ నెల్లవారలును వర్ణన మూనఁగ మాన కుండెడున్ 108

తే. అలరుఁ బురిసోమసూర్యవీథుల నటు నిటుఁ
దురగరథహస్తిపత్తులు దిరుగ నెపుడు
నిలిచి శ్రీపురుషోత్తముల్ నిజబలమున
లీల నాడెడుచతురంగపాళి యనఁగ. 109

సీ. మగటాల నగుకుట్టిమంబులరాజులు
నెలటాలు వెండిరాసు లవి యొకటఁ
నిగనిగలాడెడు నీలంపుమాడుగుల్
నీలాలప్రోవులచాలు లొకటఁ
బచ్చలఁ జెక్కనుప్పరిగలపంక్తులు
గోనబు మేల్జాళువాగుట్ట లొకటఁ
గోలచులునార్కెడంబులు కప్రపనఁటులు
కెంపుడాల్చక్కరకేళు లొకట
తే. వెలయ నొగి సూత్రపట్టినవీథు లలరఁ
బ్రోలు గని తొల్లి పద్మనాభుండు పంట
నాతిఁ బెండ్లియాడెడుతఱి నాగవల్లి
ప్రో లని చెలంగుచుండ్రు జేజేలు చదల. 110

మ. పౌనరన్ రాజనముల్ పయస్సులను నెప్డున్ బెంచునయ్యేళులం
దనిశక్రీడలు సల్పుస్త్రీలకు నొడళ్లం దౌసుగంధంబు వీఁ
గి నదీతోయములందుఁ గల్వలకు నాగెం గాన సౌగంధికా
ఖ్యను బెంపొందెను గల్వ లట్టు లగు సత్సాంగత్య మెవ్వారికిన్.

చ. వదనములన్ సరస్వతి ప్రవర్తిలఁగాఁ జతురాస్యులై జగ
ద్విదితకలాకలాపవిశదీకృతగర్భులు నై మఖక్రియా
స్పదవిధుల న్విధాత లయి భాస్వరులై విబుధాగ్రగణ్యులై
పొదలెద రందు బ్రాహ్మణులు పోల్పఁగ మాఱటబ్రహ్మలో యనన్.

ఉ. రాజులు, సర్వదాత్తకవిరాజులు, సర్వదిశోల్లసద్యశో
రాజులు, శౌర్యసారమృగరాజులు, కోమలకాంతియామినీ
రాజులు, సుందరాంగరతిరాజులు, విత్తజితోత్తరాహరి
ద్రాజులు, వైభవోక్తసురరాజులు, రాజిలుచుందు రప్పురిన్ 113

ఉ. శ్రీదునియక్షయంపునవశేవధులుం గణియించి చూచినన్
మాదగుసొమ్మునం గడకు మాసపువడ్డికిఁ జాల దంచు రా
మోదము వీటివైశ్యజనముఖ్యుల కోట్లలఁ జిందురత్నముల్
పాదుకొనంగ మేదినికి వచ్చెను నామము రత్నగర్భనాన్. 114

చ. అతులితగోత్రతేజులు జనార్దనపాదజరాజు లప్పురి
స్సుత లమరావతిం దొరయ నూఱిచి పోసినధాన్యరాసులన్
సత మగులోకపుంగఱవు సళ్ల సురాళియు వారి కెల్లసు
స్థితు లిడుఁ బ్రేమఁ బ్రత్యుపకృతిం గృతి సేయక మిన్న కుండునే. 115

శా. బ్రహ్మణ్యుల్ బహుశూరు లక్షయధనుల్ ప్రాంచద్ధలశ్రీయుతుల్
బ్రహ్మన్ భార్గవు నర్థనాథు బలినిన్ బాటింపఁ కర్థిం బర
బ్రహ్మం బెంచి శరంబు యీని కృతులన్ వర్ధించి పైవ్రేట్టి యా
బ్రహ్మక్షత్రియవైశ్యశూద్రజనముల్ భాసిల్లుచుం డప్పురిన్ 116

సీ. చందురుఁ గరఁగించి కందు వేనలియందు
వేసి నెమ్మోముల వెలయఁ జేసి
చిందంబులను నల్చి యందలి తెలి నవ్వు
లం దిడి గొంతు లింపొంద సలిపి
తమ్మిమొగ్గలు నేర్చి కమ్మతేనెలు వాకు
లం బూన్చి చన్గవ లింబుపఱిచి
మించుల జతకూర్చి చంచలత్వము చూపు
లందుంచి మేనుల నాచరించి

తే. బమ్మ యవ్వీఁటికొమ్మల నెమ్మిఁ జేసి
పురుగుగొఱికినకణ్ణి నక్కరము కండు
దేలు నటు లచ్చిచేఁత యాదృచ్ఛికంబ
యనెడు రట్టును బోఁగొట్టుకొనియె నపుడు. 117

సీ. గల్లుఁగల్లున నందెకాళుల నటియింపఁ
బరమహంసలమదుల్ పల్లటిల్లఁ
వేనె లుట్టిపడంగ మానుగఁ బల్కిన
శుకముఖద్విజకోటి చుట్టువాఱు
మోళ్లిగురింపఁ జెంపుగఁ బాడఁ బవనాశ
నావళి ప్రకటభోగాప్తిఁ దనరఁ
దులకించునునవ్వునెలమోముఁ జూప సు
త్తమచక్రములకుఁ దత్తరము వొడము
తే. జిలుగుఁబావడ ధరియించి చలువపైఁట
నీటునలెవాటుగాఁ గొని వీటినోటి
రాగసురభికి సరసాళి మూఁగి రాఁగ
వీట నడతురు సందెల నాటచెలులు. 118

తే. అచటి భట నటికా రథ హస్తి తురగ
ధేనువృషభాపగాపనుల్ తేజరిల్లు
నశనిరంభాసుమేరునీలాద్రివాయు
నందినీనంద్యమృతనందనములఁ దెగడి. 119

వ. మఱియు నప్పుటభేదనంబు పుటభేదనభేదకశిరోభూషణ చిరత్నరత్న నిబద్ధశుద్ధకుట్టిమాంచితాష్టాపదపదవిశదసౌధతలఖేలనపరబాలామణీ గాననిర్యదిందూపల జలప్రవాహతుందిలకాసారనీరప్రవృద్ధ శాలి విశేషక్షేత్ర సహస్రపత్రవన సంచరత్కలహంస వలాహకాది నానా విహంగమ కోలాహల బిభ్యత్పాలికాబిబ్బోకవతీ స్వయంగ్రహణా శ్లేషణ సంతోషిత పాంథ జనసంస్తవరవబధిరీభూతరాజమార్గోభయ పార్శ్వవర్ధిత రసాలసాలపుష్పమరంద తుందిలేందిందిర బృంద దర్శ నాభ్రభ్రమనటత్కేకికేకారవాక్రాంతంబై కరంబు డంబుమీఱు.

క. అప్పుటభేదనరాజము
దప్పక సిరు లీన రాజధానిగఁ గొని తా
నొప్పుగుచొప్పున నేలుచు
నెప్పుడు నలచక్రవర్తి నృపుఁడై తనరున్. 121

## నళరాజవర్ణనము.

సుగంధి. శూరుఁ డశ్వకోవిదుండు శోభనాంగుఁ డుత్తమా
చారసంయుతుండు సాధుసమ్మతుండు సత్యవా
క్సారభూషణుండు నిత్యకర్మఠుండు భూమిభృ
ద్వారవందితుండు భూరివాహినీశుఁ డారయన్ 122

సీ. సత్సంతతుల నిల్పుజైవాతృకుఁడు సర్వ
చక్రంబులను నేలుసత్ప్రభుండు
దోషాకరుఁడు గాని యోషధీశుం డెప్డు
సన్నగింపని కళాశస్తమూర్తి
యకలంకుఁ డైనమహావిధుం డెందు ని
శాటత్వ మొందనియట్టిరాజు
గురుగద మొందనికువలయమిత్రుండు
విషరాశిఁ బొడమనివిశదకీర్తి
తే. యతఁ డనఁ బిత్రుపైతామహమైనరాజ్య
మును దమము వోవఁ బాలించుచును ధరిత్రి
నఖిలధర్మపరాయణుం డగుచు నైష
ధావనీనాథచంద్రుండు ఠేవ మీఱె. 123

ఉ. పాడియుఁ బంటయుం గలిగి బల్సిరులం దులదూఁగుచుండు నా
టేఁడు జగంబునం దగుతఱిం గురియున్నెల మూఁడువాన లే
గోడును లేక భూప్రజకుఁ గోరుసుఖంబులు దొప్పఁదోఁగఁగా
బాడిగ రాజ్య మేలుచును భాసిలుచుండె మహీతలంబునన్. 124

చ. అతనిముఖాబ్జమం దెపుడు నాడుచునుండెడువాణిఁ జూడఁగా
నతనునితల్లి రాఁ జపల యంచును దద్గుణకోటిఁ గట్టన
గ్గతి గని కీర్తి భీతిపడిగా వడి సంద్రము లెల్ల దాఁటి ద్వీ
పతతులఁ జేరి చేరి మఱి పాఱుట నేఁటికి మానకుండెడున్. 125

వ. అనిన విని శౌనకాదిమహర్షు లవ్వలివృత్తాంతంబు చెప్పు మని సూతు
నడుగుటయును. 126

ఆ శ్వా సాం త ము.

మ. రమణాంబాశివకామయార్యులకు విప్రవ్రాతపాదార్చనా
క్రమసంపాదితపుణ్యలేశమునఁ బ్రఖ్యాతాత్మజుండై మహో
త్తమతేజంబును గాంచి మించి ఘనుఁడై తల్లోకోత్తువిద్వజ్జన
ప్రమనుఁగ శ్రీశివరామనాముని దయన్ రక్షింపు మోరక్షకా. 127

క. పండితలోలుని శుభవా
క్మండను సద్వినుతవిభవు మహితమతిజితా
ఖండలగురుఁ గరుణాళు న
ఖండయశుఁ హారితగోత్రుఁ గావుము దేవా. 128

గద్యము. ఇది శ్రీమహామహోపాధ్యాయ, కలాప్రపూర్ణ, కవిరాజ, కవి సార్వభౌమ, శ్రీపాదకృష్ణమూర్తిశాస్త్రిప్రణీతం బైన నైషధీయ చరితం బనుశృంగారతరంగిణియందుఁ బ్రథమతరంగము.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ



శ్రీ ర స్తు.

# నై ష ధీ య చ రి త ము

## శృం గా ర త రం గి ణి

### ద్వి తీ య త రం గ ము.



తూములూరివంశ
శ్రీతోయధిశీతకరుఁడు శివకామసుతుం
డాతతమతి శివరామ
ఖ్యాతుఁడు వర్ధిల్లుఁ గాక యభవునికరుణన్. 1

వ. అక్కథకుండు శౌనకాదిమహామునుల కిట్లనియె నట్లు నలుండు రాజ్యపాలనంబు చేయుచున్నపదంపడి నడచినవృత్తాంతంబు చెప్పు మని పాండవాగ్రజుం డడిగిన బృహదశ్వుం డి ట్లనియె. 2

చ. వినుము నరేంద్ర, నైషధుఁడు వేల్పులు మెచ్చఁగ రాజ్యపాలనం
బొనరుచునట్టికాలమున నుర్వి విదర్భయనంగ దేశముం
బొనరెను సర్వసంపదలు పొంపిరివోవ మహాభివృద్ధిమై
ఘనుఁ డట భీముఁడన్ నృపశిఖామణి రాజ్యముఁ జేయుఁ బూజ్యుఁడై.

**దమయంతి జన్మాదికము.**

చ. అతఁ డనపత్యుఁడై దమనుఁ డన్ముని దర్శన మీయ నాతనిన్
సతియును దాను భక్తిమెయి సంతతమున్ భజియించి మ్రొక్క న
య్యతియుఁ బ్రసన్నుఁడై వ్రతము లానతియిచ్చి వరం బొసంగె నా
వ్రతమహిమంబునన్ దమనవాక్పతిభాస్వదనుగ్రహంబునన్. 4

క. దమయంతి యనెడుకూఁతురు
దముఁడును దాంతుండు వెనుక దమనుం డనునా

మము లలరఁ బొదలుకొడుకులు
క్రమమున నుదయించి రెల్లప్రజలు నుతింపన్. 5

వ. వారిలోఁ గన్యారత్న మగుదమయంతి యుదయించిన కాలంబున. 6

ఉ. చల్లఁగ గాలి వీఁచెను బ్రసన్నము లయ్యె దిశాముఖంబు లు
త్ఫుల్లము లయ్యెఁ బద్మవనముల్ నభ మెల్ల మనోజ్ఞ మయ్యె రే
యెల్లను నిర్మలుం డగుచు నిందుఁడు దోఁచెను భూతలంబునం
దెల్లశుభంబులుం బ్రబలె నేలికకుం సుత గల్గునత్తఱిన్. 7

క. లోకం బంతయు నెంతయు
జోకం బొలుపొందుచుండె క్షోణీశ్వరుఁడున్
వాకొనఁగ రానిసంతస
మాకాలమునందుఁ బొందె నతివయుఁ దానున్. ౮

క. జననాథాగ్రణి యంతన్
ధనములు ధాన్యములు భూషణంబులు మిగులన్
ఘనులకు విప్రులకును గల
జనముల కిడె జాతకర్మసమయమునందున్. 9

మ. దొరయాజ్ఞన్ సతతంబు దాదు లట సందుం గిందునుం గొట్టకుం
డ రహిన్ బాయక కన్ను దీసికొని నానారీతులన్ జూచుచున్
బురిటిల్ గాచుచుఁ బోతుటేఁగయును లోఁ బో సక్కెముం గానియ
ట్లరుదారం బసిబిడ్డఁ బ్రోచుచు సదీహం ద్రోచి రానా ళ్లొగిన్. 10

క. తలిదండ్రులకుం బ్రజలకుఁ, గళమై నల్లారుముద్దుగానల రెడునా
యెలనాఁగ శుక్లపక్షపు, నెలనా నభివృద్ధి గాంచె నెఱి నానాఁటన్.

సీ. చిడిముడినడకల చిన్నె లన్నియు నేర్చెఁ
బ్రోదిరాయంచలపొందువలన
జిలిబిలిపలుకు[illegible]న్నియు నేర్చెఁ
బెనుచురాచిలుకలపిండువలన
నడ రెడుపాటలవారుపు లన్నియు నేర్చెఁ
బొదల నల్లాడుతుమ్మెదలవలనఁ

జిటిచిటిచినటనలసిరు లన్నియును నేర్చెఁ
దడికారునెమ్ముల దడమువలన

తే. నిట్టులా రాజపుత్రిక పుట్టి నేర్చె
నొక్కొ పుట్టక నేర్చె నొక్కొ యటంచు
జనులు నుతియించువడువున సకలధర్మ
ములను నేర్చెను దనుదాన పొలుపు మీఱ. 12

తే. కొడుకు లనుచును మఱి తమకూఁతు లనుచు
జాళువాబొమ్మలకుఁ బెండ్లి సలిపి తోడి
చెలులు వియ్యపురాం డ్రని చెలిమిఁ బిలుచు
కొనుచు నెప్పుడు గుజ్జెనగూళ్లు బెట్టె. 13

తే. గుడుగుడుంగుంచములు, చిళ్ల, కుందనగిరి
కాళ్లగజ్జెలు, చిపచిప్పగోళ్లు, వాన
లప్ప, చెమచెక్క, వెన్నెలకుప్పలు మొద
లైనమేలాట లాడెడు నపుడు బాల. 14

ఉ దాఁగురుమూఁత లాడు మని దాదులు బోధలు చేసి బాలలన్
దాగ నొనర్చి దాగు మని తన్ను బలాత్కృతి సేయ వారితో
నీగతి నేర్వఁగాఁ దగునె యిప్పుడు నేర్చిన దప్పు డబ్బెదున్
గాఁగల దిం దనీతి యని కన్నియ చూపెడు మోసరూపమున్. 15

క. నీతికి వెలి యని తోఁచిన
వై తగునడపళ్ల నాటలాడెడునపు డా
భూతలనాథునిబాలిక
చేతమునం దలఁప దయ్యెఁ జిత్రము గాఁగన్. 16

క. ఈరీతిని బాల్యంబునఁ, గోరికలిగురొత్త మనుజకోటికి ముద్దా
కూరిమికూఁతుం గళల వి,శారదఁ జేయించెఁ దండ్రి శాస్త్రజ్ఞులచేన్.

తే. ఘనుఁడు ప్రత్యగ్రుఁ డగునధికారి యలఁతిఁ
బ్రతనుఁ బరివృఢు గెలిచి తద్వాసమైన

పదపి నాక్రమించె నన నప్పుడంతిదేహ
మునను బాల్యంబు జాఱె యౌవనము మీఱె. 18

—దమయంతి సౌందర్యాభివర్ణనము.—

క. నవయౌవనంబుచేతఁ
సువిభక్తం బగుమృగాక్షీసుందరదేహం
బు విభాకరకరవికసిత
మవువనరుహ మట్లు తనరె నతికోమలమై. 19

తే. జానుగుల శ్రీల్ పిఱుందుల దా నడుమున
కౌనుదుటఁ గ్రార పొక్కిటిలోన బొట్టు
ఘ్రాణమున నొత్తు కేల దీర్ఘములు దోప
రమణి బుధు లెంతు రక్షరబ్రహ్మ మనుచు. 20

సీ. కచకుచోరునితంబకమ్ములు గురువులు
లఘువులు తుందావలగ్నములు గ
కాలునేతులు నాస ప్రేళులు లఘురేఖ
లలఘురేఖలు కన్బొమలు నుదురు గ
నగములు పాలిండ్లు నలము వేనలి నఖ
రంబులు శ్రీభగణంబులు గను
కన్ను లుత్పలమాలికలు గతిజంఘలు
మత్తేభశాలినీవృత్తములు గ
తే. ఆరు వేణియుఁ బదము లొప్పారునాగ
ఖడ్గపద్మబంధములుగాఁ గలితచంప
కాదిమాలికాగర్భచిత్రాంగ మలర
సకియఁ గవు లెంత్రు లక్షణశాస్త్ర మనుచు. 21

తే. నడుము మాయ కేదారము నాభి కుచయు
గమ్ము శ్రీగిరి కూర్మము కాళ్లమీఁదు
మోవి మధురాంక మని కాంచి పువ్వుఁబోఁడిఁ
దైర్థికులు దలంచెదరు క్షేత్రచయ మనుచు. 22

వ. ఇట్లు ప్రత్యగ్రామూల్య యౌవనాలంకారాలంకృత యై, మదన దేవతామోహనమంత్రశక్తి యనం బొల్చి చూపఱుమనంబు చూఱ లాడుచు. 23

మ. ఉరముం బోఁడుగ నేటవాలుగను వామోత్తుంగకాంసంబుపై
శిరముం నిల్పి యితస్తతశ్చలనముం జేయించుచుం హస్తముల్
సరిగాదిస్వరసంవిధానమున నాలాపంబు రాగంబులం
బరఁగ న్మంగళగీతముల్ గరిత దా వాయించు జంత్రంబునన్. 24

మ. చతురత్వంబున రక్తి నుక్త మొదలాషడ్వింశతిచ్ఛందముల్
ప్రతివారంబును బ్రస్తరించి తెలియం భావించి వృత్తాకృతుల్
సతి సాహిత్యము మేలు మే లని కవుల్ వర్ణింప సర్వేశ్వరుం
బ్రతిపాదించుప్రబంధముల్ సలిపెడిం బద్మాస్య పద్మాస్య నాన్. 25

చ. గరితలు చుట్టువాఱుకొనఁగాఁ గొని కేలఁ బురాణ మొందు నీ
శ్వరుని గణేశునిం బలుకుచానను వేఁడి యనంతరంబ భూ
సురముఖవర్ణధర్మములు సూర్యముఖామరసర్గముం జగ
త్సరణియు సజ్జనాళిచరితంబుఁ బఠించి వచించు నెప్పుడున్. 26

వ. ఇ ట్లెల్లవారికి నెల్లవిధంబుల నల్లారుముద్దుగా నెసంగునాదమయంతి దయాసత్యశౌచనిరతయు గురుజనభక్తిభరితయు నై నిరువేదల నాదరించుచు దిక్కుమాలినవారి కొక్కలాగున దిక్కుం గల్పించి పోషించుచు జంగమస్థావరాత్మప్రపంచంబునకుఁ బరమేశ్వరుం డొక్క రుండ దైవంబును రక్షకుండు నని తలంచుచుఁ గలనైనం గలుషం బులం బొరయక సకలజనసంస్తవనీయచరిత్రయై వర్తించుచు గుణ వయోరూపలక్షణంబులం దన కనుగుణుం డగు జీవితేశ్వరుం డెవ్వ లనం బడయఁ గలుగునో యని వితర్కించుచుండె నంత. 27

దమయంతి నలుని వరించుట.

ఉ. కూరిమి నమ్మహీపతియుఁ గూఁతుఁ గనుంగొని పెంపుఁ జెందుసిం
గారము యోగ్యవర్తనము కాఁగలబుద్ధియు యౌవనంబు చే
కూరినరాజపుత్రు ననుకూలుని వల్లభు నీమె కెందు నే
నారసి కూర్తు నంచు జగ మంతయుఁ గన్గొనెఁ జారదృష్టిచేన్ 28

చ. దినదిన మాసతీమణి ధ్రుతిఁ స్తుతిపాఠకవేళలందుఁ దం
ద్రినిఁ గొలువంగ నేగి యట నేర్పున వేల్పుల నేలవాల్పులన్
గొనకొని వందు లెన్నవిని కోరిక లీరిక లెత్త సత్యసం
ధుని నలు డెందమందుఁ బరితోషమునొందుచు నిల్పెఁ బొల్పుగన్.

శా. అన్యోన్యంబు కథానుషంగములయం దాసక్తిమై నెచ్చెలుల్
ధన్యుండే నిషధవ్రతుండె యనుచుం దా మేరినో చెప్పుకో
నన్యం బేమియు నొల్లకుండి యదియే యాలించి పోలింప న
క్కన్యారత్నము దొరవెట్టుఁ జెవులం గౌతూహలం బేర్పడన్. 30

మ. చెలి దేశాగతవందిమాగధముఖశ్రేష్ఠాత్ములన్ వ్యాజముం
గలుగం జేసియె నైషధీయగుణముల్ గారంబుగాఁ గోరి వా
రలు చెప్ప న్విని యొప్పు వానిన మనోరాజీవమం దుంచి ని
క్కలగాఁ దత్కథలం గలట్టిగుణముల్ గాటంబు వర్ణించెడున్. 31

మ. పుడమిన్ శూరుఁడు శూరసేనసుతుఁ డై పొల్పొందు నారాజపు
త్రుఁడె ప్రాణేశ్వరుఁ డైన నావిభవ మెందుం జెప్పఁగా శక్యమే
నడుమ న్నా కతికష్ట మైన సుఖ మైన న్వానితో లోక మా
నడవుల్ వీడులు నొక్కరూప కద నా కాతండు నే నుండినన్. 32

మ. అతనిం గాక మఱెవ్వనిం గనఁగ నే నాశింపఁ దత్కార్యమం
దితరుల్ విఘ్నము సేయఁ బూనినను లో నింతేని శంకింప నే
నతఁడుం గూడిన నెవ్వరిన్ సరకుసేయం బ్రాణముల్ దీయ నా
గతమై యుండినకాలసర్ప మెదురంగా నోడ నొక్కింతయున్. 33

క. నాకాయ మతని కప్పన
గా కొరులకుఁ గాదు నాకుఁ గలసౌఖ్యంబుల్
వాకొనియెద నతఁడే యని
లోకమునం దైవ మతఁడె లోఁ దలపోయన్. 34

క. ఈరీతిఁ దనమనమ్మున
నారాజకుమారు నునిచి యతిమోదమునన్

నాకీమణి యుండియు నది
యేరికి నెఱిఁగింప దయ్యె నెంతయు లజ్జన్. 35

వ. ఇట్లు కాంతామందాక్షబద్ధాంతరంగ యగునాదమయంతి సర్వకాలంబుల సర్వావస్థల సర్వభావంబుల సర్వనరేశ్వరేశ్వరుం డగునైషధేశ్వరుండె ప్రాణేశ్వరుం డని భావించి లో సేవించుచుఁ దదేకధ్యానంబుగాఁ బ్రవర్తించుచుండె నక్కాలంబున. 36

[1]చ. నలుగడఁ గమ్మవాసనలు నల్వుకొనెన్ సన లొప్పెఁ దీవకూ
నలు నలువొందె నంగనలు నానలు వీడి గతాభిమానలున్
లలనలు నై మనోహరులలాలనలున్ నయగారము ల్గొనన్
గలిగి తదీయయాచనలు గైకొని పైకొనుచుండ్రు పయ్యెదన్. 37

క. అని చెలులు వసంతము నన
నబోఁడి సమాదరంబున న్విని డెందం
బునఁ బ్రత్యయంబు గలిగిన
దనప్రియునియభిఖ్య యనుచుఁ దద్దయు నలరున్ 38

[2]క. ఇలపైన నలుఁడు దీప్తిన్
వెలుఁగుచుఁ దమయంతిపురికి వేడిమి గూర్పం
గలఁ డనెడుచెలులఁ గిరున్
దిలకించుచునుండు నామె దిగు లొంది మదిన్. 39

వ. ఇట్లు భీమరాజనందన తనమనోరాజీవంబున నైషధావనీనాథుం దిల
కించుచుఁ గాలంబు గడపుచుండె. 40

1 ఇట్లు చెలులు వసంతము నభివర్ణించుచుండఁగా నిందు నలుగడాదులలో నుండు "నలు" అనునక్షరద్వయము ప్రియునినామం బని దమయంతి సంతసించె నని;

2 ఇలపైన నలుఁ డనుచో ననలుఁడనియు, నలుఁ డనియు నర్థద్వయము వచ్చును. వెలఁగుచుఁ దమయంతిపురికి యనుచో ద్రుతముపై తకారమునకు దకారమురాఁగా "నలుఁడు దమయంతిపురికి" అని భావించి వేడిమి గూర్చు ననుటచే దిగులొందె నని భావము.

వసంతర్తువర్ణనము.

లయగ్రాహి. అంతట వసంతము నిరంతరశకుంతరుత
తాంత మతికాంతముని తాంతకృతపాంథ
శ్రాంతము కృతాంతదిగుపాంతమలయాంతరని
శాంతభవ సంతతముశాంతతరవాతా
క్రాంత మతిశాంతహిమవంతము వనాంతతరు
కాంత మలకంతునకు సంతసము సింధు
క్లాంతము పొలంతులకుఁ గాంతిద మనంతగుణ
వంత మొగిరంతు గొనె నెంతయు ననంతన్. 41

మ. చిరకాలాప్తవనాంగనావిరహముం జిత్తంబునన్ నైపలే
కురుసంతాపమును న్వొలార్చుటకు నై యొండొక్కచో నుండి స
త్వరుఁడై సర్వవరూధినీసహితుఁడై ప్రద్యుమ్నుఁడుం దోడు రా
సరగన్ మాధవుఁ డేగుదెంచి కలిసెన్ క్ష్మామండలం బంతటన్. 42

సీ. మావిపూఁదేనెల మత్తిల్లి యలిగాయ
కాళి సుస్వరముల నోలిఁ బాడె
శుకశారికాదిసచ్ఛకునసంతానవై
తాళికాళి ఘనశబ్దములఁ బలికెఁ
జివు రాని జివ గల్గి చిరరవంబున వన
ప్రియకోటి కాహళ ప్రీతిఁ బట్టె
తెక్క లల్లార్చుచు నొక్కొకటఁ గొలకుల
హంసకాంతాళి నాట్యంబులాడె
తే. నట్టియామని సంతస మావహిల్ల
మన్మథోత్సాహజనకుండు మాధవుండు
సొగసులకు నెల్లఁ దానక మగుచు నెపుడు
వెలయుచున్నట్టివనలక్ష్మిఁ బెండ్లియాడె. 43

ఉ. కమ్మనిమావిపూవులను గాలువ గట్టెడుతేనె లాని జుం
జుమ్మని తేంట్లు పాడెఁ గడుసొం పలరార నిగుళ్లు మేసి కో

కొమ్మని గండుఁగోయిళులు గూసెను జిల్కలు గోరువంకలున్
ముమ్మర మైసపంక్తు డని మొత్తముగా వగఁ బల్కె నత్తఱిన్. 44

చ. గమగమలాడుతావిఁ గడుఁ గ్రమ్మెడుపున్గుజవాది పచ్చక
ప్రము నునుపచ్చనాఁకుఁబోడి పచ్చికచూరము మల్లెయత్తర
ష్టమరుపసిండిగిండి నిడి యంపిగఁ జేసినమంచిచల్వగం
దము మెయినిండ నొండొరులు దాలిచి పొల్చెద రాల్మగ ల్లొగిన్.

మ. చలువ ల్గ్రిమ్మెడుతీవపందిరులపజ్జన్ జాజిపూఁదోఁటలోన్
మలెపూఁబాన్పునఁ బండి యాలు మగఁడున్ మైపోయిమైఁదేల్చుచున్
లలి నేతెంచెడిలేఁతపయ్యరను రే ల్వాటించుచున్ నిచ్చలున్
వలరావానిదురంబునన్ వలఁతు లై నల్వొంది రయ్యామనిన్. 46

చ. మెలిగొని యొండొకొం డొరయ మిక్కిలిచిక్కఁగ నున్న మావితో
పుల నలవోక మొత్తముగఁ బుల్గులు గూయఁగఁ బూవుఁదేనియల్
జలజల రాలి నేలపయిఁ జాల్కొన నెమ్ములు చూచి కారుమ
బ్బులుబుముచుం గడుం గురియుఁ బో! యిపు డన్బమ నాడు నత్తఱిన్.

చ. పొలుపుగ నొక్కటన్ విరియఁ బూచినమల్లెపొదం గడంగి తేఁ
టులు గలయంగ వ్రాలి యెపుడున్ విడకుండఁగ నొప్పె నప్డు పెం
పలరఁగఁ బెండ్లియాడి యట నామని వెన్నుఁడు తోఁటలచ్చియున్
దొలిఁ గటితాలు ము త్తెములునుం దలఁబ్రాలుగఁ గొన్నప్రో వనన్

క. ఆమనిఁ బొద లెడుసోయగ, మే మని చెప్పంగ వచ్చు నెంతటివారిన్
వే మరునిబారి కగ్గల, మై మెలఁగుచుఁ గుతిలఁ గుడువ నల్లు విరాళిన్

వ. అట్టిసోయగంబుల కెల్లఁ దానకం బగు నావసంతసమయంబున నొక్కనాఁ డానిషధేశ్వరుం డగు నలుండు మంత్రిసామంతహిత పురోహితభృత్యపరివారపరివృతుండై కొలువు దీరి యున్నసమయంబున వైదేశికుం డగునొక్కకవీశ్వరుండు వచ్చి రాజు నాశీర్వదించి విశ్రమించి యున్నయప్పు డప్పురుషమూర్తి దిక్కు మొగంబై ధరణీతలేంద్రుండు కవీంద్రా! నీ వెందుండి యెందుఁ బోవుచు నిందు విచ్చేసితివి? నీ వేయేదేశంబుల నేమేమివిచిత్రంబు లరసితి వానతి మ్మనిన నతం డతని కి ట్లనియె. 50

వైదేశికుండు నలునికడ దమయంతి నభివర్ణించుట.

శా. నే నాంధ్రుండఁ గవిత్వమందు మిగుల న్విఖ్యాతినిం గంటి వి
ద్యానైపుణ్యము పెంపునన్ బహుకృతుల్ తత్త్వజ్ఞు లగ్గింప సం
ధానంబుం బొనరించి నట్టికవినై తళ్కొత్తుదున్ దేశముల్
గాన న్మెట్టుచుఁ బెట్టుబెట్టు వని నిన్ గాంక్షించుచు న్వచ్చితిన్. 51

మ. అవిముక్తంబు గయాప్రయాగము లయోధ్యాశ్రీహరిద్వారముల్
భువనేశంబును నీలశైలమును గాంభోజంబు గాశ్మీరమున్
ద్రవిడంబున్ మలయాలమున్ మధురయున్ ద్వారావతిన్ రామసే
తువు రామేశ్వర మాదిదేశముల నెంతో రక్తి సేవించితిన్. 52

సీ. దక్షిణకాశికాస్థలము నాఁబడి గౌత
మీనదియొడ్డున మెఱవడిఁ గొని
తనరుమార్కండేయమునితల్లజక్షేత్ర
మచట నమ్మునిపేర నమరియుండె
నజ్జలింగ మనంగశాపునిం డతఁడ య
య్యతిప్రాణములు గాచె యముని రాచి
యటఁ బుష్పగిరిక్రింద నమృతకుండ మగునా
జల మానువారికిఁ జావు లేదు

తే. మున్ను మును లందుఁ దపియించుచున్నయపుడు
హరుఁడు చనుదెంచి తాండవ మాడె దాన
నమృతకుండము ప్రభవించె నాప్రదేశ
మాంధ్రమాతకుఁ బుట్టిని ల్లయ్యె నధిప. 53

శా. రెండున్ మూఁడును గ్రోశముల్ గలిగి కీర్తింపంగ నా క్షేత్ర మం
దుండున్ గాశికయందుఁ బోలె మహిమం బోభూతలాధీశ, మా
ర్కండేయేశ్వరుఁ డెల్లకాలమును భక్తవ్రాతముం గావఁ గన్
దండన్ నిల్చుకొనెన్ బ్రభావవిలసన్మాపాలు గోపాలునిన్. 54

క. ఊరికిఁ దూరుపుదిక్కునఁ
గోరిక లిడి భక్తకోటిఁ గొనియేలఁగ నై
భూరిమహత్త్వముగలదై
పేరొందున్ శ్యామలాంబ భీతిఁ దొలఁచుచున్. 55

శా. ఏ నాక్షేత్రమునందు గౌతమిజలం బేవేళ సేవించుచున్
మానీంద్రాంచితశంభులింగమును సంప్రార్థించి పూజించుచున్
జ్ఞానం బీఁ దగుసత్త్వవిత్త్వమునఁ బ్రజ్ఞం గాంచియుం గావ్యకృత్
స్థానంబుం గొని కొన్ని రేల్ గడపితిన్ క్ష్మామండలాఖండలా. 56

వ. మఱియు నంగవంగాదు లెన్నియో దేశంబులం దిరిగి చూచితి నెందునుం దెలియఁ జెప్పంగలవిశేషం బేదియును లేదు గాని నే నీనడుమ విదర్భాపురంబునకుం బోయియుంటి నప్పురాధీశ్వరుండు.

ఉ. భీమపరాక్రమక్రముఁడు భీముఁడు నాఁబడువాఁడు వానికిం
గోమలగాత్రి పుత్రి జనకోటికి ముద్దుగ నుద్భవించి ని
ద్దామణిరేఖయో యనుప్రథం గలదై దమయంతి నాఁగ స
న్నామముతోడ నొప్పెసఁగు నాకమృగీనయనాగ్రగణ్యయై. 58

ఉ. క్షోణితలాధినాథుఁ డలకోమలి పుట్టినకోలె నిత్యక
ళ్యాణము పచ్చతోరణమునై గృహ మొప్పఁగ నొప్పుచుండె నా
క్షోణి ధనంబు ధాన్యమును గోవులు వాపురముల్ గజంబు ల
క్షీణములై ప్రజావళియుఁ గ్రిక్కిఱియం గన నొప్పు నెప్పుడున్. 59

క. పురిలోని కడుగు వెట్టిన, తరుణంబున స్వర్గపురము తత్పురమునకున్
సరిరా దటంచు నాకున్, గర మాశ్చర్యంబుతోడికౌతుక మొదవెన్.

మ. నెలతాల్పున్ మగతాలునుం గలవడ న్నిర్మింప నింపై మహో
జ్జ్వలమై చుక్కల రాయుసౌధములపై పై భూముల న్మెట్టుకాఁ
తలు నాకంటికి స్వఃపురి న్మెలఁగుకాంతల్ వోలెఁ గానంగ నై
తెలుపం జాలనియంతసంతసమునం దేలించి రోభూవరా. 61

శా. ప్రాసాదోపరిభాగమందుఁ బ్రమదల్ రాగానులాపప్రయా
వ్యాసంగంబున నుండి తత్తదుచితవ్యాపారతాళధ్వనుల్
భాసిల్లంగ మృదంగవాద్య మెసఁగింపం గర్జితభ్రాంతి నై
నాసందేహము తీఱ దయ్యె నెమిళుల్ నాట్యంబు గావించుటన్. 62

తే. మఱియు నప్పురి నెందఱో గురులు కవులు
బుధులు జిష్ణులు ధనదులు పుణ్యజనులు

లోకబాంధవు లీశులు లోచనముల
కెంతయును బర్వ మొసరించి రిందునందు. 63

ఆ. నాఁడు రాజగృహమునన్ శుభ మని పోవు
విప్రవరులఁ గూడి వేడ్కపడుచు
నేనుఁ బోయి నగరులోన నారాకన్నెఁ
గంటిఁ గన్నుఁదోయి గలఫల మని. 64

చ. మెఱుఁ గని కొంతలోపున భ్రమించితి బంగరు వంచు నంతలో
నెఱిఁగితిఁ గొంతకొంత చలియించుటఁ జేసియుఁ జిల్కపల్కులన్
నెఱపుటఁ జేసి చేడె యని నేఁ దెలియం గలప్రోడ నై కదున్
నెఱి గలబ్రహ్మసృష్టి నిది నేర్పుల కాది యటంచు నెంచితిన్. 65

మ. పొడుగుం బొట్టియు లావు సన్నమును గాఁ బో నట్టినిద్దంపుపు
త్తడిమే నే దెటు లున్న మిన్న యని శాస్త్రం బొప్పు నాచొప్పునన్
గడుమోటం బిడునంగకంబులును గల్గం గన్నె సొన్నారి నే
ర్పడరం బొన్ను మెఱుంగుసుం గరఁగి పోయం బొల్చుబొమ్మట్లగున్.

చ. *కరములఁ బెంపొడల్, మొన 'మ' గా నునుబిక్కలు, 'ధు' ద్వితీయ మై
నెఱులు, వికంఠ్యమై పెదవి, నీగి 'ధు' 'వంద' 'ర'పైఁ గ వాక్కు, బొ
ట్టిరవుగ 'మా'కు మాఱ సుతలెన్నఁ బిఱుందును, నాది పోవఁ గం
ధరము, మరల్పునన్ నగవు, నల్వగ నల్వ సృజించె నెచ్చెలిన్. 67

---

* కరములు = ఏన్గుతొండములు, వీనితో నూరువులు; మొన = మొదట "మ" యనునక్షరము, కాన్ = కాఁగా, మకరము లగును, మకరములు = మొసళ్లు వానితో జంఘలు; "ధు" ద్వితీయమై, పైపదమునకు ధు వర్ణము రెండవది కాఁగా మధుకరములు= తుమ్మెదలు వానితో నెఱులు; వికంఠ్యము = మధుకరములో కకారము కంఠ్యము, అది విగతము కాఁగా, మధుర మగును. దానితో నధరము; నీగి "ధు" మధురములో ధు వర్ణముపోఁగా "మర" మగును. "అంద" యనుపదము రపైఁగ=రవర్ణము మీఁదఁ గాఁగా మరంద మగును. మకరందము, దానితో వాక్కు; బొట్టు=సున్న, మాకు=మ వర్ణమున కై, మాఱ సుతలు=చివరివర్ణములు, ర,ద లు మాఱఁగా, మందర మగు. పర్వతము, దానితో పిఱుందులు; ఆది పోవ = అందు మొదటియక్షరము పోఁగా, దర మగు. శంఖము దానితోఁ గంఠము; మరల్పునన్=మరలించుటచేత దరము "రద" మగు. గజ దంతము. దానితో నవ్వులను; చేసె నని యాపద్యార్థము.

చ. *తలఁకక మమ్ము రే ల్చెఱచుదాయను గెల్చియ వానిచుట్టలన్
మెలపితి మంటి కొల్చి మన, మీఁదను దొల్లిటిబామునందు మా
తలఁబడి నా రటం చడుగుఁదమ్ము లనం గని మ్రొక్క వచ్చునో
వెలయఁగఁ దేం ట్లనం దగియె విప్పినయాసకిసోఁగ పెన్నెఱుల్. 68

†శా. శ్రీకూర్మంబు భజించి మాయఁ జని కాంచిం గాంచి కేదార మా
లోకింపం గలఁ డయ్యు శ్రీనగము నాలో నేత్రపర్వంబు గాఁ
గైకొంచున్ మధురాంక దేశమును వేడ్కం జేయువిజ్ఞుండు బ్ర
హ్మైకానందము నొందఁ జాలియుఁ దదైక్యం బందుఁ బొం దేర్పడన్.

‡ఉ. శ్రీ నిరసించుదంట లిరుక్రేవలఁ బాయక చేరి యున్నవా
రే నట కేఁగ హాని యగు నేమొ యటన్న భయంబుతోడ స్వ
ర్భానుఁడు శీతభానునికురంగటఁ బోవక వెన్కఁ జేరెనో
నా నలువొందుఁ గర్ణవదనంబుల వెన్కొని కీలుగం టొగిన్. 70

* ఇందు వక్తలు పాదపద్మములు, శ్రోతలు తుమ్మెదలు, పద్మములు చెప్పుచున్నవి. మేము బలాఢ్యులము. రేలు మమ్ముఁ జెఱచుమాదాయ చంద్రుఁడు. వాని గెల్చి వాని చుట్టాల (నక్షత్రముల) మమ్ముఁ గొలిచి సేవించునట్లు చేసితిమి. నఖరూపముగా నీజన్మమున మ మ్మంటి సేవించుచున్నవి. మే మింతవారము. తుమ్మెదలార! మీరు మున్ను మా నెత్తిపైఁ బడి త్రొక్కి తప్పుచేసి యున్నారు. మిమ్మును శిక్షింతు మని చెప్పఁగా భయపడి తుమ్మెదలు పాదపద్మములకు నమస్కరింపవచ్చునో యన నొప్పె. అనఁగా నామె శిరోజములు పాదములపైఁ బడుచున్న వని తాత్పర్యము.

† శ్రీకూర్మము, మాయ, కాంచి, కేదారము, శ్రీనగము, మధుర యివి పుణ్యక్షేత్రములు, సేవించినవారి కానందము, సాయుజ్యముం గలుగు నని పురాణములు చెప్పు. ఇట విషయనిగరణము, శ్రీకూర్మము=ప్రపదములు, మాయ = నడుము; కాంచి = మొలనూలు; కేదారము=బొడ్డు; శ్రీనగము = పాలిండ్లు; మధురాంకదేశము = అధరము; సేవించినవారికి నానందము, వానితో నైక్యము నగు నని భావము.

‡ శ్రీ=విషము, శ్రీకారము; దానిని నిరసించుదంటలు=చెవులు. విషవైద్యులని రెండవయర్థము. విషవైద్యుని జూచినప్పుడు పామునకు భయము సహజము. స్వర్భానుఁడు=రాహువు; శీతభానుఁడు=చంద్రుఁడు;

చ. తనరెడుకొప్పు మబ్బు, మెయితళ్కు చలించెడుమించుఁదీఁగలుం
గనుబొమ లింద్రకార్ముకయుగంబును, సద్రస వృష్టి, గుబ్బ లన్
ఘనకరకంబులుం గలిగి కల్కి మెయిం దరుణంపువర్ష దాఁ
గనఁబడ మోహసస్యము ప్రకాశము నొందక యున్నె యెయ్యెడన్.

తే. కోడెకాండ్రమదులు పట్టఁ గోరి మరుఁడు
పన్ని యుంచినవల సుమీ కన్నెకురులు
కాన బెళుకుబెడిస లన నైనకన్ను
లేగుఁ గాఁబోలు జానుగులాఁగ లంట. 72

క. పున్నమచందురుఁ డగు నా,కన్నియ నెమ్మోము,బొట్టు కం దగు,నగవన్
వెన్నెలలు గాయు నెల్లర,కన్నుంగలువలును విచ్చి కడుసిరి నలరున్.

క. పువ్విలుతుఁ డీఁదఁ గదలెడు
జవ్వన మనునేరెడేటఁ జనుతరగలు నా
నెవ్వలనఁ జూడ నొప్పెను
జవ్వనినునుకడుపుమీఁద సవ్రై ముడుతల్. 74

తే. మేటితమ్ములతోడనో లేటచివురు
గములతోడనొ కడుఁ బోరఁ గలిగినట్టి
యీసుతోఁ బుట్టె నాఁగ నయ్యింతియడుగు
లరయఁగా నొప్పుఁ దొగరుచాయలను గనుచు. 75

మ. శ్రుతులన్ వీణియ మేళవించి పరమౌత్సుక్యంబునన్ భీమరా
ట్సుత గాంధారము దేవతాప్రియముగాఁ జొప్పించి రాగానులా
పతతిం జూపుచుఁ బాడుచుండఁ గరఁగెం బాషాణముల్ కొయ్య లం
చితరీతిం జివురించె నిట్లు కని నేఁ జిత్తంబు రాఁ జెప్పితిన్. 76

ఉ. ఆనవలాయెయోరములు నాసొగ సాబలునీటు లాబెడం
గానెఱిమూపు లావగలు నాపస లాతగు నేర్పు లాసొరం
బానగుమోము నాతళుకు లాపెనువన్నెలు చిన్నె లెన్నఁగా
నానవలాక చెల్లు నది యామరు నేలెడు మేటి గాఁ దగున్. 77

వ. మఱియుం బరమారుణకోకనదవాదమ్ము లగుపాదమ్ములును, రంభా
కుంభినీరుహాకారంబు లగునూరుద్వయాప్రకారంబులును, ఉష్ణరుగ,

ఘాంగరమాతిఘనం బగుజఘనంబును, వేదీమధ్యదర్శనాసాధ్యం బగుమధ్యంబును, వర్తులావర్తశోభి యగునాభియును, ఉత్తుంగ రంగత్తరంగమంగళాసుయోగంబు లగు త్రివళీవిభాగంబులును, సుమనోమాలికానుగం బగుభుజయుగంబును, కుందకోరకవరదంబు లగురదంబులును, ఖంజరీటపాలనాతిపాత్రంబు లగునేత్రంబులును, సుప్రభాపరిపూర్ణపూర్ణిమాచంద్రబింబానూనం బగుమందహాసభాసు రాననంబును, భాసురవిద్యుల్లతాసారం బగుకోమలశరీరంబును, గలిగి చిలుకపలుకులఁ బలుకులం దులకించి కోకిలస్వరంబు కంఠస్వరం బున ననూనయించి, గజగమనంబు నిజగమనంబున నధిగమించి, మించునమ్మించుఁబోఁడి బాధక్షమంబున క్షమకును, పాతివ్రత్యం బున నహల్యాసీతాదులకునుం బురుదై పతిదైవతంబుం గూర్చి ప్రార్థించుచు, సకలసుగుణగణసదనంబై విశేషవిలాసలక్షణంబుల సాక్షాల్లక్ష్మి యన నొప్పి లోకాతీతవైభవంబునం దేజరిల్లుచుండె నని రెండియు. 78

క. అందమునకుఁ జందమునకు
నెందులకుం దగినమీర లిద్దఱుఁ గూడం
గుందనము మణియుఁ గూడిన
చందం బగుఁ గాదె రాజచంద్రా! తలఁపన్. 79

క. కన్నియ పెండిలియీడున, నున్నది లో నెవని వలచియున్నదొ కానీ
వన్నెగలరాకుమారుల, నెన్నిన విన నొల్ల దనుచు నే వింటి నృపా.

*చ. అతనునిపేరు చెప్పఁకొన నట్టిటు మోము గదల్చు, యామినీ
పతి యన మోము వాంచు, వనవాసి వసంతుఁడు నాఁగ నుస్సనుఁ,
శితిగళమిత్రసూతి యన సీ యను, గోత్రభిదాత్మజుండు నా
నతికుపితాత్మయై కసరు నచ్చెలి యం చని వింటి, వింటివే. 81

క. ఇంద్రుండె కాని మఱియు ను,పేంద్రుండే కాని నవనిధీంద్రుఁడె కానీ
సాంద్రాణిమాదిసంపద,ధీంద్రుండే కాని మెచ్చ దెవ్వారి నధిపా. 82

*ఇందు-అతనుఁడు, యామినీపతి, వనవాసి, శితిగళమిత్రుఁడు, గోత్రభిత్తు, వీరు వైపదములచే గర్హింపఁ దగినవారే కావున దమయంతి నిరాకరించె నని సమన్వయము.

మ. అనయంబుం జేర్కొని తోడిచేడెలు ప్రసంగానుప్రసంగంబుగా
ననుకో నందు నలాక్షరద్వయము శ్రోత్రానందముం గూర్పఁగా
మనమందుం గలసంతసంబు ముఖసీమం దోఁపఁగాఁ జేయుటన్
వనజాతాక్షి నలు న్వరించె నని చెప్పం జొప్పడున్ భూవరా. 83

ఆ. ఆమె కీవు తగుదు వామె నీకుం దగు
నీడు జోడు నొక్కఁ జూడ నెసఁగు
మీఁద లిరువు రొకట మెలఁగినచో రతి
మదను లనెడు పేర్మిఁ బొదలుదు రిల. 84

వ. అని యనేకవిధంబుల నక్కన్యారత్నంబు నభివర్ణింప నాకర్ణించి పర
మానందకందళితహృదయారవిందుండై రాజేంద్రుండు కవిరాజుం
బహూకరించి యంపిపుచ్చి పేరోలగంబు చాలింప ననుజ్ఞ యిచ్చి
నిజప్రాసాదాభ్యంతరంబునకుం జని దమయంతీగతస్వాంతుండై. 85

మ. కవిరా జాడినయట్టు లాకలికి వేడ్కం గూర్చుచుం గంటికిం
దవులన్ వచ్చిన నైషధుండు మదిలోనం జేరఁగాఁ దీసి వా
సి వెసన్ గూర్చుచు ముద్దు వెట్టుకొని చేసేతం దగం బట్టి బె
ట్టువగ న్మోమున మోముఁ జేర్చుకొని యుండున్ రెండు నొండేయనన్

చ. హృదయమునందుఁ జేర్చుకొను, నేదియొ పల్కును, నవ్వుమోముతోఁ
బదములు ముట్టి నాపయిఁ గృపం బొదలింపు మటంచు వేఁడు, స
మ్మదమున మోవిపానకముఁ బొందఁగ మోమటు ద్రిప్పు, నెప్పుడున్
వదలను నిన్ను నే ననుచుఁ బట్టును నెట్టన రెండుచేతులన్. 87

వ. ఇ ట్లనేకవిధంబులం బలవించుచుఁ దదేకధ్యానపరాయణుండై
యొక్కచోటం గుదిరి యుండ నోపక యాహారవిహారాదులం బరా
ఙ్ముఖుండై యొం డేమియుం జూడక వేడుకలం గూడక వీడనివిరహ
తాపంబున నేపు దక్కి మిక్కిలి పొక్కుచు. 88

చ. నలుఁ డెపుడు న్విదర్భపురనాథసుతం గనకున్న విన్న య
శ్శైలిమిఁ దదీయవిగ్రహమునే హృదయంబున నిల్పి లోనిచూ
పుల మునిరాజు బ్రహ్మమును బోలెఁ గనుంగొను చొండు గాన కు
జ్జ్వలమదనానలంబునకు సైపఁగ లేక విరాళిఁ దూలుచున్. 89

వ. ఏమియుం దోఁపక పురంబున నుండ నోపక పురసమీపంబునందలి
ప్రమదావనంబున కొక్కనాఁ డొక్కరుండ చనియె నదియును. 90

ప్ర మ దా వ న వ న ము.

సీ. కోకిలరుతములఁ గొమరొప్పు లేమావి
గున్నలు గనుఁగొన్నఁ గన్ను లలరు
నలినాదముల నధికాహ్లాద మొనరించు
మల్లికల్ గన మది పల్లవించు
మొగిఁ గప్రపుదుమారమును గప్పునఁటిబో
దెలసొంపు దిలకింప నలరు మేను
బంగారుమేడల రంగారుసంపంగి
యీరముల్ మది కిచ్చ లూరఁ జేయఁ
తే. గేసరంబులఁ దగునాగకేసరములు
మంజులచ్ఛవి నొప్పెడువంజులములు
పొగడఁ దగుతావి నెగడెడుపొగడగములు
నరయ నరయ మే న్పరవశ మగుఁ దలంప. 91

చ. విరహుల వేఁట లాడుటకు వేడుకఁ జేసి త్రిలోకయాత్రకుఁ
జరిగెడుశంబరారికి నొసంగ వసంతుఁడు మేలుబంతులౌ
శరములు చేసి ప్రోవు లిడె క్ష్మాతలమం దనునట్టు లామ్రము
ల్విరియఁగఁ బూచె నల్లడల లేఁజిగురేఁ గనరాక యుండఁగన్. 92

గీ. మల్లెపూవులపొదలపై మధుపపంక్తి
వ్రాలి జు మ్మని మొరయుచోఁ బంచశరుఁడు
నారి సవరించి శరములం గూరిచె నని
మొలచె భయ మెంతయే వియోగుల కెడంద. 93

మ. పసపుంబయ్యెద లొప్పుపుప్పొడిగముల్, పాలిండ్లు పూగుత్తు, లు
ల్లసదంగంబులు ప్రాఁకుఁదీవలు, కురుల్ పైనాడు తేం, ట్లంఘ్రులుఁ
గిసలంబుల్, నగవుల్ సుమంబు లగుచుం గీర్తింపనై యొప్పుచుఁ
బసమీఱుఁ వనలక్ష్ములుఁ వనితలుఁ వర్తింతు రేకాకృతిన్. 94

సీ. తమగాత్రములఁ గాఁడఁ దగుపత్రముల ఢుల్చె
  నని కామపై నీసు నానె ననఁగఁ
దమమనోహరునితోఁ దమిఁ గూడుకొనఁ గల్గె
  నని కెంపుచీరలు గొనియె ననఁగఁ
దమకు నొండొరుల కుత్సవసమయం బని
  కొని కుంకుమము జల్లుకొనె ననంగఁ
దమకు నాథునితోడ సమయకేళి లభించు
  నని సీధురసము ద్రావిన వనంగ

తే. అఖిలధరణీతలంబున నావరించి
లేఁజిగురుజొంపములతోడఁ దేజరిల్లి
కన్నుఁబండువు గావించుచున్న వెన్న
వివిధతరుగుల్మలతలతోఁ దవిలి వనులు.

వ. అట్టియుద్యానవనంబు మధ్యంబున. 96

## జలాశయాదివర్ణనము.

తే. చదుకము విశాలతయుఁ గల్గి చంద్రకాంత
శిలలకట్టునఁ గ్రిందిత ట్టలరుమెట్లు
నలుగడల నొప్ప నిర్మలజలము నిండఁ
దనరు నొక్కతటాక మవ్వనమునందు. 97

మ. నెలతాకట్టున నొప్పుకట్టలపయి న్నెక్కొన్న పొన్నంపుబో
ష్మలు నీటం బ్రతిబింబితంబు లగుచు న్మన్నింప నయ్యె న్మదిన్
నలసౌందర్యము నాలకించి కనుగో నాగాంగన ల్వచ్చి య
క్కొలఁకుం దేటజలంబు లాడుకొనుచుం గోర్కిం బ్రవర్తింత్రనన్.

మ. అడుగుం బ్రక్కలు చల్వతాతిపనులన్ హార్వొందు "చప్టా" పయిన్
వడియం బోసినయట్టు లచ్చ మగుచు న్వర్తించునీలోదకం
బడర న్నిండినయాసరోవరము పద్మాస్థానమై కాన వ
చ్చెడుఁ దెల్లంబడి పాలవెల్లి యిది నాఁ జిత్తభ్రమం జేయుచున్. 99

సీ. ఆప్రమదావనమందుఁ జలువతాలఁ
గట్టినబాటలు గలవు పెక్కు
వానికి నిరుగడం బంక్తులు దీరిచి
వివిధవర్ణంబుల వృక్షము లగు
వాని ప్రక్కల నీళ్లు వడివడిం బ్రవహించు
కుల్యలు పెక్కులు కోమరుమిగులు
వానిలో మత్స్యముల్ వరుసలు దీరిచి
మిలమిలలాడుచు మెలఁగుచుండు

తే. వానికై యేమొ కొంగలు బాతువులును
బెగ్గురులుఁ జేరఁ బైనుండి డిగ్గ నుఱికి
వానికలకలారావముల్ జానుగులకుఁ
బర్వ మొనఁగూర్చు నామని పర్వినపుడు. 100

మ. వనవృక్షాదులు సూచుచుం దినము వాప స్వచ్ఛ నక్షవాంఛ వ
చ్చినరాయం డరవింద ముత్పలము గాసిం బెట్టు నిచ్చోటఁ గా
దని మార్గో మయి మల్లికం దెగడి చూతాశోకముల్ మర్మభి
ద్ఘనశల్యంబులు నాఁ గనంబడ నటం గా లూన లే కార్తుఁడై. 101

చ. చిలుకలు గూయఁ, గోయిలలు చిల్గులు వోవఁ జెవుల్ నినాదముల్
జలుపఁగఁ, దుమ్మెదల్ రవ మెసంగఁగఁ జేయ, నవాగ్నిశాగతా
నిల మది మెల్లఁగాఁ దగుల నిల్వఁగ లేక నలుండు మన్మథో
జ్జ్వలశరపాతఘాతముల సొల్వడిపోయెఁ బరిభ్రమించుచున్. 102

క. ప్రమదావనమధ్యమునం, బ్రమృష్టచంద్రోపలప్రభాభాసురమై
యమరుఁ జతుశ్శాలం బొకఁ, డమరులకును దర్శనీయ మైన తెఱఁగునన్.

ఆ. శాలచెంతఁ జల్వతాలఁ గట్టినవేది
నీటియంత్ర మొకఁడు నిలిచి చిచ్చు
బుడ్డి వోలెఁ జదలు ముట్టికో వెదఁజల్లు
చుండు నచ్ఛజలము లుడుగ కుండ. 104

క. నలుగడ సోపానంబుల
నలు వగునాశాలనడుమ నలుఁ డొక్కఁడుఁ గ

న్నులు మూసి మొగముఁ జేతం
గలుగక ధరఁ గూరుచుండె గళ మది వంగన్. 105

వ. ఆసమయంబున. 106

## రాజహంసలు ప్రమదావనంబునకు వచ్చుట.

క. మానసమునుండి పుష్కర, యానంబున రాజహంస లవి కొన్ని శుభ
స్థాన మగునచటి నేలకు, నానందం బెసక మెసఁగ నరుదెంచె వెసన్.

ఉ. ఉప్పరమంద తెక్కలు సముత్సుకత స్ముడుగంగఁ జేసి మో
మప్పుడ వంచి క్రిందుగ నభోంచితవాయువు తాఁకుదెంచుటం
జప్పుడు లుప్పతిల్ల వడి సాఁగ దిగంబడి చెంతఁ జేరుచో
విప్పినపక్షయుగ్మములు వ్రేలఁగ నంచలు డిగ్గె నేలకున్. 108

చ. కొలఁకుల నీట బోటులను గూడుచు వేడుక నాట లాడుచున్
గొలకొల మంచుఁ గూయుచును గోపులు సూపుచుఁ దమ్మిగద్దెలన్
నిలుచుచు నావులించుచును నిక్కుచు నీల్గుచుఁ ద్రెంచి తూండ్లు ము
క్కుల నెగిరించుచుండి కనుఁగోఁ దగె నంచలు గన్నుపండువై. 109

చ. చరణము లెత్తి యెత్తి యొకచక్కిన చక్కఁగ మోపి హంసముల్
ధరపయి మెట్టుచు న్వీన ముదం బగుదెంచెదునట్లు కూయుచున్
సిరిఁ జనునచ్చరల్ దెలుపుఁ జీరలుఁ దాలిచి తెక్క లార్చుచుం
బొరిపొరి నాడుచు న్నటనముం బొనరించెడు నాఁగఁ దోఁచెడిన్.110

చ. పసిఁడికి నెత్తు వచ్చి చెలువం బగుముక్కులునుం బదంబులుం
బొసఁగఁగ నంచకూటువలు మోముల నెత్తి మెలంగుచున్నచోఁ
బస గలతోఁటలచ్చి తనపై డిజరీసరిగంచు తెల్లడాల్
వసనము నారవైచె విపులాతలమం దని యెంచ నయ్యెడిన్. 111

చ. ఒకచరణంబునుం దలయు నొప్పుగ నప్పుడు తెక్కసందునన్
సుకముగఁ జొన్పి వేఱొకటి క్షోణితలంబున నిల్పి హంసనా
యకుఁడు గతశ్రమంబున గతాన్యభయుం డయి నిద్ర వోవ భూ
మికి నిదుపెంపుకామతెలిమేల్గొడుగో యన నయ్యె నయ్యెడన్. 112

వ. అయ్యవసరంబున నలుండును. 113

ఉ. చంచలనేత్ర పొందు విడఁ జాలక డెందమునందుఁ గట్టి ద
క్కించుకొనం దలంచుచు నకించనుఁడుం బలె దానిసౌష్ఠవం
బెంచుచు సంతసించుచు నొకించుక కన్గవ విచ్చినంత రా
యంచలపిండు కట్టెదుట నైనఁ గనిపించె సతీలసద్గతిన్ 114

ద్విపదము. కని యేఁగు దమయంతి గదె యంచు వాని
వెనువెంటఁ బడి పట్టు విడనట్టి తీరు
నను బాఱి పరవంజి నడయాడునందుఁ
గనుపండు వగు మేటికలహంసఁ బట్టె. 115

మ. కలహంసల్ నిజయూథనాథు నటు లాకాసారతీరంబునన్
లలి నిద్రించెడుదాని నైషధుఁడు వెల్వం జేతులం బట్టుచున్
గలఁగం బాఱఁ గొలంకు వట్టె దివికిం గంపించుచున్ లేచి చిం
తిలి దుఃఖంబునఁ గూయఁ జొచ్చె నృపతిన్ ద్వేషించి దూషించునాన్.

చ. తమప్రభు వట్లు చిక్కుకొని ధాత్రి విడుత్తున నత్తమిల్లు నం
చమితభయంబునం జదల నార్తరవం బొనరించు చంచపిం
డమరి రథాంగమట్లతిరయంబునఁ జేసి పరిభ్రమించె న
ష్టము డొకం డలాతము ప్రియంబునఁ ద్రిప్పునొ నాఁ గనం దగెన్.

వ. అట్లు కలహంస లాకసంబున నాక్రందనంబు నేయుచున్నంతలోన.118

ఉ. పట్టినఁ గీచు కీచు మని పల్మరుఁ గూయుచు తెక్కదోయి న
ట్టిట్టు విదుర్చుచున్ నృపతిహస్తయుగంబును గోళ్ల గిచ్చుచున్
గట్టిగ ముక్కులం గఱచి కండలు దీయుచు రాజహంస లో
దిట్ట చెడంగ నిట్టనియె దేవుర పుట్టెడునట్టివాకులన్. 119

చ. నృపవర! నీ కొకప్పటికి నెగ్గు దలంచి యెఱుంగఁ జిత్తమం
దెపుడును సాధువృత్తి వసియించెద బిడ్డలు నెత్రుగుడ్డు లా
లపగతచిత్త తల్లి బడు గందఱ కొక్కఁడఁ బోషకుండ నే
నుపకృతి నీ కొనర్తు విడు మూరక యిట్లు వధింప నేటికిన్. 120

చ. అమలినమానసంబున విహారము సేయుచు నప్రపాయినై
యమరియు బ్రహ్మభృత్పరమహంసలఁ జేరినసద్ద్విజుండ నై
క్షమఁ జరియించుచుంటి నిటు సాధువునై ననుఁ జంపఁ బోకు మో
నృపమణి, భవన్మనోరథము నే నెఱవేర్చెద మేలు గూర్చెదన్. 121

క. నెఱులసువర్ణము మోహము, నెఱపెడినెసువర్ణ మైన నీకొక బ్రాఁతే
నెఱకాఁడ వింకఁ బోలసా, నెఱె నిడునే పిట్టపొలసు నృపతివతంసా.

క. పిల్లలు పసికందువు లని, యిల్లా ల్మతిమాలిన దని యింత వగవ నా
తల్లికి వగచెద నేఁ బో, నెల్లాగున బ్రదుకుఁ జేఁకు వృద్ధని మదిలోన్.

క. ఆయమ మదిలో నిడికొని,నాయెడఁగరుణించి విడుము నరవర,నిను నే
నేయెడ మఱవను నీకుం, జేయుదు నుపకృతిని మేలు చేకుఱు దానన్.

వ. మఱియు నాకర్ణింపు మయ్యా నిన్ను నే నెఱింగి యున్నవాఁడ
నీదర్శనంబు చేసి నీతోఁ గొంత ప్రసంగింప వచ్చితి నది దైవసంకల్పితం
బిట్లు కా దందు వేని నీ వింతనంతల మెలంగుచుండు టెఱింగియు
నిర్భయంబున నీచెంత నిద్రింతునే? నామాట విశ్వసింపుము నన్ను
విడువుము నాపలుకు లాలకింప నవహితుండ వగు మని పలుకుటయు.

క. నావుడు నివ్వెఱ వడి నల, భూవరుఁ డారాజహంస ముద్దిడుకొని తాఁ
బో విడిచె నదియు వెండియు, జీవించినయట్లు తలఁచెఁ జిత్తమునందున్.

వ. అట్లు విముక్తిం గాంచినరాయంచ యించుక యెడ గలుగ నిలిచి
మనుష్యకరసమ్మర్దంబున నైన యలసటలు దీఱఁ జంచుపుటంబున
మే నెల్ల నిమురుకొని సేద దేఱి మఱియు మనుజేంద్రునికడ కరు
దెంచి మించినవేడ్క ని ట్లనియె. 127

—॥ రాజహంస దమయంతి నభివర్ణించుట. ॥—

క. నలరాజ! వినుము చెప్పెదఁ
గలఁడు విదర్భాపురంబు కాపురముగ భూ

---

అమలినమానసము = నిర్మలమనస్సు. మానససరస్సు; అప్రపాయి=నీళ్లుత్రాగని వాఁడు, త్రాగువాఁడు, బ్రహ్మభృత్పరమహంసలు=పరబ్రహ్మనువహించిన మహర్షులు, బ్రహ్మదేవుని మోయుహంసలు; ద్విజుఁడు=బ్రాహ్మణుఁడు, పక్షి, క్షమ=శాంతి; భూమి.

తలపతి యొక్కఁడ తనికిఁ
గలిగెం దమయంతి యనెడుకన్నియ వింటే. 128

అరయఁగ సర్వసామ్యసుపదార్థసముచ్ఛ్రియశోభ యొక్కచోఁ
దిర మయి యుండఁ జూచుమతి తేజరిల న్విధి యచ్చుగ్రుద్ధరి
తి రచనల్ రచించియె సతీమణి నేర్చితి నేఁటి కంచు సం
బరమున నెంచు మున్ గుణి సమానత యాకెకు లేక పోవుటే. 129

ఇందుబింబమునందుఁ గందు చేసినరట్టు
మించుటద్దముల మాయించుతప్పు
బంగరునకుఁ దా వాసంగనికొఱతయుఁ
గెంపున మధురిమఁ గెడపువెలితి
జక్కవకవ విప్ప నెక్కొను నేరంబు
కలువల నీళ్లలోఁ గలుపుఅవ్వ
పూవుదండల వాడిపోఁ జేయులోకంబు
చివురుల ముదిరించు చిన్నతనము

తే. కడఁగి పోఁగొట్టుకొనఁ బోలుఁ గంజభవుఁడు
కన్నె మోమును జెక్కిళ్లు కమ్మమేను
మోవి చనుదోయి కనుదోయి పానరుకరము
లును బదంబులు రచియించి వనధి కాంచి. 130

చ. మగువగళంబు నెన్నఁ దరమా? దర మా దర మాదరంబునన్
దగియెదునాసఁ జేసి తను దాతను దాతను దాత! తత్సమం
బగువరదాన మీవె యన నాయన నాయన నాట సల్పు నీ
జగతిఁ బ్రదక్షిణంబులను జాలను జాలను జాలి పుట్టఁగన్.

క. గుబ్బలులా గుబ్బలు నడు, మబ్బరమా మబ్బ కొప్పయారే కన్నుల
గబ్బికలువలా నెమ్మొగ, ముబ్బెదురే తేఁడ వశమె యూహింపంగన్

క. గిల్లినఁ బాల్గారెడు మేన్, పల్లవములతీరుఁ గేరుపదములు గలయా
హల్లకపాణిఁ బొగడఁ వా,గ్వల్లభునకు నైనఁ దరము గామి నిజంబే.

ఉ. ఆయమ కీడుజోడయినయట్టివిభుం డెట నుండు నంచు నే
నీమహి యంతయు న్నెమకి యెందును గానక యిందుఁ గాంచి నిన్

గోమలదేహ! నీకు నలకోమలికిన్ విధి దంపతిత్వమున్
దీనుప మొప్పఁ గూర్చె నని తేరి మనంబున నిశ్చయించితిన్. 134

మ. ఇది నీదోద్భవనిశ్చయం బనుచు నీ వెం తేమొ కా దట్లు నా
హృదయార్థం బొకనాఁడు బ్రహ్మకడ నెంతే నిచ్చ వాక్రుచ్చుడున్
సదయుం డాతఁడు భైమికిం బతి నలక్ష్మామండాఖండలుం
డుదయప్రాంచితవైభవుం డనుచు నెంతో ప్రీతిఁ బల్కెం బ్రభూ.

వ. అమ్మత్తకాశిని యిత్తఱి నీచిత్తం బాకర్షించి యున్న దని నే నెఱుం
గుదుం గావున. 136

చ. నను బ్రదికించినట్టికరుణాళుఁడ వో నలరాజ! నీకుఁ బ్రీ
తిని గలిగించుప్రత్యుపకృతిం బొనరింపఁగ లే న కైన నీ
మనమున నెప్పుడున్ విడనిమచ్చున ముచ్చటఁ గూర్చుచున్న మా
నిని దమయంతికిం దెలిపి నిన్ను వరించెడునట్లు చేసెదన్. 137

క. నీసుగుణకీర్తనంబునఁ జేసి సతీతిలక మాఁ మె చిత్తమునం దో
భాసురమూర్తీ! నినుఁ గా, కేసరసునిఁ జొనుప నట్టు లేఁ బొనరింతున్.

ఆ. పరమహంస యిట్లు పలుకుచుండఁగ నొండు
పలుకఁజాలనట్టివాఁడ యగుచు
వేడ్కలూర నలుఁడు వెఱ్ఱి నాఁ జూచుడుఁ
బోయివత్తు నంపిపుచ్చుమయ్య. 139

తరువోజ.—

అని పల్కి నరనాథునంతరంగంబు
హర్షామృతంబున నలరంగఁ జేసి
కనుఁగవ ననుమతిం గాంచి రాయంచ
కడుముదంబున హంస గణముతో లేచి
జనపతి వీడ్కొని జవనంబు మీఱఁ
జనె నాకసము పట్టి జను లెల్లఁ దమ్ముఁ
గని నిద్ద మగునట్టికబరీభరమునఁ
గట్టుకుందము లని కడు నిచ్చ మెచ్చ. 140

చ. సమములు గాఁగఁ బంక్తు లయి సాగుచునుండఁగ నంచతేఁడు త
త్సమయమున న్ముఖం బగుచుఁ జక్కనిమార్గము వట్టి రాజహం
సములఁ జనంగఁ జేయుచు విశాలపథంబున నేగుచో వియ
ద్రమ రమణీయహారమును దాలిచె నాఁ గన నయ్యె నయ్యెడన్. 141

చ. వెనుకకుఁ గొన్ని ముందఱకు వేఱొకకొన్నియు వీఁగి మూఁగి క
న్గొనియెడునంతలో మఱియుఁ గ్రొత్తగతిన్ దివి రాజహంసముల్
చనియెడునత్తఱిన్ మడుఁగులన్ ధరియించినయోధు లాహవం
బునఁ దగఁ బన్ని మోహరము పోరెడునట్లు గనంగఁ దోఁచెడిన్.

చ. గగనపథంబునందు నొడికంబుగఁ బాఱెడురాజహంసముల్
దిగువ నెసంగువారలకుఁ దేటి కనుంగొన నయ్యె నయ్యెడన్
నిగనిగలాడుచు న్మిగుల నీటగునల్లనిపట్టుకట్టునన్
దగ నగుకెంపుతాలకడ దాపినమేల్మగతాల పేరునాన్. 143

వ. అనిన నైమిశారణ్యవాసు లవ్వలివృత్తాంతంబు సెప్పు మని సూతు
నడుగుటయును. 144

ఆశ్వాసాంతము.

సుగంధి.—

వేఁడికోలు రాకమున్నె వేలవేలు సొమ్ములన్
గూడునర్థికోటి కిచ్చి కోర్కెఁ దీర్చుదాత మే
లాడువాఁడు కామయార్యునాత్మజుండు వానికిన్
వీడనట్టిసౌఖ్య మిచ్చి వేడ్కఁ బ్రోవు మీశ్వరా. 145

గద్యము. ఇది శ్రీమహామహోపాధ్యాయ, కలాప్రపూర్ణ కవిరాజ
కవిసార్వభౌమ శ్రీపాదకృష్ణమూర్తిశాస్త్రి ప్రణీతంబయిన నైషధీయ
చరితం బనుశృంగారతరంగిణియందు ద్వితీయతరంగము.

శ్రీ. శ్రీ. శ్రీ.

---

శ్రీ ర స్తు.

# నై ష ధీ య చ రి త ము

## శృం గా ర త రం గి ణి

### తృ తీ య త రం గ ము.


మద్విక్రమసింహ
క్ష్మామండలనాథసతతసంరక్షితపూ
ర్ధాముఁడు రంగవిభుఁడు సు
క్షేమం బొనగూర్చి ప్రోచు శివరామబుధున్.

నలుఁడు రాజహంసం దలంచుకొనుట.

వ. అక్కథకుండు శౌనకాదిమహామునుల కిట్లనియె నట్లు రాజహంసంబు చనినంత నలుం డంతరిక్షంబునం దత్ప్రచారంబు లోచనగోచరం బగునంతవఱకు నచ్చాయఁ గన్ను విచ్చి చూచి చూచి చూచునంత నిర్మలాకాశంబు నిరీక్షించి తదుద్యమంబు చాలించి జాలిం బడుచిత్తంబునఁ దత్తరంపడుచు నెప్పటియట్ల చని చతుశ్శాలా శిలాసోపానంబునం జదికిలంబడి కూరుచుండి తదేకధ్యానపరాయణుండై తనమనంబున. 2

చ. పులుఁ గది చేతఁ బట్టువడి పూరుషుఁ డతఁడు చంపు నంచు లోఁ
దలఁకుచు నట్లు మోక్షము నెదం దలపోయుచుఁ బల్కె నేమొ? ప
ల్కుల నిజ మున్నచంద మది గోచర మయ్యెడుఁ బక్షి యేడ! మేల్
పలుకు లవేడ! చూడ నిది బ్రహ్మవరాంచితదేవయోనియే. 3

ఉ. నావెతఁ బాప వచ్చినది నాకము ముట్టినదాని కెట్టులే
దైవిక మైనవిఘ్నములు దాపురమై గమనప్రసక్తికిఁ

దావు లభింపకుండుట్లు దద్దయు నయ్యెడునో యథోక్తిగాఁ
బోవునొ మార్గమధ్యమున ముచ్చట లెచ్చఁగఁ దామసించునో. 4

సీ. తామసింపదువో విదర్భాపురముదారి
తప్పునో? తప్పదు తత్పరిచయ
ముండె. నుండినఁ జన నుత్సహించునొ? యుత్స
హించి దిగుఁ దిగ నెవ్వరేని
ఘాతుకుల్ హింసింపఁ జూతురో? చూడరు
చూడ కంతిపురంబు చొరఁ గలుగునొ?
చొరఁ గలిగినమాత్ర నరవరేశ్వరకన్య
హంసమహత్త్వము నరయఁ గలదొ?

తే. అరయఁ గలిగిన నెచ్చెలు లరయకుండఁ
బలుకు సేయంగఁ గలుగునో? కలుగ నాకె
నాకుయాలించునో? లేక కాఁకఁ బూని
వీకఁ జూపునొ? నావిధి యేకరణిదొ?. 5

ఉ. కామిని నాపయి న్మిగులఁ గౌతుకముం గొనియున్న దంచు నే
నామహిదేవతాప్రవరుఁ డాడఁగ వింటి నటేల నాపయిం
దామసము న్వహించి ద్విజతల్లజు నాతని వీకఁ జూచెడిన్
బ్రేముడి చూపి పల్కెడిని బిమ్మట నన్ను ననుగ్రహించెడిన్. 6

నలుండు దమయంతీగతచిత్తుండై తత్తఱించుట.

మ. ఇఁక నే నాసతిఁ జూచు టెన్నఁడొ మనోభీష్టంబు సిద్ధింపఁగా
సుకముం గాంచుట యెన్నఁడో సుదతితో శోభించుచున్ సంసృతిం
బ్రకటింపం గలభాగ్య మెన్నఁడొ జగద్వర్ణ్యంబుగాఁ గాలమున్
సకలశ్రేయము లందుచుం గడపు టెన్నండో కదా చేకురున్. 7

ఉ. చూడక యున్నఁ జూచినటు సుందరిరూపము నామనంబునన్
సూడినయట్లు చొచ్చి నను స్రుక్కఁగఁ జేయుచు నుండె నక్కటా!
చేడియ యెద్దియే మహిమ చేకొని యుండెనొ యేమొ కానిచో
వ్రీడనితాపమిట్లు పచరించి చలింపఁగఁ జేయఁ జాలునే?. 8

ఉ. పూవిలుకానివిం డ్లగును బోలిచి చూడఁగఁ జేడెకన్బొమల్
గావున దృష్టిబాణములు గాటముగా మెయిఁ జొచ్చి నాదుహృ
ద్గాత్రివము భిన్నభిన్నములుగా నొనరింప వికార మొంది నే
నీవగఁ జేష్టలం దొరఁగి యి ట్లయిపోతి నిఁ కేమి సేయుదున్. 9

వ. అని యనేకవిధంబులం బరితపించుచుఁ జతుశ్శాలసోపానంబ శరణం
బుగాఁ బ్రొద్దు పుచ్చుచుండె నంత నక్కడ నితాంతచింతాసాగర
నిమగ్నస్వాంతయై శాంతి దక్కి దమయంతి యొక్కరితయు నుప
వనంబునకుం జని యొక్కలతాకుడుంగంబుచెంతం గూరుచుండి మదన
వేదనాదోదూయమానమానసయై పరిపరివిధంబులం బరితపించుచుండె
నయ్యవసరంబున. 10

క. అంతఃపురమందుఁ గాన దమయంతిం బొడఁగాన కతిభయావృతమతులై
సంతస మఱి చెలికత్తియ, లంతంతఁ గా వెదకి వెదకి యచ్చటి కిచ్చున్. 11

ఆ. వచ్చి మచ్చెకంటిఁ గ్రుచ్చి కౌఁగిటఁ జేర్చి
యేమె తల్లి! యిట్టు లేల వచ్చి
తొంటి రాఁగఁ దగునె తొంటివలె స్నిదు
చెద్దియుండ దేమి చెప్పవమ్మ. 12

క. మాకడ దాఁపఱికంబా, నీ కెవ్వనిమీఁద బాళి నెలకొనినదియో
వాకొనుము చక్రవర్తియ, కా కాతని నీదుకాళ్లకడ నిడ మొక్కో? 

ఆ. ఏమనోహరాంగుఁడే మానసంబునఁ
దగులుకొనినయట్టితగవు మాకుఁ
గానిపించుచుండె నీనడవడి తెఱం
గరయ నరయ నిట్టియదన తరుణి. 14

వ. అని యనేకవిధంబుల ననునయించుచు నాళీజనంబు పలుకుచున్నం
గన్ను దెఱచి చూడ కక్కన్యారత్నంబు. 15

దమయంతీవిరహావర్ణనము.

క. మనసిజతాపజ్వరమున, మన సెఱియఁగ నెదిరిఁ దన్ను మఱచినగతి గాఁ
దనచెలులు పలుకరించిన,విని విననటు లై ప్రొసర్చి వెడఁగుం జెయ్వుల్.

చ. ప్రియమునఁ జెంతఁ జేరి కడుబిగ్గరఁ దన్నుఁ గవుంగిలించె నా
ప్రియుఁ డని మే నెఱుంగ కొగి వెంగలి చేతులు సాఁచి పట్టి పెం
బయలు కవుంగిలించి తమి వాతెఱకై తనమో మటొగ్గి యే
మియుఁ గనరామికిన్ దెలిసి మిక్కిలిగా వగచె న్విరాళిమై. 17

చ. సరగున లేచి యాకసము సందిటఁ జేర్చెడు మోవిపానకం
బరయఁగ మోముఁ ద్రిప్పెడుఁ బ్రియంబున నేమియొ పల్కరించెడున్
జురచురఁ జూచెడున్ గినిసి సోలెడు వ్రాలెడు నవ్వెడున్ గడున్
విరహము నొందెడున్ దెలివి వీఁగి నెలంత దురంతచింతమై. 18

వ. అట్లు మిగుల వగలం బొగలుచు శరీరపరవశత్వంబున నగపడినవాని
నెల్ల నెదియొ యడిగినట్లు నుడిగికొనుచు నత్తఱి ధైర్యం బొత్తిగిల్ల
బిత్తరి చిత్తవిభ్రమం బొందినచందంబు నెఱింగి సందని పచ్చవిల్లుగల
పచ్చిబోయ క్రచ్చుకొని వచ్చి విచ్చలవిడిఁ బెచ్చుపెఱిగి హెచ్చ
రికం దెచ్చుకొని నిడుదగేదంగిపిడి నడరు వెడఁదచిగురాఁకుటడి
దమ్మును, జుమ్మనితలది మ్మిడునాలిభూతమ్ము లగుతుమ్మెదలం గమ్మిన
నారినాఱితీఱి జంట యగుతుంటవిల్లును, తళుకు లొలుకుచికిలిచొ
వంచ ములుకులును, మేలుగేదంగివాలుం బలుకయుం గొని సుందరం
బగు బొందళంబు దొడిగి తొడిఁబడుమీను మొసలిసిడంబుల నడరు
గులుకుచిలుకతేజీయరదం బెక్కికొని, చిక్క నగుతనదళంబులతో
దొరపట్టిఁ జుట్టుముట్టి కట్టిడితనంబున కొడిగట్టి యిట్టట్టనరానికట్టలుకఁ
గలువ కడకుం దీసి నాల్గుబెట్టంపసెలకట్టియలు నిట్టఁబొడిచి గట్టిగాఁ
గొట్టి చిక్కులం బెట్టిన దిట్ట చెడి దోదూయమానమానసయై మాన
వతి మహానలసమానమైన విరిశయ్యవ్రాలి పొరలుచు దరిలేనివిరహ
సాగరంబు వెల్లివిరిసె నో యన నేత్రకోణంబులఁ గజ్జలాంచితబాష్ప
ధారాపూరంబు తోరంబై బోరనం దిగజారి కాలువ గట్టి చను
కట్టులం బడి బిట్టిగసి మిట్టిపడి పుడమిం బడి పాఱుచుండఁ గోకిల
కాకుకాకలీస్వనంబున నేడ్చుచుఁ జెక్కుటద్దములం జెయిఁ జేర్చి
చిక్కులు పడినతారహారంబులు భరంబులగుట నూడ్చివైచి యొప్పుల
కుప్ప యగుగొప్పకొప్పు విప్పి విరియం బోసికొని కన్నులు మూసి

కొని నిషధభూవల్లభుం డగునిజవల్లభునిరూపరేఖావిలాసంబులు హృదయఫలకంబునం దిడుకొని తలంచుచున్నతఱి నతండు పొడ కట్టిన ట్టయిన దిగ్గన లేచి యగ్గజగామిని కన్ను దెఱచి నలుగడం గలయ వెదకి కానక స్రుక్కి పలుమాఱు విధిం దూఱుచు మున్నీ రైనకన్నీరు కరతలంబున నొత్తుకొనుచుఁ జిత్తజవికారంబుల స్తంభ ప్రళయరోమాంచాదిసాత్త్వికాష్టచేష్టలకుం బాలుపడి సర్షపరస పానంబు చేసినపసరంబుపగిది: బెల్లారాటంబున నిలిచినచోట నిలువక కూరుచుండినచోటం గూరుచుండక యన్నపానీయంబులు వర్జించి యితరవ్యవహారంబులు చాలించి తదేకధ్యానధారణామననాదుల భ్రమఁ గొని తిరుగుచుఁ గుసుమగంధి బంధురమదనాంధకారంబు నిర్భరంబుగాఁ గప్పినం దెరు వెఱుంగక యడవిలోఁ బ్రొద్దు గ్రుంకిన ట్లుండి ముద్దురాచిలుకలు తనయొద్దకుం జేరినఁ జదివింపక యుద్దవిడిం గద్దరించుచుఁ బాలితకేళీమరాళీపాళికి మందగతులు నేర్పక శిఖండితండంబులకు నఖండకరతాళంబుల మండలభ్రమణాది తాండవంబులు నిండువేడుకం గఱపక పాఱఁ ద్రోలుచు సఖీజనంబు చేరం జని పిలిచిన మాఱాడక విసివిక[illegible]చు, నిలిచినఁ గసరికొను చు ననేకవిధంబులం బొగులుచు నితాంతచింతాసాగరంబు గడవ నీద నేరమి నెంతయే విభ్రాంతి వహించి యుండఁ జెలికత్తియలు శైత్యో పచారంబులు సేయుచుండి రంతట. 19

## సూర్యాస్తమయచంద్రోదయాదివర్ణనము.

తే. వనజముఖి యైనయయ్యినతనయ విరహ
తాపమునఁజేసి యెంతయుఁ దనువు సెడఁ ద
పించుటలు సూడ లేనట్టికించు వోలె
నినుఁడు చరమాద్రిపై వ్రాలె నింపు దక్కి. 20

చ. అధికవసుప్రభాకరుఁ డహస్కరుఁ డప్పటికాలకర్మదు
ర్విధిఁ జెడి తేజముం దొఱఁగి వేఁడిన మిత్త్రుఁడు నాక వీఁకతో
నధమగతిం బడఁగ గణిక యట్టిద యై దివి గెంటఁ దా మహో
దధిఁ బడ జారునో యనువిధంబునఁ జూడఁగ నయ్యె నయ్యెడన్. 21

క. పడమట దిక్కాంతామణి, పొడిచెడు రేవెల్గు తన్ను మోహించుటకై
యొడలెల్లఁ బసుపు పూసిన,వడువునఁ గడసంజ కెంపు వర్ణింప నగున్.

చ. వననిధిఁ గ్రుంకుచోఁ దరణి పైపయి నట్టిటు లెత్తఁ గట్టిన
ట్లనువుగఁ బ్రాకుపగ్గములయట్టిమయూఖము లభ్రమండలం
బునఁ గన నయ్యెఁ జెంగలువపొల్తుకకు న్నెలకు న్వివాహముం
బొనరుచు కాలవిజ్ఞుఁ డిడఁ బొల్చెడు బంగరుచిచ్చుబుడ్డినాన్. 23

తే. తనకు నాగ్నేయధర్మంబు దారసించు
దిష్ట మదిగాన నల్లదె తిగ్మరశ్మి
యూర్ధ్వగతి నొందె ననఁ గిరణోచ్ఛ్రియంబు
మీఁదుగాఁ బ్రాకె నెంతయు మిన్నుముట్టి. 24

తే. గర్భవతి గానఁ బ్రాగ్దిగంగన మొగంబు
తొలుత వెలవెలఁబాఱఁ బై నెలలు నిండ
ఘూకరుతముల మూల్గుచుఁ గొడుకుఁ గాంచె
నా సితద్యుతితో నెల నలువుమీఱె. 25

తే. రజతభూధరాదులను నిరాకరించి
నీరజాండభవాండంబు నించి దెసల
ముంచి ధరణీతలం బాక్రమించి మించెఁ
బండువెన్నెల కన్నులపండు వగుచు. 26

వ. ఇట్లు లోకం బెల్లఁ దనవశంబు చేసికొని వియోగుల మాయబారిం
బడవైచి రేయెల్లఁ బట్టపవలు గావించునో యనఁ బిండియాఱ విప్పి
నట్లు పండువెన్నెల కన్నుపండువై కాయుచుండె నప్పుడు. 27

ఉ. మిక్కిలి పొక్కుఁజక్కవల మే నుడికింపఁగ నగ్గిమంటయై
చక్కనిపద్మినీలతలసొ రడఁగింప హాలాహలంబునై
నిక్కి నిశాచరుండు మెయి నిండఁగ సూదులు దూర్చె నాఁగ నా
చక్కెరబోఁడిఁ బూవుఁబోఁడిసందుల వెన్నెల వచ్చి తాఁకినన్. 28

క. కనకనలాడెడు నిప్పుల
గనిఁ బడున ట్లిగురుశయ్యకై వ్రాలి కడుఁ

వనటం బొరలుచు రాసుత
వనజారిం గాంచి దూఱు బహువిధగతులన్. 29

చంద్రాద్యుపాలంభము.

చ. విను విషరాశిఁ బుట్టి యలవేఁడివెలుంగును జొచ్చి మాసముఁ
ఘనలయకర్తమాళిఁ బడి గాటపుఁ జెల్మిని జేసి యగ్నితోఁ
గనఁబడునీవు పెన్విషము గ్రక్కక వేఁడిమిఁ జూప కీజగ
జ్జనులను గాల్చిపుచ్చు కెటు సన్నక సన్నగఁ బోదు వోశశీ. 30

వ. అంత మన్మథు నుద్దేశించి. 31

ఆ. జగములెల్లఁ బ్రోచుచల్లనితలిదండ్రు
లనఘమూర్తు లతిదయార్ద్రచిత్తు
లైనసిరికి హరికి నాత్మజుండవు నీవు
కఠినచిత్తుఁ డగుట ఘనత యగునె. 32

మ. *అహహా! సత్కులజుండ వీవు కరుణాస్వాంతుండవే కాని యా
గహనాగంబుల మెట్టుదుష్టుఁడు మహాకష్టుండు భ్రష్టుండు న
న్వహము న్నిన్నుఁ గలంచువా రగుట మారా! మంచి నీ కెట్లగుఁ
సహవాసంబున దోస మబ్బు ననుబాసల్ రిత్త వో నేర్చునే. 33

వ. అంత మలయమారుతంబుపైఁ గినుకఁ జేసి. 34

ఆ. ప్రాణికోట్లకెల్లఁ బ్రాణంబ వీ వని
సకలశాస్త్రములును జాటుచుండు
నట్టిఘనుఁడ వీవు హాహా మదీయంబు
ప్రాణ మేల నీకు భరము చెపుమ. 35

తే. అంతకునిదిక్కునం బుట్టి యహివిషాస్వి
తోగ్రఫూత్కారములఁ జాల నుర్విఁ బెచ్చు
పెఱిఁగి యాశ్రయాశునిసఖ్య మెఱిఁగి జగము
లెరియఁ జేసెదు నీ వొప్పు టెట్లు పవన. 36

*గహనాగంబుల మెట్టు దుష్టుఁడు=వసంతుఁడు; మహాకష్టుఁడు=చంద్రుఁడు; భ్రష్టుఁడు=వాయువు; ఈశబ్దములు నిందం దెలుపును.

మ. అలరుంబూవులతావి దెచ్చి యధికాహ్లాదంబు లోకంబులన్
గలయం జల్లెడుచల్లనయ్య వయినం గాలాహలుం దొట్టిపా
ములనోళ్లం బడి తద్విషాకలితదుర్వార్తిం బ్రవర్తించునో
మలయప్రోద్భవ! నీవు దావమునకున్ మా అంచు నే నెంచెదన్. 37

వ. ఇట్లు విరహవేదనాభరంబున నోడ లెఱుంగక వెచ్చ నూర్పు నచ్చకో
రాక్షి నోదార్చుచు సఖీజనంబు లత్యంతదుఃఖాక్రాంతచిత్తలై తత్తఱం
పడుచు ననేకవిధశైత్యోపచారంబులు పొనరించి సేదదేర్చుచుండి 38
రయ్యవసరంబున.

ఆ. నిషధరాజుచేత నెఱి విడువంబడి
యంచపిండుతోడ హంసరాజు
మొయిలుదారిఁ బట్టి రయ మేరుపడ విద
ర్భాపురంబుఁ జేర వచ్చి యపుడు. 39

ఉ. నింగిన నిల్వరించి తననెయ్యుర నెల్లర "మిత్రులార! మీ
కుం గనవచ్చుచున్నదియె కుండినపత్తన మింతలోనఁ జే
రంగలవార మాదు మదె రాజగృహంబులయందుఁ దూర్యముల్
గింగురువుట్ట మ్రోఁగెడిని గీతము తాళము నృత్య మేర్పడన్. 40

మ. ప్రమదల్ సంజవడన్ మనోహరులతో బాళి న్వినోదించుని
చ్చమెయిం జల్లనినీట నాడి తమి హెచ్చం గేశసంస్కారధూ
పముల న్వేసికొనంగ ధూమ మిదె సంభావింప నై ఘ్రాణప
ర్వము గావించు సుగంధబంధురమునై వర్ణింపనై కంటిరే. 41

మ. అదె కన్గొంటిరె రాజవేశ్మములపై నల్లారుముద్దై సుఖ
ప్రదమై తెల్లనికాంతు లెల్లెడలఁ బర్వం గాయు రేయెండలో
సుదతుల్ వెన్నెలవత్తు లాడుకొనుచున్ సువ్వాలలం బాడుచున్
మదనాస్త్రంబులు నా మెలంగెదరు సంభావింపనై యింతలోన్. 42

తే. వెన్నెలబయళ్ల విటు లదే వేశవాటి
గువ్వకరిగొని గుసగుస నవ్వుకొనుచుఁ
దిరుగుచుండిరి యిలునిల్లు దేబె లగుచు
మేటివెలయాండ్ర మోహించుమాటఁ జేసి. 43

క. ప్రమదావనమున నదిగోఁ
బ్రమదలు విహరించుచున్నవారం దుండున్
దమయంతి యనుచు నాదుమ
ది మరాళములార! మనము దిగుద మచటికిన్ 44

వ. అని మరాళేశ్వరుం డానతిచ్చుటయు నవియును. 45

క. ఆళీజనంబుతో భూపాలాత్మజ మెలఁగుచుండఁ బ్రమదావనమం
దాలోన నవతరించెం, బోలింపఁగ నచటివారిపుణ్యం బనఁగన్. 46

క. ఒక్కొకటి గాఁగ నక్కడఁ
జుక్కలు దివినుండి పడెడుచొప్పున నంచల్
మిక్కిలిరయ మెఱపడన్
ఱెక్కలచప్పుళ్లు మ్రోయ ఱివ్వున వ్రాలెన్. 47

ఉ. అమ్మహిళామతల్లులు ప్రియంబున నంచలపిండుఁ జూచి చి
త్తమ్మున నమ్మచెల్ల యని తద్గరిమంబున కిచ్చ మెచ్చి హ
ర్షమ్మున నొండొరుం గడచి సత్వర మేర్పడ వాని నల్లడన్
గ్రమ్మరి పట్టి రొక్కొకరు కోరిక లీరిక లెత్త నత్తఱిన్. 48

ఆ. నలుఁడు పట్టి విడిచినకలహంస విదర్భ
రాజపుత్త్రి చెంతఁ దేజరిల్ల
దాని నామె పట్టెఁ దడవు సేయక పూని
మనమునందుఁ గోర్కి కొనలుసాఁగ. 49

వ. అంత నారాజహంస సఖీజనం బెడగలుగం జేసికొని యున్నయది
గావున మనుష్యవాక్యంబుల దమయంతి కిట్లనియె. 50

హంస దమయంతికడ నలునిసోయగం బభివర్ణించుట.

చ. నలుఁ డనుభూతలేశ్వరుఁ డనంగుఁడు రూపమునన్, దివాకరుం
డలఘుతరప్రతాపమున, నాకపురీశుఁడు వైభవంబునన్,
జ్వలనుఁడు తేజునన్, ఘనుఁడు చాగమునన్, సురసన్నిభుండు నాఁ
దెలియఁగ వచ్చెడి న్నిషధదేశమునందు లతాంగి వింటివే. 51

చ. గమగమలాడుకుందనముకన్నను మిన్న యనంగ నొప్పురా
కొమరుని మేనిసోయగము కొన్నిదినంబులు వెల్గు యామినీ

రమణుని, మేను లేనిరతిరాజును, జెట్టుల మెట్టుమాధవు
గ్రమమునఁ గెల్చి పొల్చుఁ ద్రిజగజ్జనసంస్తవనీయుఁడై కడున్. 52

క. ఘన మని చెప్పఁగ నగు నా
తనిపెనునునుసోఁగనెఱులు ధరఁ గా దన స్త్రీ
జనములమదు లనునెమ్ములు
కనినంతన కుతుక మందఁ గాఁ గత మేమిో. 53

చ. మొగ మలచందురుం గరఁగి పోసి విధాత రచించె నంచు మున్
దగిలి కవీశ్వరుల్ నుడువ నబ్బుఱ యం చనుకొందు రమ్మ! కాఁ
దగు నెల; వానిమోముఁ గనినంత నెలంతలకన్నుఁగల్వ లిం
పుగ వికసించెడిన్ నిజము బొం కరయం గద తేటతెల్ల మౌ. 54

తే. నలునిసోయగమున్ విని యిలకు వచ్చి
వేల్పుఁబూఁబోం డ్లెపుడు తెప్ప వేయ కతనిఁ
జూతు రయ్యబ్బెనమె వారిచూపులందు
నపుడు నిలుచుట నని మేష లైరి వారు. 55

క. నలుని వరించినరంభా,జలజేక్షణ తనదుకోర్కి సఫలము గామిన్
నలకూబరుని వరించెన్, నలవర్ణము లతనిపేర నలువగుకతనన్. 56

సీ. పురుడించు వరతేజమునను దివాకరు,
శూరత వాసవు సొంపుఁ గాంచుఁ
దలఁపించు గురుబుద్ధి దైవతాచార్యునిఁ
దాలిమి భూదేవి లీలఁ గెలుచుఁ
బోలుపొందుఁ దనుకాంతి కలువలతేఁడు నా
రూపున మారుని కేపు సూపు
సరిపోలు ధైర్యంబుసరణి హిమాద్రికి
గాంభీర్యమున దుగ్ధకంధిఁ బోలు

తే. దమము శమమును శాంతియు దాంతి కరుణ
తపము దానంబు బ్రాహ్మణతత్పరతయు
శౌచము మహాప్రభావము సాధువృత్తి
యతనియందఁ గా కన్యులయందు లేవు. 57

ఆ. అతని కీవు భార్య వగు దేని నీరూపు
నీదుపుట్టుగడయు నెలఁతమిన్న
సార్థకమ్ము లగును సాధ్వీమతల్లి వీ
వతని కీడు వత్తు వన్నిగతుల. 58

ఉ. చూచితి నెల్ల వేల్పులను జూచితి మానవలోకజన్ములన్
జూచితి భోగివర్యులను జూచితి నెల్లజగంబు లెందునుం
జూచి యెఱుంగ నట్టినృపసోముని, నైషధనాముఁ డాతఁడే
రాచకొలంపుమానికము రాజముఖీ! తగు నీకు నన్నిటన్. 59

క. ఆనలభూపతి నాకుం
బ్రాణప్రతిమానుఁ డగుచుఁ బడఁతీ! కూర్పున్
నానుడు లతనికి వేదము
లై నచ్చిన వగుచు మిగుల నానంద మిడున్. 60

వ. అని రాజహంస ప్రశంసించినంత నంతరంగంబున సంతసించుచు దమయంతి యేకాంతంబున మరాళకాంతుం జూచి యి ట్లనియె. 61

తనకు నలునిం గూర్పుమని దమయంతి ప్రార్థించుట.

చ. ద్విజవర! నేఁడు నాహృదయవీథి దహించెడుతాప మెట్టిదో
ప్రజలకు నేరికిం దెలుపరానిద యయ్యెఁ ద్రపాభరంబునన్
నిజముగ నీవు నాదయిననెంజిలి వాపఁగ నైనవేల్ప వం
డజతను వంది వచ్చి తని నామన మెంతయు విశ్వసించెడిన్. 62

క. నలునిగుణంబులు వందులు
తెలియం జేయంగ విన్నదిన మాదిగ నా
పలుకులు హృదయము దేహము
నలార్పణము చేసి కట్టె నా నుంటిఁ గదే. 63

ఆ. నలుని నాకు నెఱుఁగఁ దెలిపినతెఱఁగున
నలున కీవు నన్నుఁ దెలియఁ జెప్పి
మరులు కొనఁగఁ జేయ మఱిమఱిఁ బ్రార్థింతు
నండజేంద్ర! నిన్ను నర్థిఁజేసి. 64

ఆ. అనుడు రాజహంస యను నీవు కన్నెవు
తండ్రివంక నున్నదాన వెన్న
నవలఁగర్జ మెట్టు లగునో నాకుం దల
వంపు లగునో యనుడు వనిత మఱియు. 65

సీ. నలునిఁ గా దని యన్యు వలచితినే రాత్రి
చందురు నొల్లనిచక్కి నగుదు
నినునితోఁ బద్మినికిని బోలె నాప్రకా
శము నైషధునితోడ నమరుఁ జువ్వా
యనలసంబంధమే యైనచో నా కప్పు
డనలసంబంధమే యగుఁ దలంప
నాపాలివెన్నిధానము నలుం డాతనిఁ
గోరి చింతామణిఁ గోరఁబోవఁ

తే. బతగపుంగవ! యష్టదిక్పాలు రైనఁ
గంతుఁ డైన జయంతవసంతు లైన
సకలభువనేంద్రుఁ డైనను జంద్రుఁ డైన
నింద్రుఁ డైనను వాంఛింప నిది నిజంబ. 66

వ. ఇట్లు నానిశ్చయం బింక నీవు శంక దక్కి నిషధదేశంబునకుం జని సమయ మెఱింగి మహారాజుం గాంచి వానికి నన్నెఱింగించి కార్యానుసంధానంబు గావింపు మని మఱియును. 67

క. నైషధునిమదిఁ రోషం, బీషత్తేఁ గల్గి యున్నయెడ నామాటల్
భాషింప వలదు పైత్యవి, శేషము గలనాల్కకు సిత చేఁదగుఁ గాదే.

క. విం దారగించి తమలము, నొందుచు విశ్రాంతి గలిగి యుండినవేళన్
సందనుచు నెఱిఁగి నాదగు, సందేశము విన్నవింపఁ జనుము ఖగేంద్రా.

ఆ. మనసు విఱుగకుండ మాటలాడుచు వాని
భావగతులు మాటబడి నెఱింగి
మఱియు నాదుమాట మది నాటునట్లుగాఁ
బొసఁగఁ జేసి పలుకఁ బూను మయ్య. 70

తే. నన్నుఁ గాదాడి కినిసెనే నయముఁ జూపి
మది విఱుగకుండునట్లుగా మాటలాడి

నిన్నుఁ గా కన్య నొల్లదు నీవు గా ద
టన్న రాకన్నె లేనిద యనుము వగచి. 71

వ. అని యనేకవిధంబులం జెప్పి చెప్పి. 72

తే. వెతలు వాపి నన్ను బ్రదికింప నరిగెదు
నీదుమార్గమందు నెఱి నెసంగ
శుభము గలుగుఁ గాక చుట్టాలకు న్నీకుఁ
బోయిరమ్ము ద్విజకులాయతాఖ్య. 73

క. అనవుడు హంసం బట్లగు
నని వీడ్కొని నిషధపురికి నరిగి సమస్తం
బును నలునిఁ దెలియఁ బలుకుచుఁ
జనియెద వీడ్కొలుపు మనుడు జనపతి మఱియున్ 74

వ. రాజహంసఁ గరంబులం గ్రుచ్చి కౌఁగిటం జేర్చి ముద్దు పెట్టుకొనుచు
నభిముఖంబు గావించుకొని యి ట్లనియె. 75

ఉ. అంతిపురంబునం గలుగునాం డ్రెవరేని యెఱుంగకుండ నా
యింతిని జూడఁ గల్గితివె? యెట్టిప్రసంగము తోల్త నయ్యె? నీ
యంతన నీ వనం దెలియునట్లు వచించితొ? నన్ను గాంత యే
సంతసము న్వెలార్చుచుఁ బ్రశంస యొనర్చెనొ? చెప్పవే దయన్. 76

ఉ. నాదుప్రసంగ మాకెచెవి నాటినయప్పుడు తన్ముఖంబునం
దేదియునే వికార ముదయించినయట్టులు తోఁప వచ్చెనే
నీదగువాక్య మిష్టగతి నెచ్చెలి కిచ్చు జనింపఁ జేసెనే
కాదన లేదు గా నిను నొకానొకమాటకునే నసమ్మతిన్. 77

చ. నలుఁ డొకఁ డున్న వాఁ డనుచు నాతుక నీ వనఁగా నెఱింగెనో
తొలుత నెఱే నెఱింగినదొ తోఁపఁగ వచ్చెనె తద్విధంబు, నీ
పలుకున న న్వరించు నని భావము గల్గుట నీ వెఱుంగఁగాఁ
గలిగితె పల్కు లెగ్గతిఁ బ్రకాశము లయ్యెనొ చెప్పు మేర్పడన్. 78

ఆ. దూత వగుచు నాకు దూరమార్గము మెట్టి
పోయినట్టినిన్నుఁ బొలఁతిమిన్న

కనికరమునఁ జూచి గౌరవించినమాట
వినఁగ నభిలషింతు ద్విజవరేణ్య. 79

వ. అని పరిపరివిధంబులం బలికినదియె పలుకుచున్న రాజుం గాంచి మరాళ
రాజంబు మందహాసభాసురంబుగా మఱియు ని ట్లనియె. 80

సీ. పోయి వచ్చిన దెల్లఁ బూస గ్రుచ్చినయట్లు
వినిచితి నోరాజ! వినియు వినియు
వినని తెఱంగున వినిపింపు మందు వ
త్యాదరం బీరీతి నగును గాదె
చెప్పెద వినుము నీచే విడువంబడి
నే విదర్భకు నేఁగి నెలఁత నొంటిఁ
గని నే నలునిదూత ననినంత న న్నతి
గౌరవంబునఁ గాంచి కలికిమిన్న

తే. నలుని వరియించి యుంటిని నాకు వానిఁ
గూర్పు మని నన్నుఁ బ్రార్థించెఁ గ్రొంచె మేని
కినుక మోమున నెప్పుడుఁ గనఁగఁ బడదు
నిన్నుఁ గా కన్య నొల్ల దాయన్నుమిన్న. 81

క. నలరాజ! నేను మసలితి
నలువం గొలువంగ నేగ నా కగు ననుచున్
సెలవు గొని రాజహంసము
చెలికాఁడును దాను నెగసి చెచ్చెఱఁ జనియెన్. 82

వ. అట్లు కలహంస నలునకున్ దమయంతికి నన్యోన్యానురాగంబు పుట్టించి
చనినంత. 83

నలదమయంతులవిరహము.

క. నలుఁడును దమయంతియు నా,కలహంసము పలికినట్టి కారణమున మి
క్కిలి రైనమనసిజా ర్తిం, బలుగతులం బరితపించి బడలి రిరువురున్.

చ. మనసిజతాపసంక్షుభితమానసులై దమయంతియు న్నలుం
డును విరహంబు సైఁపక కడుంగడు వందుచు నందనంబులన్

ఘనఘనసారపాంసుశశికాంతవితర్దులఁ బుష్పశయ్యలన్
వనజవనంబుల న్నిలిచి నాళ్లీలు పుచ్చిరి వెచ్చ నూర్చుచున్ 85

వ. అంత నట దమయంతియు. 86

సీ. రాయంచ వచియించి పోయినయది గోలె
నస్వస్థచిత్తయై యనుదినంబుఁ
జింతాజ్వరంబునఁ జెన్ను విడి వివర్ణ
వదనయై నిట్టూర్పు వదలి వదలి
దిక్కు లరయుచు నూర్ధ్వదృష్టియై ధ్యానించి
కన్నుల నశ్రువుల్ గాఱ నేడ్చి
తినక త్రావక కంటఁ గనక రేలుఁ బవళ్లుఁ
గునుకక పలుకక వనటఁ గుంది

తే. శయ్యఁ బొరలుచు బెదరుచు సారె సారె
కుహూ యనుచును భ్రిలిచిన ట్లో యటంచుఁ
బలవరించుచు నున్మత్తవలె మెలఁగుచుఁ
గరము విరహజ్వరార్తయై పరితపించె 87

వ. ఇట్లు విరహతాపంబునం బరితపించు నమ్మించుఁబోఁడి శుకపికాదులం
దిలకించి వానిపై నలుకం జేసి. 88

*సీ. కీరమా! చటులవాక్పూరమా! త్రుళ్లకు
బావురుగాఁడు నాపజ్జఁ గలఁడు
కోకిలంబా! కలుషాకులంబా! యింక
నో రెత్తకుము వానకారు వచ్చు
భృంగమా! గితప్రసంగమా! చాలు నీ
యొగిరిపాటిందు సంపగెలు గలవు
కోకమా! వంచితలోకమా! యింతలోఁ
బొగ రేల నీపాలఁ బొద్దు గ్రుంకు

బావురుగాఁడు=పిల్లియనియు, వైదూర్యమనియు నర్థము; గీతములోని రాజవిశేష
ణము లన్నియుఁ గీరాదులకు విరోధవస్తువులే. ఘనుఁడు=మేఘుఁడు, రాజు=చంద్రుఁడని;

తే. నెల్లరును నేమి చేసెద రింక నన్ను
భూరివైదుర్యభూషణభూషితుండు
ఘనుఁడు చంపకమాలికాకలితగళుఁడు
నిషధరాజు నాపై దయ నెఱపుఁ గాన.

వ. అట్లున్న దమయంతిం దిలకించి తత్తఱంపడి చెలికత్తె లావృత్తాంతం
బంతయు భీమభూపాలున కెఱింగించిన నతండు సంప్రాప్తయౌవ
యగు తనకూఁతుం దలంచి కార్యం బెట్లు సమకూరునో య
చింతించి

—— దమయంతీస్వయంవరోద్యమము. ——

చ. కొమరితకుఁ స్వయంవరము కోరిక లీరిక లెత్తఁ జేయ డెం
దమునఁ దలంచి భూతలమునం గలరాజుల నెల్లఁ బిల్వ వా
రమితచమూసమేతు లయి హస్తిరథాశ్వరవంబు మ్రోసి ది
క్సముదయ మెల్ల నిండుకొనఁగాఁ జనుదెంచి రొగి న్విదర్భకున్. 9

క. వచ్చినవారల నెల్లం, బొచ్చెము లేకుండ భీమభూపాలుఁడు దా
నిచ్చమెయి నాదరించుచు, నిచ్చె న్వారలకు విడుదు లెసకం బెసఁగన్

తరువోజ.—

అక్కాలమున యందు నమరమునీంద్రు
లై నపర్వతనారదాఖ్యులు వార
లిక్కాశ్యపీతల మెల్లఁ గ్రుమ్మఱి మ
హేంద్రలోకమునకు నేఁగిన నింద్రుఁ
డక్కఱఁ బూజించి యడఁకువం గుశల
మడిగిన నారదుం డనియె నో దేవ!
మక్కువఁ గని యెల్లమాగాణములు గ్ర
మమున వచ్చితి మనామయులమై యిటకు

తే. ననిన విని పాకశాసనుం డనఘ ధర్మ
మున మహీపాలనము సేయుపురుషవరులు
యోధులై శస్త్రనిధనంబు నొంది యిటకు
నతిథులై రా రిదేమి నా కానతిమ్ము.

చ. అనవుడు నారదుం డనియె నయ్య బుధేశ్వర! భూతలంబునన్
దనరు విదర్భరాజసుత దానిస్స్వయంవర మొప్పు నిప్పు డం
దున ధరణీంద్రు లెల్లరును దోరపురాసిరితోడ నప్పురం
బునకు గమించుచుండి రెదఁ బో రనుమాట దలంప కింతయున్. 95

ఆ. ఉర్విఁ గలుగుసర్వయోషిజ్జనమునందు
రత్నభూత యగుచు నూత్నయావ
నమున నొప్పుచున్ననలినాక్షి దమయంతి
వాంఛ సేయనట్టివాఁ డెవండు. 96

*శా. కాకోలంబును వెన్నుఁ దన్ని విషధిన్ గష్టాత్ములై నిల్వఁగ్రు
ద్ధేకాలంబును గ్రాలఁ బుట్టి యెవరే నీక్షింపఁ జాల్వారితోఁ
నైకో కెగ్గు చరించునప్సరస లాగంజాక్షికాల్గోటితో
నేకొంచెంబును బోలఁ జాల రని వాకీఁ జాలి నే వచ్చితిన్. 97

†చ. నెఱి గలభీమరాజసుత నెమ్మొగమం దెలనవ్వ దోఁపఁగా
నెఱకలఁ గీలుగంటు నిడి నిద్దపురైకను దాల్చి తెప్పపా
ట్లొఱపును జూపఁ జూచుచు సముత్సుకతం బొలుపొందుచుండ నే
తెఱవయు సాటిరా దనుచుఁ దెల్పుచునుంటిఁ ద్రిలోకవల్లభా. 98

క. అని పలుకుచున్న సమయం,బున నటకున్ లోకపాలముఖ్యులు వేడ్కం
జను దెంచి నారదోక్తి, న్విని వారుం దనరి రిచ్చ వెలఁదుకఁ జూడన్.

ఆ. దేవమాని మఱియు దేవలోకములందు
నురగలోకమందు నరులలోక
మందు నామెఁ బోలుసుందరాంగి యొకర్తు
లేనిమాట నిజము లేఖులార. 100

### ఇంద్రాదులు స్వయంవరమునకు వచ్చుట.

వ. అని వారి నామంత్రించి పర్వతనారదు లరిగినంత నంతకాగ్నివరుణు
లింద్రుం బురస్కరించుకొని విమానంబు లెక్కి దమయంతీస్వయం
వరదర్శనలాలసులై భూలోకంబునకుం బయనంబై రప్పుడు రంభో

---

ఇందు-కాకోలము, విషధి, కష్టాత్ములు, నిలువుగ్రుద్దు, అప్సరసలు, ఇవి నిందార్థ బోధకములు. † ఇందలివిశేషము లచ్చరలకు లే వనియు నవి మనోహరము లయినవనియు నభిప్రాయము.

ర్వశీ మేనకా తిలోత్తమా ఘృతాచీ ప్రముఖాప్సరోజనంబు తమ్ముఁ
గా దని దేవతావల్లభుండు భూలోకప్రయాణంబు సేయుట కోర్వఁ
జాలనియుల్లంబుల నొల్లంబోయి మొగంబుల విన్నదనంబు దోఁప
నోపికలు లేక తమలోనం దారు. 101

మ. మనసౌందర్యము గా దటంచు నొకసామాన్యావనీనాథక
న్యను గోరంతలు గొండయంత లని సన్మానించి త్రైలోక్యముం
గొని యేల్తీరునియంతవాఁ డడిగి కైకోఁ గోరి స్వర్గౌరవం
బును బోకార్చి గమించునట్టె ధర కీపోఁగాలముం గంటిరే. 102

మ. మనకంటెన్ రతికంటెఁ దక్కినమహా మర్త్యాంగనాకోటికం
టెను సౌందర్యమునందు మేటి దమయంతీకన్య యంచున్ విరిం
చనపుత్రుం డుచితత్వ మెంచఁడు ప్రశంసం జేసె మర్త్యింప కీ
ఘనవాహుండు ప్రయాణ మయ్యెనఁటె! యీకష్టంబు సామాన్యమే.

*ఉ.ఇక్కడివారిగౌరవము నేటను గల్పి బుభుక్షుఁ డేఁగి తా
నక్కడ మూట గట్టుకొనునట్టిది యెట్టిదొ మీఁద విందు రీ
రక్కట! దైవతంత్ర మొకయట్లుగ నై సకి దొంగకోడి చేఁ
జిక్కక త్రోసిరా జనినఁ జెప్పెడిదే మిఁక వీరిభాగ్యమున్. 104

క. కలహప్రియుండు కన్యా,తిలకంబును దెలిపె నేని తెలుపఁగ వచ్చున్
జలజాక్షి కాలిగోటికిఁ, దులగా రచ్చర లటంచు దూఱెన్ మనలన్.

క. నిలువుంగ్రుడ్డులవా రని
హాలాహలముతో వనంబునం దై రనియున్
ఖలచిత్త లనియు మనలన్
బలుఁదెఱఁగుల నాడె నతఁడు పరమర్షి యఁటే. 106

వ. అని మఱియు ననేకప్రకారంబులం దమలోఁ దారు ప్రసంగించు
కొనుచుండుసమయంబున నింద్రాదులు విమానంబు లెక్కి భూతలం
బునకుం బ్రయాణంబు గావించి రప్పుడు. 107

చ. ఇరుగడ సొన్న పుండళులకు లీనెడుచిక్కని టెక్కదోయియున్
గురుతరపుచ్ఛమున్ మెడయుఁ గోలమొగంబును గ్రింద గిట్ట లన్.

దొంగకోడి=అహల్యకై కోడియైనయింద్రుఁడు.

జరణియుగంబునుం గలిగి సంతతశబ్దముతో దివంబునన్
గరుడులు వోలె వేలుపులఁ గైకొని యేఁగె విమానముల్ వడిన్.

చ. కని కనునంతలో మఱియుఁ గన్గొన నోపనియంత వేగముఁ
గొని దివి దేవయానములు కోటులు మేటులు యోజనంబు లొ
క్కనిమిషమంద దాఁటుచు నొకానొకయంతటిలో నిలాతలం
బునకు దిగెన్ విదర్భపురిపొంతన నాలుగు నాల్గుదిక్కులన్ 109

వ. అక్కాలంబున. 110

చ. నలుఁడును రాజులెల్లరు ఘనం బగు పెర్మి విదర్భ కేఁగుటల్
తెలిసి మనంబునం దలరి తీరనికోరికఁ దానును న్మహో
జ్జ్వలవిభవంబునం దరలి వచ్చె మహం బరయ న్నరాకృతిన్
వెలసినమన్మథుం డనఁగ వేడుకఁ గూర్చుచు నెల్లవారికిన్. 111

సీ. నడగొండ లో యన నడబెడం గడరంగ
నడయాడునేనికగడలు దనర
సుడిగొట్టునకు దీటువడునట్టు నట్టాడు
నడగండ్లమొత్తముల్ నడుమఁ బొదలఁ
బిడుగుపిల్ల లనంగ వడి గల్గి కడిమిమై
నడరెడునడజోదుదడము లొప్ప
గుడిగోపురంబుల బెడఁగు నడలఁ జేసి
గడిదేరుతేరులబడు లెసంగ

తే. బలసి చతురంగసైన్యముల్ కలయఁ బర్వ
వందిమాగధు లందందు వరుసఁ బాడఁ
గవులు గాయకులును మంత్రిగణము గొలువ
భద్రదంతావళము నెక్కి వచ్చె నలుఁడు. 112.

వ. లోకపాలు రట్లు సపరివారులుండై మార్తండుని తెఱంగున వెలుంగుచుం
బోవుచున్న నైషధుం గాంచి తద్రూపలావణ్యసంపదకు విస్మితులును
విగతసంకల్పులు నై విమానంబులు నింగి నిలువం బెట్టి ధరణీతలం

ఏనికగడలు=ఏనుఁగుసమూహములు. సుడిగొట్టు=గాలి. నడగండ్లు=గుఱ్ఱములు.
నడజోదులు=కాలిబంటు.

బున కవతరించి నలునిసన్నిధానంబు గల్పించుకొని పలుకరించి ప్రశం
సించుచు నిట్లనిరి. 113

ఇంద్రాదులు నలుని దూతగా వరించుట.

ఉ. ఎవ్వరివాఁడ? వెవ్వలని కేఁగుచునుంటివి? నీదుకాపురం
బివ్వసుధాతలంబ కద? యెయ్యది నామము? రాచఠేవ మై
నివ్వటిలుం దనంత గమనింపఁగ వచ్చెదు నైషధుండు నా
నవ్వల వీరసేనమనుజాధిపుపోలిక నీకుఁ గల్గుటన్. 114

ఉ. రాజకులప్రభూతుఁడ వరాతినృపాలకమౌళిరత్న నీ
రాజితపాదపీఠుఁడవు రాజకళాకలితాచ్ఛకీర్తివి
భ్రాజితమూర్తి వార్తజనరక్షణతత్పరచిత్తవృత్తి వో
రాజ! నినుఁ నుతింతురు నిరంతరదానవిభూషణంబుగన్. 115

తే. నిన్ను నర్థింతు మే మన నృపుఁడు నేను
నైషధుఁడ వీరసేనునినందనుండ
నరుగుచుంటిని గార్యార్థి నగుచు నొండు
కడకు మీసమర్థన మేమొ నుడువవలయు. 116

వ. అనినం బరమానందకందళితాంతరంగులై వా రతనిం గాంచి. 117

క. ఓసత్యవ్రత! నిషధేశా! సాయము మాకుఁ జేయుమా దూతుఁడవై
నా సార్ద్రహృదయుఁడై నేఁ, జేసెద నని ప్రతిన చేసి చెచ్చెర నలుఁడున్.

తే. అంజలి ఘటించి యోయయ్యలార! మీర
లెవ్వ రే మీకు దూతనై యేమి కార్య
మాచరింపఁగ వలయు యథార్థగతుల
నానతిం డన దేవేంద్రుఁ డనియె నిట్లు. 119

శా. ఏ నింద్రుండ నితండు వహ్ని వరుణుం డీతం డితం డంతకుం
డో నిర్దుష్టచరిత్ర! మే మవనిపై నొప్పారువైదర్భిఁ గై
కో నేతెంచితి మీవు దానికడ మాకోర్కి న్నివేదించి మా
లో నేయొక్కరి నే వరించునటు లీలోఁ జెప్పి యొప్పింపవే. 120

మ. అనినం బ్రాంజలియై నలుం డను మహాత్మా! నన్ను నేకార్థయు
క్తునిఁ బంపం దగునయ్య యుత్సుకుఁడ నేఁ గోర్కిం బ్రవర్తింతు నా

వనితం బొందఁగ దానిచెంత నెటు చెప్పఁగ నేతు నన్యార్థమ
త్యనుకంపాంచితచిత్తులై సయిచి నన్నాలింపుఁడీ మ్రొక్కెదన్. 121

అనిన నింద్రాదిదేవత లాతనిం జూచి. 122

తొలుతఁ జేయుదు నని నీవు పలికి యిట్లు
చేయఁ జాల నటం చని చెన్ను దఱుఁగ
నిపుడు పలుకంగఁ దగు నయ్య నృపలలామ!
పలికి బొంకుటకన్నఁ బాపంబు గలదె. 123

అర్థియాచితార్థ మది కూర్ప లేనట్టి, వానిజీవితంబు వ్యర్థ మిలకు
వాఁడు బరువు వానివలెఁ జెట్లు కొండలు,సాగరములు గావుక్ష్మాతలమున.

*మనసునఁ వాక్కునం గాయమున నకార
మెన్నఁడును జేర నీయనిసన్నుతమతి
వగుచు దానిని ఖండించి నట్టిఁడ వయి
నలవరాహ్వయ మంది తో నరవరేణ్య. 125

ఈతఁడు లేనివాఁ డగు మహీతలమం దని యర్థిమోముపై
ధాత లిఖించినట్టిలిపి ధైర్యమునఁ మృష సేయఁ బోక నీ
వేతఱి లేమి లేనియతఁడే యని యర్థము సెప్పి యర్థి వి
ఖ్యాతధనాఢ్యుఁ జేసినమహాప్రతిపాదకమూర్తి వెన్నఁగన్ 126

శివతాతీ! త్రిదివస్థకల్పమహీరుట్చింతామణీ కామధే
నువు లుద్భిజ్జ శిలా పశుత్వముల నై నూల్కొల్ప నర్థింప నొ
ప్పవు నీచత్వగతిప్రసంగమున భూపాలాగ్రగణ్యుండవై
తవు నీ వెంతకుఁ జాల వర్థులమనోర్థం బెంచ నీకే తగున్. 127

అంత దేవేంద్రుం డతనిఁదనచెంతకుం బిలిచి చేయిపట్టుకొని యేది యె ట్లయినం గాని త్రిలోకేశ్వరుండ నగు నేను నిన్నర్థించుచుంటిం గావున దేవకార్యంబు దీనిం దీర్పక తప్ప దిప్పుడ పొమ్మని పారిజాతకుసుమదామం బఱుతం దగిలించిన నమ్మనుజేశ్వరుం డొండాడఁ గూడమి సమ్మతించియు సురక్షితమ్ములైనరాజవేశ్మమ్ములే నెట్లు ప్రవే

*న=నకారమును, ల=లునుజ్ ఛేదనే, లునాతి, ఖండించినవాఁడు గావున నలుఁడు నని యర్థము.

శింపఁగల ననుటయు దేవేంద్రుం డౌలె మ్మని యమ్మనుజేంద్రునకుఁ దిర స్కరిణీవిద్య నుపదేశించి నీవు మానుడికారంబున నొరులకంటం బడకుండ నందుఁ బ్రవేశింప నోపుదు పోయిరమ్ము నీవచ్చునంతకు మే మిందుఁ యుండు మనుడు నతం డౌఁ గాత మని రథంబెక్కి కదలి చని విదర్భాపురంబుకడ రథావరోహణంబు చేసి కాలినడం బురప్రవే శంబు గావించి తిరస్కరిణిం జేసి యొరులకంటం బడకుండ రాజ మార్గంబు వట్టి రాజభవనంబునం జొచ్చి కక్ష్యాంతరంబు లెల్ల నల్లనం గడచి పోవుచు నెదురు వడినవారిం దొలఁగి తప్పించు కొనుచు నెప్పు డెప్పుడు తప్పునిపని యైనఁ గొప్పి యొప్పువడిన వా రిది యేమి యబ్బురం బని డబ్బాట నివ్వెఱంపడి నిలిచి చూచు చుండ లోలో నవ్వుకొనుచు రాజభవనం బతిక్రమించి కాంతాజన సంతతసంచారంబునం జేసి దమయంతీశుద్ధాంతం బిది యని సిద్ధాంతీక రించుకొని ప్రవేశించునంతలో నత్యంతికంబున. 128

నలుఁడు దూతయై దమయంతికడకుఁ బోవుట.

సీ. తగుపచ్చఱాకట్టు మగఱాలగోడలు
నీలాలపని నెలఱాలమెట్లు
నపరంజి నెడఁగూర్చునద్దాలకిటికీలు
పటికంపునునుద్వారబంధములును
దమ్మికెంపులఁ జెక్కుతలుపులు వైదూర్య
ములఁ జిల్లుపని గలవలభితతులు
పసి గలపవడంపువట్రువకంబముల్
మేలిమిజాళువాదూలములును

తే. మఱియుఁ జిత్రవిచిత్రముల్ మలయుపనులు
గలిగి కన్నులపండువై కనుఁగొనంగ
నొగి హొరం గలరారెడునొక్కదివ్య
భవనమును గాంచె నారాజవల్లభుండు. 129

వ. కాంచి తదనుభావంబున కద్భుతంబు నొందుచు మించినవేడ్కమెయి నించుకించుక విలాససంచారంబు సేయుచుం బ్రవేశించునంతలోన.

చ. నలుఁ డదె వచ్చుచుండె లలనామణి! నీదువిరాళి యంతయున్
ఫలిత మగుం దొలంగెడిని బంచశరార్తియు నూఱడిల్లు మో
చెలి! యని నెచ్చెలుల్ వలుకఁ జిల్కలు కుల్కుచు నట్లె వల్క భూ
తలపతి నాతిరస్కరిణి తప్పినదో యని సంశయించెడిన్. 131

చ. తనకడఁ బారిజాతసుమదామసుగంధము నల్కలంకులన్
ఘనముగ ముట్ట నిట్టి దొకనాఁటికినేని యెఱుంగ మద్దిరా
మనుజులు చూడ రిద్ది సురమాన్య మి టెక్కడినుండి వచ్చెనో
యని చెలులాడుకో విని ప్రియంపడు నానిషధేశ్వరుం డెడన్. 132

ఆ. సతతవాసనావశముననో యన నలు
మైసువాసనల్ సుమాళి మిడుచు
నతివ! కలయఁ బర్వె నని దమయంతితో
ననఁగ విని నలుండు నలరె మదిని. 133

మ. నరనాథాగ్రణి బాహుకీర్తిమణులన్ లగ్నంబుగా లాగికో
వరచేలాంచల మల్ల జారి పడుటన్ వక్షోజముల్ గప్పకే
తరుణీరత్న మొకర్తు వోవఁ గనుటల్ తప్పించుఁ దప్పించి మో
మరిలెన్ వేఱొకవైపు గాఁ గలిగెఁ గాంతాంగాతిసంస్పర్శమున్. 134

మ. ఒకచో నింతులు బంతు లాడుకొనఁగా నుత్సాహముం జేసి మీఁ
దికి బంతి న్విసరంగఁ బోయి నలధాత్రీనాథుచేఁ జిక్క ము
ద్రికచే నొక్కి యతండు దాని మరలన్ వ్రేయంగ వా ర్విస్మయో
త్సుకలై చూపిరి దానిపై నలలిపుల్ చూపట్టుటల్ భైమికిన్. 135

మ. సుకుమారుం డట నైషధుండు "ముకమల్ సోఫా" పయి న్మేను సే
ర్చి కడం గందుకకేళిఁ దేలుసఖులన్ బ్రీతి న్విలోకించుచో
సకి యొక్కర్తుక వచ్చి సంభ్రమముతో క్ష్మానాథుపై వ్రాలి లో
సుక మైన న్వెఱఁ గొట నెచ్చెలుల కాచో వ్వెల్లఁ జెప్పెం దగన్.

తే. నిషధరా జొక్కచవికెలో నిలువ నటకుఁ
దటుకున న్వచ్చి యొకచేడె తనయురోజ
ముల నతని నొత్తి నలుగడం గలయఁ జూచి
పడియె నబ్రము తనసుఖస్పర్శమునకు. 137

క. ఆనాఁ డష్టమిఘటికలు
గాన సుఖస్పర్శ మగుటఁ గళ గరఁగి కడుఁ
మానసమున నానందము
మానిని దా ననుభవించె మఱియు మఱియున్. 138

సీ. నలవిరహార్తిమై నవసినదమయంతి
కెలమి ఘటింపఁగా నెంచి చెలులు
నలునిభూమిక యొక్కనాతియు దమయంతి
భూమిక యొక తెయుఁ బొసఁగఁ దాల్చి
నాంది ప్రస్తావన నడపి రాయంచసం
దేశ మభినయించి తేజ వెంచి
పిదప స్వయంవరవిధి నైషధునికంఠ
మున భైమి పుష్పమాలను దగుల్ప
తే. నలుఁడు మోమున సిగ్గును నగవు దోఁప
హస్తమున సతీహస్తగ్రహణ మొనర్పఁ
గాంచి సభ నున్న దమయంతి వాంచి మోము
సంతసమ్మున మందహాస మ్మొనర్చె. 139

మ. పదవిన్యాసము మందహాసమును నిశ్వాసశ్రుతంబుల్ నుడుల్
పదచిహ్నంబులునుం బ్రతిధ్వనులు ద్వంద్వస్పర్శము ల్వాసనల్ [టఁ
పొదలం జొచ్చుట మాయలాఁ డెవఁడొ రాఁబో ల్బాడుఁ డం చంత
వెదుకం జొచ్చిరి మచ్చెకంటులు భయాన్వీతాబలస్వాంతలై. 140

తే. గ్రహము సోఁకినయప్పు డీక్రమము కాని
కలవు భయబాధ లప్పు డీగ్రహము సోఁక
నచట నానందసౌఖ్యము లంత కంత
కతిశయించుచు నొకపర్వ మయ్యె నపుడు. 141

వ. అట్లు తిరస్కరిణీప్రభావంబున నైషధేశ్వరుం డావిదర్భేశ్వర
కన్యాంతఃపురంబున నలుగడం గలయఁ గ్రుమ్మరి యొక్కచో నొక్క
రమణీయభద్రోదవసితాభ్యంతరంబున. 142

## నలుఁడు దమయంతిం గాంచి ప్రశంసించుట.

మ. కనియెన్ భీమసుతన్, సతీజనసమాక్రాంతన్, నితాంతాంగసం
జనితాభాజ్వలితావరోధను, ఘనాంచత్కేశపాశన్, లస
త్తనుమధ్యన్, విభవాభిశోభితముఖిన్, దన్వంగి, లోకైకశో
భననేత్రన్, వరవర్ణినిన్, దరుణి, విభ్రాజద్దుకూలావృతన్. 144

చ. తరుణవయస్కుఁ డైననృపతల్లజుదృష్టి విదర్భరాట్సుతా
వరపదమందుఁ బొందుపడి పై ననఁటుల్ స్పృశియించి పోయి యం
బరమున బావిలోఁ బడి క్రమంబున బంగరుమెట్ల నెక్కి భూ
ధరములసందునన్ బడి పథం బరయం జలియింపఁగ లేక దద్దిఱెన్

క. కామశరం బననగు న
క్కోమలిఁ గనినంతమాత్రఁ గువలయపతికిన్
గామార్తి పొడమి పొడుగై
సామాన్యము గాక కూర్చె సంతాపంబున్. 145

మ. ఇది బంగారపుబొమ్మ యంద మన నేదీ తావి? మేల్జాజిపూ
లొదుగం గూర్చినబంతి యంద మన నేదో నైగనిగ్యంబు? పెం
పెదుగం గూడినమెర్పు లంద మన నున్నే నిల్కడల్? బమ్మ యీ
సుదతిం బోలిక లేనియట్లె సలిపెన్ క్షోణీస్థలి న్నేర్పునన్. 146

వ. అని ప్రశంసించుచు. 147

చ. చెలి కనురాగ మెప్పగిదిఁ జెన్నలరారుచునుండెనో కనన్
నలుఁ డిటు నట్టు మెట్టు చొకనట్టున మన్మథవిగ్రహంబు క
న్గలువల కగ్గ మైనఁ బరకాంతునిఁగాఁ దలపోసి యీసు లో
మొలవఁగఁ జెంత కేఁగి కనె మోహనమూర్తినిఁ బ్రక్కఁ బద్యమున్

శా. ఆఁకేనిం దిన కాహరు న్వరునిగా నాశించునగ్గౌరికిన్
శోకంబుం దిగఁద్రావఁ జేసినమహాశూరుండ వో కామినీ

---

ఇందు-విషయనిగరణము చెప్పంబడినది. పదము = పాదము; అనఁటుల్ తొడలు; అంబరము = నడుము; బావి = బొడ్డు; బంగరుమెట్లు = వళులు; భూధరములు = పాలిండ్లు; అని తెలియందగు.

లోకాధార! రమాకుమార! కరుణన్ లోఁ బూని మా భైమి కా
వై కుంఠుం బురణించునైషధునిఁ గూర్పం గోల్తు మెప్పున్నినున్.149

మ. అనుపద్యంబు పఠించి చెంతఁ బెడమోమై చూచుచున్ దక్షిణం
డనఁగా నున్నస్వవిగ్రహంబుకడ దీనాస్యంబు దోఁపం గరం
బు నెఱిం బూని కరంబు లెత్తి వినయంబుం జూపుచు న్వేఁడుక్రొ
న్ననఁబోఁడిన్ దమయంతిఁ జూచి నలుఁ డానందించె డెందంబునన్.

చ. నలుఁడు వరించుపోయగము నా కగునో యని దర్పణంబు కై
నిలిపి విదర్భరాజసుత నెమ్మొగముం గనుచుండ వెన్క నై
నలుఁడు నిజాకృతిం గనుఁగొనం బొనరించిన నామె విస్మయం
బొలయఁగ మోముఁ ద్రిప్పి యెదియుం గనఁ జాలక వంత వందు రెన్.

తే. తనకు రాయంచ వ్రాసి యిచ్చినవిచిత్ర
ఫలకమును జూచుచున్ భైమి పలుఁ దెఱఁగుల
మనముఁ ద్రిప్పుచునుండ నమ్మనుజవిభుఁడు
వెనుకకున్ లాగి వైచె నివ్వెఱ జనింప. 152

సీ. పూవిలుకాఁ డెంతపో యనం జాలురా
కొమరులం జెప్పినఁ గోపగించు
బంగారుకొండపై రంగార నిన్నుఁ గూ
ర్చుండఁ బెట్టెద మన్న నొండు పలుకు
నంచ చెప్పినమాట లాసించి నలుఁ డఁట
వానినే పెండ్లాడ వాంఛ సేయు
గేదంగిబొమ్మనే కా దన కరయుచు
నిరతంబు మెసవదు నిదురవోదు

తే. పలుకరించిన మనతోడఁ బలుకఁ బోవ
దంద రానట్టిపండ్లకు నాస సేయు
నకట దమయంతి యని చెలు లచట నచటఁ
బలుకుచుండఁగ విని ఱేఁడు వలపు పెంచె. 153

చ. అట నట నైషధ ప్రతిమ లాచవికెం గనిపింపఁగా నలుం
డటఁ జని వానిమధ్యమునయందు నిలంబడి స్వస్వరూపసం

ఘటితవికాస మెర్పడఁగఁ గానఁగ వచ్చిన నొర్తు వోయి య
చ్చటి కది విగ్రహం బనుచు స్పర్శసుఖంబును బొందె నెమ్మదిన్. 154

వ. అయ్యవసరంబున దేవేంద్రప్రేరిత లగుదేవదూతికలు కొందఱు కొన్నిదివ్యోపాయనంబులు కొని కన్యాంతఃపురంబున కరుదెంచి దమయంతిం గాంచి తమ్మెఱింగించుకొని దేవసందేశంబు నివేదించిన వారిం బలకించి గౌరవించి కూరుచుండ నియోగించి యమ్మించుఁబోఁడి పోడిమిం జూపుచు నిట్లనియె. 155

శా. ఏ నింద్రాదులకు న్నమస్కృతులి వెన్నేఁ జేసి సేవించెదం
గానీ వారికిఁ బత్నినై త్రిదివసౌఖ్యం బందఁ గాంక్షింప నా
మే నానైషధచక్రవర్తి కెపుడో మేకొంచు నర్పించితిం
గానన్ మీ రిఁక నొండువల్కక చనంగా మిమ్ముఁ బ్రార్థించెదన్.

తే. అట్లు దూతికలం బల్కి యలరుఁబోఁడి
యుచితసత్కారముల వారి నుపచరించి
యంపిపుచ్చె నలుం డది యచట నుండి
కాంచి యెంతయు సంతోషకలితుఁ డయ్యె. 157

### నలుఁడు దమయంతికి దర్శన మిచ్చుట.

వ. ఇట్లు కొంతసే పాశుద్ధాంతంబున విహరించుచుఁ బంచశరసంతప్తగాత్రుం డగునమ్మహీకళత్రుండు నిజరూపప్రదర్శనంబునకుం దగిన తరుణం బిది యని గ్రహించి దమయంతిసమక్షంబునకుం జని దేవదత్తశాంబరిం దిగఁద్రావి జలధరతిరోధానంబు వాసి ప్రకాశించు సంపూర్ణపూర్ణిమాచంద్రునిచందంబునం బ్రకాశించుచు. 158

శా. దేహచ్ఛాయఁ దదంతరాళమున నెందే సందు లేకుండ నా
గేహం బంతయు నిండఁ గన్గవచుల్ క్రీడింప నందందు సం
దేహస్ఫోరక మైననవ్వు మొగ మూర్తిం గీర్తి సూపింపఁగా
నూహింపం దగనట్టివైఖరి నలుం డొప్పెన్ సభాగేహాళిన్. 159

వ. అప్పు డప్పుడమిఱేనిం గనుంగొని సఖీజనంబు నయ వినయ భయ సంభ్రమ త్రపానురాగంబు లినుమడింప సముత్థానంబునఁ బ్రత్యుత్థానంబు గావించి మనంబులం బూజించి. 160

మ. అవురా రూప మయారె కాంతి బళిరే హావంబు మేల్మేలు వై
భవ మయ్యారె విలాస మమ్మకచెలా భాగ్యం బితం డెవ్వఁడో
దివిషద్వర్యుఁడొ యక్షవల్లభుఁడొకో దేదీప్యమానప్రభన్
గవియన్ వచ్చెడు నంచు సిగ్గునను బల్కం జాల కున్నంతటన్. 161

మ. నలుమేనం గలగంధసారమున లీనంబైన సౌగంధ్యముం
గలయం జిమ్ముచు నైజపక్షమున వేడ్కం గూర్చుచుం దోఁప బం
తులవేళన్ శయనించుచోఁ బరునిమేన్ ద్రోఁపాడినట్లాటలో
నెలమిం గాంచిన మించుఁబోఁడి యపు డెంతేసిగ్గు దోఁపం జనెన్. 162

మ. తనపక్షోజకురంగనాభ మపు డాధాత్రీతలాధీశువీ
పున వ్రేఁగై యిరుపాయలై కనఁబడన్ బోలించి క్రొల్గంటి యీ
ననఁ బోల్కోమలదేహముం జదికెలోన న్నొంచితిన్ దాఁకి నే
నని యెంతే నను తాపముం దెలుపునాస్యం బొప్పఁ జెప్పంపగన్. 163

వ. అట్టి యవసరంబున. 164

ఉ. నవ్వుమొగంబునం జెలఁగునైషధునిం గని విస్మితాత్మయై
నవ్వుమొగంబు దోఁప నృపనందన పల్కె మనోహరాంగ! నీ
వెవ్వరివాఁడ విక్కడకు నేటికి వచ్చితి వుగ్రశాసనుం
డివ్వసుధేశ్వరుండు పుర మెట్టులు సొచ్చితి చెప్పు మంతయున్. 165

వ. అని యంతలోన. 166

ఉ. అంచ వచించినట్లు హృదయంబున నిల్పినవిగ్రహంబు క్రొ
మ్మించనఁ గన్నుదోయి మిఱుమిట్లొదవించెడువిగ్రహంబు న
ద్దెంచఁగ నొక్కచక్కి నయి యింపొనరింపఁగఁ గన్ను మూసి లోఁ
గాంచియుఁ గన్ను విచ్చి యెడఁ గాంచియుఁ బెంచెను విస్మయం బెడన్.

మ. కలహంసం బది కేతకీదళమునం గాల్గోటితో విగ్రహం
బెలమిన్ వ్రాసి వచించె నీతఁడు నలుం డీపాటిసౌందర్య మీ
యిలలోఁ గాదు మఱెట్టిలోకములయందే లేదు నిక్కంబు వో
జలజాక్షీ! యని చెప్పెఁ జెప్పినటు లీచార్వంగుఁ డొప్పుం గదా.

అని తనపయ్యెంటం బెట్టుకొనియున్న నలవిగ్రహాంచితకేతకీదళం బట్టి
తీసి చూచి. లక్ష్యలక్షణసమన్వయంబు గావించుకొని. 169

వ. అనిన నతం డిట్లనియె. 184

తే. ప్రత్యాఖ్యానము నొంది నేఁ జేసు సెప్పు
టుచితముగఁ దోఁపమింజేసి యూరకుంటి
నీవు నే ననునవి చాలు నెదుటి పనికి
నడిగితివి గాన వినుము నే నవనివిభుఁడ. 185

తే. దారి యాదృచ్ఛికంబుగా దైవతములు
కలసి నను దూతగా నీకడకుఁ బుచ్చి
రతివ! నీపుణ్య మే మందు నమరులంత
వారు నిను వరించిరి వలవంతఁ బడుచు. 186

ఉ. వారలలోన నీ వొకని వారిజలోచన! పెండ్లియాడినన్
ధారణి నెంత లెంతలును దావకపాదనఖాగ్రకోటికిన్
దీరిచి పోల్పఁ జాలరని తెల్పుచునుంటిని నీదుపేర్మియున్
జేసను మ్రోయు లోకములఁ బెన్నిధు లన్నియు నిన్నుఁ జెందెడిన్.

ఆ. నీవు వారిలోన నేవానినే వరిం
చితివ యేని నేను జేసినట్టి
సుకృత మనుచుఁ దలఁతు సుదతి! నాదౌత్యము
సఫల మయ్యె ననుచు సంతసింతు. 188

వ. అనిన నిట్టూర్పు నిగిడించుచు దీనవదనయై దమయంతి. 189

దమయంతి దేవసందేశము నిరాకరించుట.

చ. పురుషవరేణ్య! వేల్పులకు మ్రొక్కు లొనర్చి భజించి వేఁడెదన్
నిరతము నూర్వశీప్రముఖనిర్జరవారవధూమణీసమా
దరమున నొప్పువేల్పు లిటు ధాత్రి నొకానొకమర్త్యభామినిం
బరిణయ మాడఁ గోరుటలు బంగరువు న్విడి పెళ్లఁ గోరుటే. 190

చ. ఇది తగ దార్య! నేను నిషధేశ్వరుని న్నలు నొందఁ గోరి నా
హృదయము వాక్కు దేహమును నీభువియున్ దివి సాక్షులై కనన్
విదితము గాఁగ నల్లపృథివీపతి కప్పన చేసితిం దయా
స్పదుఁ డతఁ డొల్లకున్న విషవహ్నిజలాదుల కప్పగించెదన్. 191

ఆ. నలునిదాన నేను నాకేశ్వరాదుల
దాన నెట్టు లగుదు ధర్మశాస్త్ర
మెఱుఁగరోటు వార లెఱిఁగి యెఱింగి నా
వలను జూడ నెట్లు వలతు రకట! 192

చ. మఱియొక మాట-నీ వెదియొ మానసమం దిడికొంచు వేల్పులన్
మఱి మఱి చెప్పుచుంటి విది మామకహృత్పథ మెక్క దాసులల్
నెఱి గలయప్సరోంగనల నేస్తము గా దని గ్రుడ్డిగవ్వకేఁ
గొఱవడునన్ను మానవిని గోరిరి నా నిది యొప్పి యుండునే. 193

క. వా రెక్కడ నే నెక్కడ
వా రమరులు నేను మర్త్యవనిత న్నాకున్
వారికిఁ బొం దది దోమకు
వారణమున కట్టులుండు వల దానుడుగుల్. 194

వ. అనిన నలుండు వెండియు. 195

చ. పెడతలఁ బట్టి నీదుమతి వెఱ్ఱివి వేలుపులంతవారు ని
న్నడుగుచునుండఁ గా దనుచు నల్పతృణంబును బోని యన్నలున్
జడమతి భూభుజాధముని సారవిహీనుని బేదమానవున్
విడను వరింతు నంటి వవివేకిని వే మన వచ్చు ని న్నిఁకన్. 196

వ. అనిన దమయంతి కంట నీరు గ్రుక్కుకొనుచు నుడుకుమనంబున
నించు కాగ్రహంబు వహించి యి ట్లనియె. 197

## దమయంతి దేవతల నిరాకరించుట.

ఆ. వల దటన్న బూతు వలె వేలుపులగొప్ప
తనము పొగడఁ జొచ్చి తనుసరించి
వారిగొప్ప వారిసౌరు వారిప్రవర్త
నము నెఱుంగకుండు నరుఁ డెవండు. 198

సీ. కను ఱెప్పవేయక కనెడునిలువుగ్రుడ్లు
పీనుఁగుగ్రుడ్లు నా బీతు గొలుపు
నాథుల నడఁగించి హాయి కూర్చెడికూర్కు
సుగము వారలకన్నదుగకు లేదు

కలవునఁ దినఁ ద్రావఁగా లేక సతము వా
రవనిదేవులయిండ్ల నాశ్రయింత్రు
వరుసవావులు లేవు వారిప్రవర్తన
మచ్చరలఁ దలంప నరయ వచ్చు

ఆ. నొకఁడు దొంగకోడి యొకఁడు ధూమ్రపానమున్
డొకఁడు ప్రాణికోటి నుక్కడంచు
నొకఁడు నీళ్లుగారునొడలితో నుండు నీ
పాటివారిఁ జెప్ప నేటి కధిప. 199

చ. పుడమికి భూషణం బగుచుఁ బుట్టిననైషధభూతలేంద్రునిన్
జడమతియు న్నరాధముఁడు సారవిహీనుఁడు కూటివేద యం
చుడుగక యాడవచ్చితి వయో నిను నే మనఁ దోఁప దీవు నా
యెడ నరయంగ వచ్చినమహీతలనేత వటంచు నెంచెదన్. 200

ఆ. ఎట్టివాఁడు గాని. యే నలునిం గాక
దేవదేవుఁ డరుగుదెంచి న న్వ
రించె నేని వాని నించుకైనం గంటఁ
గాంచుదానఁ గాను గాను నిజము. 201

తే. అనిన నలుఁ డను భీమరాట్తనయఁ గాంచి
పక్షి చెప్పినమాటలు పట్టి నీవు
పూరికిం గానినైషధుఁ గోరి యుంటి
వాతఁ డొల్లఁడు వేల్పులభీతివలన. 202

ఆ. అనుడు మాట లేక హరిణాక్షి హృదయంబు
జల్లు మనఁగ శోకసాగరంబు
పొంగె ననఁగ నశ్రుపూరంబు కన్దోయి
వెల్లివిరియ నేడ్చె వెక్కి వెక్కి. 203

ఉ. కుండలఁ గ్రుమ్మఱించుగతిఁ గొల్కులఁ గాఱెడు బాష్పపూరముల్
గండములందు జాఱి చిబుకంబున నైక్యము నొంది దండిచ
న్గొండలఁ జిందువం దగుచు గొబ్బున నేలకుఁ జేరి కాల్వలై
కొండొకయింత పాఱెఁ గనుఁగోఁ బెరకేనియు జాలి పుట్టఁగన్. 204

ఆ. కలికి వేఁడి వేఁడి కాటుక కన్నీరు, కాల్వ లగుచు నిలకుఁ గాఱుచుండ
గంధకోష్ణ మైనగనిసుండి కాళింపి,పఱచుచున్న దనఁగ నరయ నయ్యె.

వ. ఇట్లు గాద్గదికనిరుద్ధకంఠనాళయై కన్యకామణి కన్నీళ్లు లేళ్లయి పాఱ నేడ్చుచుండుటయు. 206

ఉ. ఏడ్చెడుదానిఁ జూచి యొకయించుక సైరఁగ లేక కన్దుగఁ
విడ్చుచు నశ్రుపూరములు వెల్లువనై ప్రవహింప దుఃఖముం
గుడ్చుచు వెక్కి మ్రింగుచును గుత్తుక గాద్గదికంబు హత్తఁగా
నడ్చుచు నిట్టు నట్టును మనంబున నింతయుఁ దోఁచ నట్టిఁడై. 207

నలుఁడు దమయంతికిఁ దన్నెఱింగించుట.

ఆ. భైమిచెంత కేఁగి పరికించి నైషధుం
డెవిరిఁ ద న్నొకింత యెఱుఁగ లేక
వివశుఁ డగుచు నేనె వీరసేనసుతుండ
నలుఁడ వగపు మాని నన్నుఁ గనుము. 208

వ. అనినంత దమయంతి యట్టె కన్నుఁ దెఱచి తనమనోవల్లభు నల్లనం గని పోయినప్రాణంబులు మరలం గూటంబడినట్లు స్థిమితపడి లజ్జాభయసంభ్రమంబు లభినయించుచు లేచి దేవతలకు నమోవాకంబు చేసి తనమనోరథం బెల్ల వెల్లడించుచు నలునకు నమస్కారంబు గావించి యి ట్లనియె. 209

మ. నలసాదృశ్యము నీయెడం గలుగుట న్నాచిత్త మస్వ్యాండు వో
తిలకింపం దగ దంచుఁ జెప్పమి నీక న్నీదివ్యనామాక్షరం
బులు బంతిం గన నోట నద్దమున నీపూజ్యాకృతుల్ దోఁచుటన్
దెలియ న్వచ్చెను నీవు చెప్పనపుడే నీవే నలుండం చెదన్. 210

మ. కలహంసం బది ప్రస్తుతించుటమొదల్ గా నిన్నె చిత్తంబునం
దలఁతున్ నాదగువాక్కు కాయమును మేథాశక్తులున్ యుక్తులున్
గలసర్వస్వము నీపయిన్ నిలిపి నిన్ గాంక్షించి యుంటి నక్షీ
తలనాథాగ్రణి! బాస చేసెద యథార్థం బంచు నీయంతయున్. 211

శా. నీకై కాదె స్వయంవరం బనుమిషన్ నిర్మించి రాజేంద్రులన్
లోకంబందలివారి నెల్ల నిట కాలోచించి రాఁ బంచె రా
జోకందర్పసమానరూప! యిఁక నీవే నన్నుఁ గాదంటివే
నీకాయంబు త్యజింతు రజ్జు విష వహ్ని క్షీర మార్గంబులన్ 212

వ. అనిన నలుండు వెండియు. 213

ఉ. వీరలు లోకపాలు రగువేల్పులు నిన్ను భజించుచుండ నో
వారిజనేత్ర, పాత్రు లగువారిపదంబులధూళిఁ బోలఁగా
నేరనిమర్త్యు నన్ దడవ నీ కగునే? విబుధాళి కప్రియం
బారఁ బొనర్చువారలకు నావడి యూ భువనత్రయంబునన్. 214

ఆ. నన్నుఁ గావు మతివ! నామాట విని వరిం
పుము సురోత్తములను బొందు మిపుడు
వాఁడనట్టిపూల వలపును విరజోంశు
కములపొలుపు భూషణములబలుపు. 215

సీ. పుడమియంతయు నొక్కముద్దగాఁ జేసి ప్రే
ల్మిడి మ్రింగఁ జాలినమేటి వహ్ని
తనగదాదండంబునను భూతకోటుల
గడగడలాడించు ఘనుఁడు యముఁడు
దంభోళిఁ జేకొని దైత్యదానవులను
మర్దించి మించుజంభద్విషుండు
వల్లెత్రాటం గట్టి యెల్లప్రాణంబుల
నెగచి భంజించెడుమగఁడు వరుణుఁ
తే. డిట్టిజేజేల విక్రమం బెంచి నీవు
వారి వరియింపకుంటివేన్ వారిజాక్షి
మీఁదుమిక్కిలి వచ్చెడి మిత్రవాక్య
మాదరింపుము నింపు మా మోద మెడఁద. 216

వ. అని పలికిన దమయంతి బాష్పపూరితనయనయుగళయై నలచక్రవర్తిం
దిలకించి. 217

క. దేవళ్లకు జోహా రిడి, యోవల్లభ! నిను వరింతు నొండొక్కని నే
నేవరుసవాని నైనన్, భావించి వరింప. నిజము పలికితి నిచటన్. 218

వ. అని విన్నవించి. 219

ఆ. మగువ కేలుదోయి మొగిచి మేను చలింప
నిలిచియున్నఁ జూచి నలుఁడు దూత
నగుచు నేఁ బరార్థ మరుదెంచి స్వార్థము
సలుపుకొనుట ధర్మసరణి యగునె. 220

వ. అనిన నొక్కింత చింతించి దమయంతి బాష్పావిలనయనయుగళయై
వెండియు. 221

ఉ. కంటి నుపాయ మొక్కఁడు జగన్నుత! చెప్పెద విన్ము నీవునుం
బంటవలంతిసాములు సుపర్వవరేణ్యులు వచ్చి యుండ నా
యింట స్వయంవరంబునకు నెల్లరసన్నిధి నిన్ వరింతు నే
నంటదు దాన దోష మిసుమంతయు నీకు నెఱుంగఁ బోలెడిన్. 222

వ. అని నిరపాయం బగునుపాయంబు సెప్పిన నప్పురుషోత్తముఁ డమ్మత్త
కాశిని వీడుకొని పోనెంచి యెఱింగించి కన్నుల ననుజ్ఞం గాంచి
యించుక సంచరించి తిరస్కరిణి నవధరించె నంతలోన 223

నలుఁడు దమయంతి వీడ్కొని పోవుట.

చ. చనియెద నన్నమాట విని చాన గుభుల్లని గుండె తల్లడం
బునఁ బడ మాటలాడుటకుఁ బోలనిదై యటు మోము నిల్పి చె
ల్వునిపయిఁ గన్ను వైచి త్రుటిలోన నదృశ్యత తోఁచినంతఁ బె
ల్చున కనుఁదోయిఁ ద్రిప్పుకొనఁ జాలనిదై వలవంత వందురెన్. 224

ఉ. కంటికిఁ జాటు కంబ మటఁ గాంతునివల్వము గానవచ్చు నా
వెంటన పోవుచుండె నదె వెన్కకు వచ్చెడు నేమొ చెప్పిపో
నంటులసందునన్ నడచున ట్లగపడ్డటు లయ్యె నంచు వా
ల్గంటి మనోవికారమునఁ గాననిదై యట నుండెఁ గాంచుచున్. 225

వ. ఇంతలో నలుండు లోకపాలురపాలికిం బోయి పోడసూపిన వారు
నీ వెట్లు పోయి వచ్చితి వేమి వృత్తాంతం బని యడుగుటయు
నతండు వారి కభివందనంబు చేసి యింద్రుం గాంచి యి ట్లనియె. 226

మ. భవదాజ్ఞం గొని పోయి యంతిపురి న్భైమి న్విలోకించి నేఁ
దపురీతి న్నిముఁ దెల్పితిం బొగడుచుం దన్వంగి న న్నాక యు
త్సవమం దెవ్వరిని న్వరింప ననుచున్ సత్యంబు వాక్రుచ్చె నో
దివిషన్నాయకులార! వేరమి రవంతే లేదు నావాకులన్. 227

వ. అని చెప్పి వారియనుజ్ఞం గొని నలుండు యథేచ్ఛం జనియె నని
చెప్పుటయు నైమిశారణ్యవాసు లవ్వలివృత్తాంతంబు చెప్పు మని
సూతు నడుగుటయును. 228

ఆశ్వాసాంతము.

మ. వెలనాటి ద్విజశేఖరుండు సుగుణాన్వీతుండు పూతాన్వయో
జ్జ్వలకీర్తిప్రథితుండు మండలసభాసభ్యత్వసంపాదితా
గ్గలసత్కీర్తసమాశ్రయుండు సుకవివ్రాతస్తుతుం డాంగ్లభూ
తలభాషానిపుణుండు పెంపలరు సీతాప్రాణనాథుం డిలన్. 229

గద్యము. ఇది శ్రీమహామహోపాధ్యాయ, కలాప్రపూర్ణ, కవిరాజ,
కవిసార్వభౌమ శ్రీపాదకృష్ణమూర్తిశాస్త్రి ప్రణీతంబయిన నైషధీయ
చరితం బనుశృంగారతరంగిణియందుఁ దృతీయతరంగము.

శ్రీ. శ్రీ. శ్రీ.

శ్రీరస్తు.

# నైషధీయచరిత్రము

## శృంగారతరంగిణి





చతుర్థతరంగము.

శివకామోర్వీత్రిది
వేశాత్మభవుండు భవసమిద్ధసుభక్త్యా
వేశుఁడు శివరామమనీ
షీశుఁడు వర్ధిల్లుఁ గాక శ్రీశునికరుణన్. 1

వ. అక్కథకుండు శౌనకాదిమహామునుల కిట్లనియె నట్లు నలుండు లోకపాలురకుం జెప్పి పోయినయనంతరంబ విదర్భాపురీశ్వరుండు స్వయంవరోత్సవసందర్భంబునఁ బురం బలంకరింపఁ బుచ్చుటయు. 2

కుండినపురాలంకారవర్ణనము.

సీ. అంతరాంతరముల నారాజమార్గంబు
నలువుగా సమ్మార్జన మ్మొనర్చి
నలుకెలంకులయందుఁ జలువ లీనం జాలు
పన్నీటఁ గలయంపి పరఁగఁ జల్లి
వరచతుష్పథములు నరఁగులు కస్తూరి
సిస్తుగా గోముఖశ్రీలఁ దీర్చి
కనులపండువు గాఁగఁ గనఁబడఁ గట్టాణి
ముత్యాలప్రోవుల మ్రుగ్గు వెట్టి
తే. మేలురతనాలతోరణా లోలిఁ గట్టి
పట్టుపవలుగ రే యెల్ల నట్టె మాటి

నన్నిదిక్కుల యంత్రదీపాళిఁ బెట్టి
పురముఁ గైసేసి రెల్లెడ ముదము గదుర. 3

మ. ప్రతివీథిం బ్రతిచత్వరంబునఁ బ్రతిద్వారంబున న్నేర్పునం
బ్రతిపాదించినకీలుబొమ్మ లట్లుగన్ రా నెవ్వరే లేచి స
త్కృతి గావించెడునాఁగ నింత చని తో తే నై సుఖాసంబు వై
చి తగన్ వీవన వీచి యాఁకుమడుపుల్ చేసేత నందిచ్చెడున్. 4

మ. పురవీథిం జనునట్టిజానపదు లెప్డున్ గిట్టునం దిర్గుచున్
మరుదాప్తి న్వొదచల్లుచక్రములు, నంభస్సారము న్మీఁదికిన్
విరియం జేసెడుగొట్టముల్, దివియల న్వెల్గించుకాచంబులున్
బరిశీలించిరి నేత భూతముల నాఫక్కిం బ్రబంధించె నాన్. 5

ఉ. మాటల నాడుతీవలును, మానుగ సంజ్ఞలఁ జేయుతీవలున్
మాటికి మాటి కార్చుచును మార్గములం దిరుగాడు నుక్కబం
డ్లోటమి లేక సంతత మహో యనఁ గాలముఁ దెల్పుకంబముల్
వీట సమస్తదేశముల విజ్ఞులు నిల్పిరి రాజునాజ్ఞమై. 6

చ. గరుడులు వోల్వి మానము లఖండగతిం దివమందు జివ్వురన్
గుమరవ ముప్పతిల్ల నొకకొంతటిలోఁ బుర మెల్లఁ జుట్టి రా
జమఫుచు మీఁదిమీఁదికిని సాఁగ నొనర్చుచుఁ జేర్చి పేరెముల్
దిరుగఁగఁ జేయుచుం బురిఁ బరింబరిగా నడపింత్రు నేర్పరుల్. 7

తే. పల్లకీ లందలమ్ములు భద్రకరులు
తేరు లశ్వంబు లుష్ట్రముల్ వీరభటులు
దారులన్ సందడింపఁగఁ దేరి పురము
పట్టఁ బగ్గము లేకుండఁ బరఁగె నపుడు. 8

### రాజులెల్లరు స్వయంవరాంగణం బలంకరించుట.

తే. తనదుశుభలేఖ లంది భూజనులు రాజ
వరులు బంధువులు న్విప్రవరులు రాఁగ
వారలకు నొప్పువిడిదులు వలయుసత్కృ
తుల నొనర్చెను భీమభూతలవిభుండు. 9

సీ. ఆభీముఁ డొక్కపుణ్యదినంబునఁ స్వయం
వర మని చాటింప నరవరేణ్యు
లందఱు నానావిధాలంకృతుల్ గ్రాలఁ
గౌతూహలమ్మునఁ గదలి పోయి
కనకమణిస్తంభకలితరంగస్థలిఁ
గైసేసి రట ననుక్రమము దోఁప
నపు డందుఁ బెంపొందునాసనంబులు దివి
నక్షత్రపంక్తులు నాఁ దలిర్చె
తే. నైషధుండును బరివారభూషితుఁ డయి
వచ్చి రంగస్థలంబున భద్రపీఠి
నధివసించెను "జోహుదా" రట్టు నిట్టు
నిలిచి కుంచెలు వైచుచుం గొలుచుచుండ. 10

తే. లోకపాలురు నల్వు రాలోచనాంచి
తాత్ములై నైషధునిరూప మచ్చుగ్రుద్ది
నట్లు గైకొని చనుదెంచి యర్హరీతి
నలునిప్రక్కన కూర్చుండి రెలమి దొలఁక. 11

చ. చదురున నున్న వా రపుడు సౌ రలరం జనుదెంచి యొక్కచో
నుదితదివాకరప్రతిములో యన వెల్గుచుఁ గూరుచున్నయా
చదురులఁ జూచి యచ్చెరు వెసంగఁగ మానిసిఁ బోలుమానుసుల్
పొదలెద రంచు దైవకృతి పొంపిరివోవుట కెంచి రెంతయున్. 12

శా. ఆకారంబున హావభావముల నల్కం తైన భేదంబు లే
కేకత్వంబును బొంది యేవురును దే జెచ్చంగఁ గూర్చున్నచో
నాకాలంబున నెల్లభూభుజులు సౌహార్దంబు సంధిల్ల న
స్తోకప్రీతిని బూజచేసి రట దృక్సోమప్రసూనంబులన్. 13

చ. నలుగడ యంత్రదీపములు, నాల్గుకెలంకులఁ గీలుపీవనల్,
పొలుపగుకీలుబొమ్మలును, మూలలు దీరిచి మీఁదిమీఁదికిన్
నిలువుగఁ జల్వజాతిపని నేర్పునఁ గట్టిన మెట్లచాళ్లు, లో
పల నలుతట్టులం దగిలి పర్వఁగఁ బర్వె సభాస్థలం బటన్. 14

శా. నానాయంత్రసమావృతంబును సువర్ణప్రాంచితంబుఁ ఫిచి
త్రానూనప్రతిమాంగకస్థగితరత్నాపూర్వశోభాలస
త్థ్సానానందము సుందరాంగనృపమంచప్రావృతంబుఁ విశా
లానంతాశ్మవినిర్మితాంతరతలం బై యోలగం బొప్పెడున్. 15

వ. అప్పు డాస్వయంవరమహోత్సవదర్శనమనోరథంబునం జేసి నానా భూమిభాగంబులనుండి రాజన్యనందను లె కాక భూలోకంబునం గల బ్రహ్మక్షత్రియవైశ్యశూద్రసమూహంబులును, దేవలోకంబునుండి దేవతాకదంబంబులును, వివిధస్థలంబులనుండి దేవర్షిబ్రహ్మర్షిసందోహంబులును, వారాంగనాజనవ్యూహంబులును, పండితప్రకాండులును, కవులుం గాయకులును,లోనగువారు వేనవేలు వచ్చి సభాస్థలం బలంకరించి రయ్యెడ భీమభూపాలుండు నిజపుత్రికయుం దానును శిబికల నధిరోహించి చనుదెంచి సభాముఖంబునం దిగి యభ్యంతరంబున కరుగుదెంచి రంత దమయంతి సఖీజనపరివృతయై మదనదేవతామోహనమంత్రశక్తి యనం బొలిచి మెల్లమెల్ల నడుగు లిడుచు. 16

దమయంతి స్వయంవరరంగంబునకు వచ్చుట.

సీ. సంపఁగెఁ దల రాసి చక్క నౌ నెఱికలు
కర మరుదందఁ గీల్గంటు వైచి
పున్నమచందురుఁ బోల్కి నున్నట్టి నె
మ్మోమునఁ గస్తురిబొట్టు వెట్టి
కన్నారకురతనంపుఁ బొన్నుసొమ్ములు దాల్చి
రాణించుపై తాణిరవికఁ దొడిగి
బంగారునీరారుపసఁ గేరు జలతారు
చెఱఁగుల నొప్పారుచీరఁ గట్టి
తే. అందె లంతంత గల్లుగ ల్లనుచు మ్రోయఁ
జెలఁగి కుచ్చెళ్లు మీఁగాళ్లఁ జిందులాడఁ
గౌను నసియాడఁ జెలులచేయూని రచ్చ
కరుగుదెంచెను రాచూలి మెఱుఁగు వోలె. 17

వ. అయ్యవసరంబున. 18

ఉ. కన్నులకప్పు దీఱ నలకోమలిఁ జూతు మటంచు నెంచి యుం
డున్నజనుల్ ప్రయత్నమున నున్నతగాత్రు లుదాత్తకంపులై
క్రన్నన నెల్ల రొక్కపరిఁ గన్గవ విచ్చిరయంతఁ గాంతమై
గ్రొన్నెఱినౌ మెఱుంగువలెఁ గొల్పెఁ గడున్ మిఱుమిట్లు దృష్టులన్.

తే. అంత దమయంతి నిజదేహకాంతి నృపులఁ
జూపులం గొట్టి మనములు చూఱలాడ
మెట్టుచు న్వచ్చె నచ్చటి కట్టియెడల
మెఱపుఁదీవ తెఱంగున మెఱసి మెఱసి. 20

క. బంగారుబొమ్మవో లెన్, రంగారెడుదాని మేన రాజులదృష్టుల్
సంగతము నొంది కదలని, భంగిన్ దీపించె నపుడు బహుచిత్రముగన్.

వ. ఆసమయంబున విదర్భాపురీశ్వరుండు కొలువు గలయం బరికించి
యుదాత్తచరిత్రు లగువీరి నెల్ల నభివర్ణించి దమయంతికిం దెలియఁ
జెప్పి యొప్పింపఁ ద్రైలోక్యజనని యగుశారదాదేవి తక్కఁ దక్కి
నవా రెవ్వరుం జాల రని విచారించి యమ్మహాదేవి నంతరంగంబునం
దిడుకొని లేచి చేతులు జోడించుకొని కన్యాసహితుండై యి ట్లని
ప్రార్థించె. 22

### భీమరాజు సరస్వతిం బ్రార్థించి ప్రత్యక్షంబు చేసికొనుట.

దండకము. జయ జనని! జగత్త్రయారాధ్య పద్మాలయాధ్యక్షనాభీసరో
జోద్భవాస్యాంతరంగాతిశృంగారరంగానురంగత్త్రయీ శీర్షకాకోమ
లాంగీ సహావాసబద్ధప్రసిద్ధాతిసఖ్యే! జగద్బుద్ధశుద్ధానఘాఖ్యే! మహా
హీరహారామలాంగప్రభాజాల దూరీకృతాత్మీయభక్తాంతరంగాను
షంగన్మహాజ్ఞానగాఢాంధకారే! నిరస్తాధికాంతర్వికారే! పరే!
హరిహరపురుహూతముఖ్యామరవ్రాతకోటీర విన్యస్త రత్నప్రభా
సారనీరాజితాంఘ్రిద్వయీమంజుమంజీర శింజన్మణీపుంజ రంజద్రవా
క్రాంతవిద్వత్కవిశ్రేష్ఠజిహ్వాగ్రభాగే! సుభాగే! లసద్వల్లకీదండ
విభ్రాజమానాంగుళీ పల్లవాత్యంతసంభూత సంగీతరాగానులాపద్రవీ
భూత శీతాంశురేఖాశిరోభూషణార్ద్రీకృతామోదమోదావహై
ణాంగపంకాంకితాస్యే! మునీనా ముపాస్యే! మధుస్యందివాగ్వై

ఖరీబోధితం పాణిపద్మోపరి ప్రస్థితం పంచవర్ణాంచితం కీరరాజం సదా లాలయంతి! ద్విషం వాలయంతి! ద్విజాన్ పాలయంతి! స్థిరాన్ భూషయంతి! స్థిరే! చిదతిపిహితగహ్వరీపుష్కరాశావకాశే! సతాం సుప్రకాశే! మరాళేశ్వరాశోవ్వచ్ఛసంచారలోలశ్రవోభూష ణాబ్జోచ్ఛలద్భృంగనాదశ్రుతీష్టప్రహర్షేక్షణే! శిష్టసంరక్షణే బద్ధదీక్షే! త్రిలోకైకదక్షే! భవద్దాసదాసానుదాసం ప్రతీక్ష్యాద్య మాం రక్ష రక్షాబ్జహస్తే! సురానీకశస్తే! కళాసుప్రశస్తే! నమస్తే నమస్తే నమః. 23

వ. అని ప్రార్థించుచున్న సమయంబున. 24

సీ. సిరముపూఁ బూపచందురునివెన్నెలతో ని
గారంపుఁదెలిమేనికళలు నెఱయఁ
బాణి నాడెడుచిల్కపల్కులు మీఁటువ
ల్లకి కనుగుణతాళలయలు గాఁగ
నుపనిషత్తులు నిత్యముడిగంపుఁజెలియలై
యిరుచక్కి వీచోపు లిడుచునుండ
నొండొంటఁ బయ్యంట నొరయుసంగీతసా
హిత్యద్వయంబున నెసఁగ సరులు

తే. అంచవాహమం దూర్మి నధివసించి
పంచమశ్రుతి వీణ వాయించుకొనుచు
వివిధవిద్యావిధాత్రి సావిత్రి రాజ
చంద్రునిసమక్షమందు సాక్షాత్కరించె. 25

తే. అట్లు సాక్షాత్కరించినయజునిరాణి
నీక్షణము చేసి భక్తి భీమక్షితీశుఁ
డంఘ్రిపద్మములందు సాష్టాంగ మెఱఁగి
వినయవినమితగాత్రుఁడై వినుతి చేసె. 26

తే. నృపునిసంప్రార్థనంబున నపుడు కెలన
వెలసియున్నట్టివాగ్దేవి విశదముగను

గట్టిదుటఁ గాంచి కొలువెల్ల నట్టె లేచి
చేతు లెత్తి నమస్కృతుల్ చేసె నపుడు. 27

వ. విదర్భేశ్వరుండును వాగీశ్వరికి నాదిగర్భేశ్వరి యగునిజనందనచే నమస్కారంబు చేయించి తల్లీ! దీనిస్వయంవరోత్సవంబు ప్రవర్తిల్లం జేయువాఁడ నై రాజుల నెల్ల రాఁ బిలిచితి వీరిపౌరుషేయాది గుణంబు లభివర్ణించి చెప్పుటకు నొడ్ల నెవ్వరిం బొడఁగానక మదుపాస్యదైవతంబ వయిన ని న్నిట్లు ప్రార్థించి ప్రత్యక్షంబు గావించుకొంటి నీ వీబాలికమనోరథంబు దీర్ప ననుగ్రహింపు మని వేఁడుచు నాత్మజాత నప్పనంబు గావించుటయు నామె యాముగుద నాశీర్వదించి కరంబు గరంబునం గ్రహించి యించుక పదవిన్యాసంబు సేయం జొచ్చె నప్పుడు. 28

చ. జనకునిచెంత నున్నపుడు జాడ లెఱింగియు భైమి భావతోఁ
జనియెడునప్డు పోల్చుకొనఁ జాలక కొల్వున నున్నవారు వా
క్కున దమయంతియే యనుచుఁ గోరిక లీరిక లెత్తఁ బ్రేముడిం
గనుఁగొను చౌను గా దనుచు గాటపు సందియ మంది రందఱున్.

సీ. రూపలావణ్యాదిరూఢసంపద లెన్న నున్నవా రిర్వురు నొక్కరీతి
స్థూలసూక్ష్మాదివయోలక్షణము లెన్న నున్నవా రిర్వురు నొక్కరీతి
వేషభాషాదిసద్విజ్ఞానముల నెన్న నున్నవా రిర్వురు నొక్కరీతి
హాసవిలాసగతాదిగుణము లెన్న నున్నవా రిర్వురు నొక్కరీతి
తే. తాఱుమాఱయి యిటు నట్టు మాఱుచుందు
రిరువు రిం దేది దమయంతి యేది నలువ
యింతి యని యప్డు సంశయహృదయు లగుచుఁ
గొట్టుమిట్టాడుచుండి రక్కొలువువారు. 30

సరస్వతి దమయంతికి రాజుల నభివర్ణించి చెప్పుట.

వ. అట్లున్నయవసరంబునఁ జతురాననాంగన ప్రియాంగనాజనపరివృత యగురాచూలి వేలుపు లున్నదిక్కునకుం ద్రిప్పి యి ట్లనియె. 31

సీ. నిరతంబు మందాకినీవిమలాంబుపూ
రముల నాడుచునుండ్రు రమణి! వీరు

ఏనాఁడు ముదిమియు మృతియుఁ జేరఁగ నీని
యమృత మానినవార లతివ! వీరు
కోరినకోరికల్ దీరుచు మందార
వనమున విహరింత్రు వనిత! వీరు
పుడుకుఁదొడ్కొం దమపాలములో నెప్పుడు
గట్టుకొనినవారు కలికి! వీరు

తే. సుమనసులు వీరు విరజోంశుకములు దాల్చి
నిదుర యేనాఁటికిని లేక త్రిదశు లగుచు
దేవయానము లెక్కి యేదినము దివము
నందు విహరించుచుందు రోయతివ! వీరు. 32

ఉ. వీరలు వేల్పు లోవెలఁది! వీరికి నాఁకలి, డప్పి, నొప్పియుం
గూరుకు, చావునుఁ, ముదిమి కొండొకనాఁటికి లేవు స్వఃపురిం
గోరిక మీఱ నచ్చరలకుం బ్రియులై విహరించుచుందు రిందు నీ
కే రయిన న్మదిం దగిలి రేని వరింపుము నింపు మిర్మిలిన్. 33

క. ఇం దొకని నొందితే నా,నందంబున నందనంబునం గలవిలస
న్మందారపుష్పసౌరభ, మొందుచు సౌఖ్యంబు నందుచుందువు తరుణీ.

వ. అని కుటిలభ్రూకుటివిశేషాదుల నామెమనోభావం బెఱింగి భాషా
దేవి యోషామణితో ద్వీపాంతరవాసులపం క్తికిం జని యొక్కనిం
జూపి 35

ఉ. ఓపరమాణుమధ్య! కను మున్నతతేజముతోడఁ బుష్కర
ద్వీపము నేలురా జితఁడు వీనికి నోడుదు రెల్లరాజు లిం
ద్రోపముఁ డిమ్మహామహుని నొందితివేనియు నిష్టసిద్ధు లా
భూపదమందు నున్నవటభూరుహ మిచ్చెడు నీకు నిచ్చలున్. 36

వ. అని యామెమోముద్రిప్పుటల నొప్పమి నెఱింగి సరస్వతి మఱియొక
దిక్కున కక్కోమలిం గొనిపోయి. 37

మ. జలజాక్షీ! కనుఁగొంటివే యితని నీ శాకాంతరీపేశ్వరుం
డలఘూదారపరాక్రముం డితనిపాం దాశించితే దుగ్ధవా

లసత్క్రీడలు శేషశాయిభజనారీతుల్ పురోభాగగో
త్రలలత్కిన్నరకామినీప్రణయముల్ ప్రాపించు నెల్లప్పుడున్. 38

వ. అని వరవర్ణినీపరథ్యానాభినయంబున మఱియొకని చెంతకుం జని. 39

శా. క్రౌంచద్వీపవిభుం డితండు గిరిజాప్రాణేశ్వరుం గొల్చి భూ
ప్రంచత్ప్రాభవ మొంది సర్వదిశలం బ్రాపింప సత్కీర్తి మే
ల్గాంచు న్నీవిని జెట్టఁబట్టితివయేఁ గంజాతపత్త్రేక్షణా!
క్రౌంచాద్రిం గలరత్నసానువుల నెక్కాలంబు క్రీడింతహో. 40

వ. అని యనిచ్ఛాసూచకంబు లగునామొహావభావంబు లరసి యటువాసి మఱొక్కదిక్కునకుం దిరిగి. 41

చ. ఇతఁడు కుశాంతరీపవసుధేశ్వరుఁ డీశ్వరపాదభక్తుఁడై
వితతవిభూతులం బడసి విత్తపతిన్ విభవాదికంబునన్
సతముఁ దిరస్కరించెడిని జంచలనేత్ర! త్వదీయమానసం
బితనిపయిం దగుల్కొనిన నెంతయు సంతస మెల్లవారికిన్ 42

వ. అని యసమ్మతి నభినయించుటంజేసి మఱొండుకడ కరిగి. 43

మ. కలుమున్నీటను ద్రోణపర్వతము ప్రక్కన్ శాల్మలిద్వీప మిం
పలరున్ దాని కధీశ్వరుం డితఁడు లోకాధీశశస్త్రప్రభా
విలసత్కీర్తిసమావృతాఖిలజగద్విస్తారుఁ డీ వీతనిం
గలియంబోయిన నెల్లవైభవములుం గైకొందువో సుందరీ. 44

వ. అని దానియక్షివిక్షేపంబున నంతరార్థం బెఱింగి యింకొక్కదిక్కు మొగం బై. 45

శా. ఇక్షూదన్వదభిప్రవేష్టితము, దేవేంద్రాదిదేవేడ్య, మా
ప్లక్షద్వీపము సర్వలోకవినుతప్రాకామ్యరమ్యంబు నై
లక్షింపం దగుఁ దద్విభుం డతఁడు నీలక్ష్యం బిట న్నిల్చునే
సాక్షాల్లక్ష్మివి నా నెసంగెదవు చంచచ్చారుపద్మేక్షణా. 46

వ. అని మాఱుమోము వెట్టుటంజేసి దానిమానసం బెఱింగి సరస్వతి మఱియొకతట్టునకు మొగంబు వెట్టి వీ రెల్లజంబూద్వీపనివాసులు వీరిం జెప్పెద నాకర్ణింపుము. 47

సీ. అంగదేశాధీశుఁ డగు నిమ్మహీపతి
యితఁడు వంగేశ్వరుఁ డిందువదన
యితఁడు కాశ్మీరమహీమండలేశ్వరుం
డితఁడు కాశీపురాధీశ్వరుండు
కాంభోజవిభుఁ డీజగద్వంద్యచరితుండు
సౌరాష్ట్రపతి యీవిశాలయశుఁడు
మగధాధినాథుఁ డీమాన్యమహాగుణుం
డితఁడు నేపాళభూమీశ్వరుండు
తే. ఇందఱును శౌర్యనిధులు నహీనభాగ్య
విజితగుహ్యకేశ్వరు లెన్న వీరిలోన
నొక్కరుని బెండ్లియాడి లోకోత్తరప్ర
శస్తిఁ గైకొని సుఖముండు చంద్రవదన. 48

వ. అని తద్విముఖత్వదర్శనంబున నచటు వాసి మఱియు నం దుండుఁ గల మఱికొందఱ దేశాధీశులం బేర్కొని వారిలో నెవ్వరిని వరింప నొల్లనిపల్లవాధరిం దెల్లచాన యల్లనల్లన నిషధరాజపంచకం బున్న మంచంబులచెంతకుం జేకొనిపోయి యందుఁ బ్రథముం జూపి యి ట్లనియె. 49

పంచనలాభివర్ణనము.

[1]మ తరుణీ! చూడు మితండు శిక్షితకుభృద్వర్గుండు, లోకేశ్వరే
శ్వరుఁ, డుద్దామబలార్యభిఖ్యుఁడు, గురుత్వప్రాంచితుండుర్, బుధే

1 ఇది నలేంద్రులకు ద్వ్యర్థిగాఁ జెప్పఁబడినది; శిక్షితకుభృద్వర్గుండు=శిక్షింపఁబడినభూపతులసమూహము గలవాఁడు, శిక్షింపఁబడినపర్వతసమూహము గలవాఁడు; లోకేశ్వరేశ్వరుఁడు = రాజులకు రాజు; లోకపాలురకు నీశ్వరుఁడు; ఉద్దామబలార్యభిఖ్యుఁడు = ఉద్దామబలు లైనశత్రువులకు శత్రువను ఖ్యాతి గలవాఁడు; స్వతంత్రుఁడు, బలారి యనుపేరు గలవాఁడు; గురుత్వప్రాంచితుఁడు = గౌరవముచే నొప్పువాఁడు, గురు వగుబృహస్పతియుపదేశాదికముచేఁ బూజింపఁ బడువాఁడు; బుధేశ్వరవిఖ్యాతుఁడు = విద్వచ్ఛ్రేష్ఠులచేతఁ గొనియాడఁ బడువాఁడు, దేవాధిపతి యనుఖ్యాతి గలవాఁడు; జిష్ణుఁడు = జయశీలుఁడు, జిష్ణుఁ డనుపేరుగలవాఁడు; ఆప్తసుమనోవంద్యుండు = ఇష్టులును, మంచిమనస్సు గలవారికి వంద్యుఁడు, దేవతలకు వంద్యుఁడు; దేవేంద్రుఁడు =

శ్వరవిఖ్యాతుఁడు, జిష్ణుఁ, డాత్తసుమనోవంద్యాంఘ్రి, దేవేంద్రుఁ,
త్మరణానందితవీరసేనుఁ డెసఁగుం బద్మాక్షి! వీక్షింపుమా. 50

వ. ద్వితీయుం జూపి. 51

తే. [1]శుచి మహాధనంజయుఁడు విశుద్ధహేతి
జాతవేదుఁ డతిప్రతాపాతిశయుఁడు
భాస్వదభిరూపరూపుఁడు పరసమిత్ప్ర
దీప్తుఁ డీతం డ నలుఁడు చూతే మృగాక్షి. 52

వ. తృతీయుం జూపి. 53

తే. [2]దండధరుఁ డరిభయదగదాప్రహారణుఁ
డనిశసమవర్తి మిత్రనందనుఁడు పరక్ష

రాజుల కధిపతి, దేవతల కధిపతి; ఆత్మరణానందితవీరసేనుఁడు = అత్మ = ఆత్మ మను, రణ = పుత్త్రునిచేత (అనఁగాఁ గొడు కగుటచేత) ఆనందిత = సంతోషపెట్టఁబడిన, వీర సేనుఁడు = వీరసేనుఁ డనుతండ్రి గలవాఁడు, ఆత్మ = తనయొక్క రణ = యుద్ధముల చేత, ఆనందిత = సంతోషపెట్టఁబడిన, వీరసేనుఁడు = వీరము లైనసేనలు గలవాఁడు;

1 ఇందు నలాగ్నులకు ద్వ్యర్థి కలదు. శుచి = పరిశుద్ధుఁడు, శుచి యనునామము గలవాఁడు, మహాధనంజయుఁడు = గొప్పధనమును జయించినవాఁడు, గొప్ప దైనధనం జయనామము గలవాఁడు; విశుద్ధహేతి=శ్రేష్ఠములగు ఆయుధములు గలవాఁడు, గొప్ప మంటలు గలవాఁడు, జాతవేదుఁడు = పుట్టినవేదములు గలవాఁడు (అనఁగా వేదములు చదివినవాఁడు) జాతవేదుఁ డనుపేరు గలవాఁడు; అతిప్రతాపాతిశయుఁడు = విస్తార మైనశౌర్యాతిశయము గలవాఁడు, తపింపఁజేయు శక్త్యతిశయము గలవాఁడు; భాస్వదభిరూపరూపుఁడు, భాస్వత్ = సూర్యుఁడువలె, అభిరూప = ఒప్పిన, రూపుఁడు = రూపము గలవాఁడు, భాస్వత్ = సూర్యునివలన, అభిరూప = ఒప్పిదమైన, రూపుఁడు= రూపము నొందినవాఁడు; పరసమిత్ప్రదీప్తుఁడు = శత్రువులయుద్ధములయందుఁ బ్రకాశించువాఁడు, లేక శ్రేష్ఠమైనయుద్ధములచే నొప్పినవాఁడు, మంచిసమిధల (కట్టెలు)చే వెలుంగువాఁడు; ఈతండ నలుఁడు = ఇతఁడే నలుడు, ఈతండు అనలుఁడు. అని సమన్వ యము.

2 ఇందు నలయములకు ద్వ్యర్థి. దండధరుఁడు = రాజశిక్షం బూనినవాఁడు, (అనఁగాఁ దప్పుచేసినవారిని దండించువాఁడు) కాలదండము ధరించినవాఁడు; గదాప్రహార

తాంతుఁడుఁగా ధర్మముఖ్యుఁడు ధర్మరాజు
పడఁతి! కంటె దక్షిణనాయకుఁ డె యితండు. 54

వ. చతుర్థుం జూపి. 55

తే. [1]భూరిరత్నాకరవిభుండు భువననేత
యధికసత్త్వాఢ్యుఁడు నదీనుఁ డమృతనిధిపుఁ
డఖిలజీవనాధారమహాప్రచేత
సుఁడు నిషధయోగ్యుఁ డీతఁడు పడఁతి! వింటె. 56

వ. పంచమునింజూపి. 57

మ. [2]బుధులం బ్రోచెడువాఁడు, వాసవుఁడు, సంపూర్ణప్రతాపప్రభా
కధితుం, డధ్వరమార్గజిష్ణుఁ, డతులాఖ్యావాహినీసేవితుం

---

ణుఁడు = రోగముల నంతటను లేకుండఁ జేయువాఁడు, గదాయుధము గలవాఁడు; అనిశ సమవర్తి = ఎల్లప్పుడు సమముగాఁ బ్రవర్తించువాఁడు, సమవర్తి యను పేరు గలవాఁడు; మిత్రనందనుఁడు = మిత్రులకు సంతోష మిడువాఁడు, సూర్యపుత్త్రుఁడు; పరకృతాంతుఁడు = పరులకు శత్రువులకు యముఁడు, కృతాంతుఁ డను పేరుగలవాఁడు; ధర్మముఖ్యుఁడు=ధర్మము ప్రధానముగాఁగలవాఁడు, ఉభయత్రతుల్యము; ధర్మరాజు=ధర్మాత్ముఁడైనప్రభువు, ధర్మరా జను పేరు గలవాఁడు; దక్షిణనాయకుఁడు = బహుభార్యలుగలవాఁడు; దక్షిణదిక్పతి;

1 ఇందు నలవరుణులకు ద్వ్యర్థి కలదు. భూరిరత్నాకరవిభుండు = గొప్పరత్నపుగనులకు ప్రభువు, సముద్రములకుఁ బ్రభువు; భువననేత = జగత్పతి; జలాధిపతి; అధికసత్త్వాఢ్యుఁడు = గొప్పబలముచే సంపన్నుఁడు, గొప్పజలజంతువుల కధిపతి; (యాదఃపతి) అదీనుఁడు = దైన్యము లేనివాఁడు, సంధిచే నకారము రాఁగా నదీనుఁడు = నదులకుఁ బ్రభువు; అమృతనిధిపుఁడు = నాశనము లేనినిధులను బాలించువాఁడు, అమృతనిధి = సముద్రము, దానికిఁ బ్రభువు; అఖిలజీవనాధారప్రచేతసుఁడు = సమస్తమైనవారియొక్క బ్రతుకున కాధారమైనవిజ్ఞానము గలవాఁడు, (ఎల్లరకు జీవనాధారము కల్పించువాఁడు,) ఉదకముల కాధారమైనవాఁడు, ప్రచేతుఁ డను పేరు గలవాఁడు; నిషధయోగ్యుఁడు = నిషధదేశమునకు యోగ్యుఁ డైనప్రభువు; నిషధ = కఠినుఁడు, యోగ్యుఁడు (గొప్పయోగ్యత గలవాఁడు.)

2 ఇందు నలునకును, ఇంద్రాగ్నియమవరుణులకు సరిపడునట్లు చెప్పఁబడినది. బుధులం బ్రోచెడువాఁడు=విద్వాంసులను సాఁకువాఁడు నలుఁడు, దేవతలను సాఁకువాఁడు

డధికైశ్వర్యసమంచితుండు సమవర్త్యాఖ్యాంచితప్రఖ్యుఁ డై
ప్రథితుండై ప్రసరిల్లు నీఘనుఁడు సుత్రాముండు చూతే? సతి. 58

దమయంతి నలపంచకంబు గాంచి నివ్వెరపడుట.

వ. అని యిట్లు విధాతృకళత్రంబు ప్రబోధించిన విదర్భరాజపుత్త్రి పంచ
నలమహీకళత్రుల నీక్షించి యీక్షించి యిదమిత్థ మని నిశ్చయింపం

---

ఇంద్రుఁడు లోనగువారు; వాసవుఁడు: వసూని సంతీతి వాసవః స్వర్ణరత్నాదిధనముకల వాఁడు నలుఁడు;' దేవభేదే ౽నలే రశ్మౌ వసూ రత్నే ధనే వసు' అమరము. వస నివాసే, ఆచ్ఛాదనే, వసు=కిరణములు కలవాఁడు వసునామము గలవాఁ డగ్ని. రత్నములుగలవాఁడు వరుణుఁడు, వస్తీతి వసుః, ఆచ్ఛాదించువాఁడు యముఁడు, వాసవనామము గలవాఁ డింద్రుఁడు; ఇట్లు వాసవశబ్దము పైనేగురకు సమన్వయించును; సంపూర్ణప్రతాప ప్రభా కథితుండు, ప్రతాపము = కోశబలమువలనఁ గలిగిన తేజము, శక్తి కలవాఁడు నలుఁడు, వేఁడిమి, తేజము, శక్తి, లోనగునవి కలవా రింద్రాదులు; ప్రతప త్యనేన శత్రూనితి ప్రతాపః, 'తప సంతాపే' ప్రభవం త్యనేన శాసితుం జగతి ప్రభావః, జగత్తునేలుటకు సమర్థులు ఈయర్థము లేవురకుం జెప్పవచ్చును; అధ్వరమార్గజిష్ణుఁడు=యజ్ఞమార్గము చేత నింద్రుఁడు, అనఁగా ఇంద్రుఁడువోలె వైదికమార్గమును నడపువాఁడు, జిష్ణుఁడు= జయశీలుఁడు నలుఁడు; అధ్వరములు చేసినవాఁడు, జిష్ణునామము గలవాఁడు ఇంద్రుఁడు; 'అధ్వానం రాతీ త్యధ్వరః, మార్గములను గ్రహించినవారు, 'మృగయం త్యనే నేతి మార్గః, మృగ అన్వేషణే; దీనిచే బ్రహ్మపదార్థము నన్వేషించినవారు, జిష్ణులు = జయ శీలు రని యింద్రాదులకునుం జెప్పవచ్చును. అతులాఖ్యావాహినీసేవితుండు = పోలికలేని పేరు గలసేనలచే సేవింపఁబడువాఁడు నలుఁడు; వాహిని = నది, నదులచే సేవింపఁబడు వాఁడు వరుణుఁడు, వహతి, వాహయతీతి చ వాహిని, వహ ప్రాపణే=ప్రవహించునది. ప్రయత్నము సేయునది. వహధాతువుంబట్టి నానార్థము లింద్రాదులకుం జెప్పవచ్చును; అధికైశ్వర్యసమంచితుండు = గొప్పసంపదచే నొప్పువాఁడు నలుఁడు, అణిమాద్యష్ట భూతులచే నొప్పువారును, "ఈశ్వరస్య భావ ఐశ్వర్యం" లోకప్రభుత్వముచే నొప్పు వారును ఇంద్రాదులు, ఇది నలునకుం జెల్లును. సమవర్త్యాఖ్యాంచితప్రఖ్యుఁడు = సర్వ సమత్వము గలవాఁ డను పేరుతోఁ దుల్యుఁడు (అనఁగా సమవర్తితోఁ దుల్యుఁడు, అని నలార్థము) సమవర్తి యను పేరుగలవాఁడు యముఁడు; న్యాయముగాఁ బాలించువా రింద్రాదులు; సుత్రాముండు = సుష్ఠు త్రాయత ఇతి సుత్రామః, బాగుగాఁ బాలించువాఁడు నలుఁడు, ఇంద్రాదులును, సుత్రాముఁడు అని యింద్రునకు నన్వర్థనామముం గలదు.

జాలక డోలాందోళితం బగుహృదయంబున విస్మయంబును విచా
రంబు నొందుచు. 59

చ. ఇతఁ డితఁ డీతఁ డీతఁ డితఁ డేకవయస్కులు నేకరూపు లిం
దెతఁ డెవఁడో యెఱుంగుట కొకింతయుఁ జాలన నైతి నందఱున్
జతపడి పంచనైషధులచందమునం బొలు పొందుచున్నవా
రితవుఁడు నాదునైషధు నిఁ కెట్టు లెఱింగెడిదాన నక్కటా. 60

మ. పలుకుంబోటియు నేవురం బలికెఁ దాఁ బ్రజ్ఞాప్రభావంబునన్
బలుకుల్ సర్వము సంశయాత్మకములై భాసిల్లు నొక్కొక్కరిం
దెలియం జెప్పిన నెల్లవారికిఁ బ్రవర్తిల్లుం ద్రిలోకేశ్వరిం
బలుకం జెల్లది వేటిమాట లని నాభాగ్యం బిఁ కెట్లుండునో. 61

మ. ఎవరే నున్నది యున్నయట్లిచట వాకీఁ జాలరన్ బుద్ధి నీ
యవఁ బ్రార్థించె వచింప నాజనకుఁ డీయర్థంబునన్ దేవియే
యవమానించినఁ జెప్ప నేమి కల దాహా రక్షకై వేసికో
నవు నాకంచెయె చేను మేసె ననుసామ్యం బొప్ప నిప్పట్టునన్. 62

వ. అని యిట్లు కొంతవడి వగచి వితర్కించుచు. *63

క. ఎవనిం గనినను నలుఁ డని
ధవళాక్షి మనంబులోనఁ దలపోయుచుఁ గా
దవు నని తర్కించుచుఁ గడు
నెవు లందెను నేర్పరింప నేరని దగుచున్. 64

మ. జలభాండంబులఁ బ్రస్ఫురించెడి వియచ్చంద్రుండు నా నైషధుం
డలరుం బో యిటు లొక్కఁ డయ్యు నిటఁ బంచాదర్శకుడ్యాంతరం
బుల బింబించినదేహ మేసుగతులై; పోలింప రాకుండె వే
ల్పులు మాయం బచరించిరో తెలియ నాపుణ్యం బ దెట్లున్నదో?

ఉ. కా దన రాదు మాయ యిది కల్పన చేసిరి వేల్పు లక్కటా !
నాదుమనోహరుం డయిననైషధుఁ గన్గొను టెట్లు గల్గునో
పేదకు దీనికిన్, దొలుతఁ బెద్దలు చెప్పినదేహచిహ్న మిం
దేదియు లేదు భూమిపయి నిందఱు నిల్చి రిఁ కేమి సేయుదున్. 66

వ. అని మిగుల వగలం బొగులుచు దమయంతి నితాంతచింతాసమా
క్రాంతాంతరంగ యై తన కత్తఱి నమరోత్తములె శరణం బని ప్రాం
జలి యై నమస్కరించి యి ట్లనియె. 67

దమయంతి దేవతలంబ్రార్థించుట.

ఉ. అంచ వచించిపోయినది యాదిగ నెవ్వని నే హృదీశుఁ గా
నెంచుచునుంటినో మఱియు నెవ్వనిఁ గొల్వఁగ నీస్వయంవరం
బంచిత మయ్యెనో వ్రతము లన్నియు నెవ్వనికై యొనర్తునో
సంచితపుణ్యు నాతనిఁ బ్రసన్ను ల రై సురలార! చూపరే. 68

క. అని కరుణ వొడమఁ బరిదే
వన మొనరించెడుశశాంకవదనం గని నె
మ్మనమున ననురాగమ్మును
గొని వేల్పులు ప్రోచి రంతఁ గొంతటి లోనన్. 69

ఉ. ఏపురిలోన నల్వురు మహీతల మంటక తెప్ప వ్రాల్పఁగాఁ
బోవక చెమ్మటం బడక పొల్చి రొకండు మహీతలస్థుఁడై
పూవులు వాడఁ జెమ్మటలు పుట్ట నిమేషసమేతుఁ డయ్యె నా
లో వనజాక్షి నైషధులలో గుఱుతించె యథార్థనైషధున్. 70

వ. అట్లు నిజమనోవల్లభు నేర్పరించి చూచుచుం జూచినచూపు లా
భారతిపయిం బ్రసరింపం జేసి చేదోయి మొగిడించిన నింగితజ్ఞురా
లగునమ్మహాదేవి దేవతలదిక్కు మొగంబై. 71

చ. త్రికరణశుద్ధిగా నిషధదేశపతి న్వరియించి వానికై
సుక మఱి యెట్టివేడుకలు సూడక వీడక తద్వ్రతంబు ను
త్సుకమతి నుండె మీరిటులు చూచుట ధర్మువు గాదు లోకపా
లకులు! కృపాంతరంగకములం జెలి దీని ననుగ్రహింపుఁడీ. 72

తే. అనుడు వారు సరః ప్రార్థనమున
నలునిరూపము విడనాడి కొలువులోన
వాసవాగ్నిపరేతరాడ్వరుణరూప
ములను దాలిచి పొలిచి రద్భుతము దోఁప. 73

—దమయంతి నలుని వరించుట.—

వ. అనంతరంబ. 74

తే. వాణి దమయంతి కిట్లను వారిజాక్షి!
వీరె వేల్పులు వాఁడె నీకోరకొనెడు
నలుఁడు సంశయ మింతయుఁ గలుగకుండఁ
గని వరింపుము మది గోర్కి కొనలుసాఁగ. 75

ఆ. నలునిఁ దెలిసినంత నళినాయతాక్షి చే
లాంచలంబు పట్టి కొంచ కపుడు
ధర్మవిధివిధంబు దనరంగ వరియించి
యతనియుఱత వైచె నలరుదండ. 76

తే. అంతఁ దూర్యారవంబు దివ్యర్షిసాధు
వాదరవమును విప్రుల వేదరవము
నృపరహాహారవంబు బంధువులసమ్ము
దారవంబును గలసి మిన్నంది మ్రోసె. 77

ఉ. నైషధుఁ డంతరంగమున నాతుకచేతకుఁ బ్రీతి కెంతొ సం
తోషము నొంది గారవముతో నుపలాలన మాచరించి వా
గ్భూషణుఁడై యను న్నను బుభుప్రభు లెంచ వరించుదాన ని
ర్దోషమతి న్వరించితిని దోయరుహానన! నిన్నుఁ బత్నిగన్. 78

క. ఎందనుక నాదుగాత్రము
నందుం బ్రాణంబు లుండు నందనుక మహా
నందమునం బొందుచు ని
న్నెందుం బ్రేమించి యుందు నిందునిభాస్యా. 79

వ. అని శపథంబు వట్టె నట్టియెడఁ గృతాంజలిరై వైదర్భియు వీరసేనా
ర్భకుండు పలికినట్లు సందర్భశుద్ధిగం బలికె నట్లు పరస్పరప్రేమాను
బంధబంధురులై తమ్ము శరణంబు వేడుకొనుచున్న వధూవరులం దిల
కించి సంతసించుచు నింద్రాదిబృందారకులు వారియెడం బ్రసన్నులై
రప్పు డింద్రుం డారాజేంద్రునియజ్ఞంబులఁ బ్రత్యక్షదర్శనం బిచ్చి

హావిర్భాగంబు లందుకొనుచు నుత్తమగతిం బ్రసాదించుటకును, నగ్నిభట్టారకుండు వానివాంఛించినకడం బొడకట్టి నిజతేజం బొసంగు చుండుటకును, ధర్ముండు వాని కన్నరసం బనుగ్రహించి ధర్మంబు నంద నిలుపుటకును, నపాంపతి వానికోరినపట్ల జలంబులు నిష్టగంధాఢ్యంబు లగుమాల్యంబులు నిచ్చుటకు నొడంబడి వరప్రదానంబు చేసి దమయంతికిం బాతివ్రత్యంబు రక్షించుకొనుమహాశక్తిం బ్రసాదించి సరస్వతీసహితులై స్వర్గంబునకు నిర్గమించి రప్పు డతివాదు లగు కొందఱు పార్థివులు దమయంతి తమ్ము వరింపక నలుని వరించుటకు గర్హించి వారి నెదిరింపనెంచియు నోటమిభయంబునఁ దమపోటరితనం బోటువడి కొలువుకూటంబు విడిచి పోయి రంత నుత్తము లగు పార్థివసత్తములు వారిదాంపత్యంబున కత్యంతానందంబు నొంది యిచ్చమెయి మెచ్చుకొనుచు విదర్భేశ్వరునిచే ననుపం బడి యథాగతకృతగమను లై రాలోనం బుష్కరుం డనునొక్కరాజన్యుండు కొంతముక్కడిమూఁకం గూర్చుకొని భీమరాజున కభిముఖుండై గర్హించుచు ని ట్లనియె. 80

→ పుష్కరుఁడు నలు నెదిరించి యోడిపోవుట. ←

చ. నలుఁ డన నొక్కకన్నుపులు నాఁబడు నాతనిఁ బెద్దఁ జేసి భూ
తలపతు లెందఱో యిట ముదంపడి కన్నియఁ గోరుచుండ వా
రల నొకచీరికిం గొన కరాతిభయంకరుఁ డైననన్ను నా
బలఁగము నేని చూడ కిటువంటి నికార మొనర్చి తక్కటా. 81

ఆ. మంత్రపూత మైనమహితపురోడాశ
మగ్నిహోత్రమందు నాహుతులకుఁ
గాక కుక్క కైనకరణి నీకన్నియ
నలున కయ్యెఁ దెగడ వలదె నిన్ను. 82

మ. ఇతఁ డీతం డితఁ డంచు నుర్విపుల నీవే చెప్పుచు న్వీరిలో
నితఁ డత్యుత్తమమూర్తి పుష్కరుఁడు తల్లీ! వీనిఁ గామింపు మం
చతిదీప్తి న్వచియింప కెవ్వ తెనొ మాయామానవిం దెచ్చి యి
గ్గతి నూర్పేరును లేనివాని కిడుటల్ గాఖించి తే మందుఁ బో. 83

శా. కాని క్ష్మే నిపు డస్మదీయబలముం గాన్పించి నీనైషధుం
గానీ నిన్నును గాని లెక్కఁగొన కీకన్యామణిం గొంచుఁ బోఁ
గా సున్నాఁడ సమర్థు లెవ్వ రయినం గన్పట్టిరే రండు కా
దేనిం గన్నె నొసంగి పొం డని మహోద్రేకంబునం బల్కుచున్. 84

వ. నిజపరివారంబుతో దమయంతిమార్గంబున కడ్డువడుటయు నలుం
డనలుండు నా మండుచు వాని నెదిర్చి యి ట్లనియె. 85

శా. ఓరీ పుష్కర! నీవు జ్ఞాతి వని నే నూహించి సైరించితిన్
బారావారము దాఁటుచున్న యవి నీప్రజ్ఞావిశేషంబు లౌ
రౌరా! యెంతటివాఁడ వెంతబలవిన్యాసంబు నీ కుండెనో
రా రం డంటి సమర్థులం దడవి సంగ్రామంబు గావింతువో? 86

మహాస్ర. అనుచున్ సన్నద్ధుఁడై శౌర్యమున నిషధరా జట్టె కోదండ
మార్విన్, ఘనటంకారంబు గర్జాక్రమమున మొఱయం గాకులం
ద్రోలున ట్లా,జనులం బోఁ ద్రోలుచుం బుష్కరుపయిఁ బడ మేల్
సాయకం బొండు ప్రేయం, జని వానిం జంప కాశస్త్రము తలగొఱుగం
జాలి కూల్చెన్ ధరిత్రిన్. 87

అట్లు నేలం గూడి ముండియై పుష్కరుండు చచ్చియుం బ్రదికి లేచి ప్రాణభయంబున నొడలు దులుపుకొనుచు సిగ్గువిడిచి దిగ్గనం దల వంచుకొని చనియె నంత నలుండు కన్యాసమేతంబుగా భీమభూపా లుని నగరునకుం బుచ్చి తాను దనవిడిదలకుం జనియె ననంతరంబ.88

ప్రీతమనస్కుఁడై యపుడు భీమనృపాలుఁడు పుణ్యలగ్నమం
దాతతవైభవం బెసఁగ నాత్మజకు న్నిషధాధినేతకుం
గౌతుకకార్యమున్ సలుపఁ గా మది నెంచి ముహూర్తకాలముం
జేతము రంజిల న్వేలయఁ జేసె సుహృజ్జనసమ్మతమ్ముగన్. 89

హితులు పురోహితులును భట
తతులును మంత్రులును దాసదాసీజనులున్
గతుక మెసంగఁ బరిణయో
చితవస్తువు లెల్లఁ గూర్చిరి నృపునాజ్ఞన్, 90

నలదమయంతుల వివాహమహోత్సవము.

అనంతరం బా నిషధాధినాథునిం గై సేసి యొక్కభద్రదంతావళంబు నెక్కించి భీమభూపాలుండును హితపురోహితబంధుబృందంబును నానావిధసేనాసమూహంబునుం బరివేష్టించి నడువ నేగుపెండ్లిం గావించుచు రాజమార్గంబునం జనునప్పు డప్పురాంగనామణులు నిషధరాజదర్శనలాలసలై రాజసదనోపరిజాలకంబు లావరించి రట్టి సమయంబున. 91

చ. ఇనుఁ డగు నైషధీశ్వరు సమీక్ష యొనర్చుతలంపు పెంపునన్
దనరిసవీటిచేడియలు దారు సుధామయసౌధవీథులన్
ఘనతరజాలకంబులను గ్రమ్ముఖంబులు నేర్చి యున్నెడన్
గనఁ దగె స్వర్ధునిం గనకకంజము లెల్లెడ నుల్లసిల్లునాన్. 92

చ. అతివ యొకర్తు దిద్దుకొన నాయిత మయ్యెడునంతలో ధరా
పతి చనుదెంచె నంచు విని వైభవ మారయుతత్తఱంబు లో
నలికినఁ దాఱుమాఱుపడ నాభరణంబులు మేనఁ దాల్చి యు
న్నతనిజసౌధ మెక్కెఁ గని నాతులు చేతులు దట్టి బెట్టుగన్. 93

చ. వడిగ గవాక్ష కేఁగునొకవారిజలోచన కొప్పు వీడి మే
నడరఁగఁ గప్పినన్ ముడువ నైనఁ దలంపక పోవఁ బెన్నెఱుల్
జడదము మేనితళ్కు చపల ల్విడి రాలెడుపూలు చిన్కు లం
చడుగునఁ జూచువారలకు నాసమయంబునఁ దోఁచె నెంతయున్. 94

చ. చనియెడునైషధుం డనుచుఁ జాన యొకర్తు పిఱుందుదోయియుం
జనుఁగవ కొప్పునున్ నగలు చాల భరం బగుటన్ జడత్వ మొం
దిననడ సౌధ మెక్కుటకు నేరనిచో మది యూఁత నేసి తో
డ్కొని చని చూపి తాను వడి డొల్లిపడెం బయినుండి రాజుపైన్.

ఉ. కొందఱు సుందరాంగు లొకకొన్ని సుమంబులతో స్వనామముల్
డెందమునందుఁ బొందుపడి డెప్పర మైనమనోరథంబు ము
న్నుందుగ వ్రాసి తేకులను బొమ్మలు చేసి నలావనీశుపై
నందుకొనంగఁ జల్లిరి సుమాయుధుఁ డల్లన ప్రేరకుండుగన్. 96

సీ. నా మెయి వాసన లీమెయి నుండెడు
నని తెల్పఁ గస్తూరి పనిచె నొకతె
నాడువా తెఱతేఁపి కీడాక పరివచ్చుఁ
బోలించి కొమ్మని పుచ్చె నొకతె
నాచెక్కుటద్దము లీచక్కి నున్నవి
కను మని తెలనాఁకు లనిచె నొకతె
నాపలుకులఁ బోలునీపులకండముల్
పరికింపు మని చెప్పి పంపె నొకతె

తే. అట్టు లారాజమార్గము నందు నేగు
పెండ్లి గావించునలరాజు గొండ్లి యెసఁగఁ
గాంచి మోహించి కొందఱు కామిను లిటు
కొట్టుమిట్టాడి రెంతయుఁ గోర్కిమీఱ. 97

క. అందుఁ బురంధ్రీరత్నము
లందఱు మలెపూలు లాజ లక్షతలు మహా
నందమున దృష్టిదోషము
డిందఁగ నైషధునిపై వడిం జల్లి రటన్. 98

వ. ఇట్లు పురాంగనలెల్లం బరిపరివిధంబులం బడుచుండ నలుండు హజారంబుకడ గజారోహణంబు గావించి, మందగమనం బంగీకరించి, వందిసందోహసంకీర్తనంబును, మాగధమధురగానంబును, పాఠకగీతాపఠనంబును, జెలంగఁ బుంఖానుపుంఖశంఖభేరీమృదంగవేణువీణాదినిక్వాణంబులు రోదసీకుహరంబు నిండి రాణ లెసఁగ మంత్రిసామంతాదు లిరుగడలఁ బరాబరులుసేయఁ బురంధ్రీరత్నంబులు నీరాజనంబు లిడి నేసలు చల్ల నల్లనల్లన నడచుచు గృహప్రవేశంబు చేసి యెడనెడం గొన్నికక్ష్యాంతరంబులు దాఁటి తోరణస్తంభాయమానశాతకుంభరంభాకుంభినీరుహసంభృతంబును, నిఖిలమణిగణఖచితకనకకలశాది పరిణయోచితవస్తుపరికరప్రభాభాసమానంబును, పాణిపీడనక్రియారంభసంభారసంభ్రమత్పురోహిత హితముఖ నిఖిలజనకలకలరవాలంకృతంబును, నగునొక్కరమణీయభద్రోదవసితాభ్యంతరంబున మాణిక్యకలితమంటపంబున నధివసించె నంత విదర్భేశ్వరుం

డమందానందంబున నందనకు మంగళస్నానగౌరీపూజాదులు నిర్వర్తించి కౌతుకవేదిపయిం దెచ్చి కూరుచుండం బెట్టి భేరీమృదంగవేణువీణాదినిక్వాణంబులును, సకలజనకోలాహలరవంబులును, వారాంగనానృత్యవిశేషంబులును, నానావిధగాయనగానంబులును, జెలంగుచుండ నవగ్రహంబు లేకాదశస్థానఫలంబు లొసంగ నెసంగుశుభముహూర్తంబున ఝుళంఝుళత్కనకకంకణరవంబులు బోదకలుగ నంగనలు దలయంట మంగళస్నాతుండై సాలంకృతుండై మణిగణఖచితపీఠికాతలంబున నాసీనుం డగువరుని శ్రీమహావిష్ణుస్వరూపునిఁ గాఁ దలంచుచు యథావిభవవిస్తరంబుగా నర్చించి మధుపర్కం బొసంగి పితృదేవతాప్రీతికరంబుగా దారవోసి సాలంకృతకన్యాదానంబు సేసినంత నైషధుండు దమయంతీపాణిగ్రహణం బొనరించె నంత. 99

తే. వరుఁడు పాణిగ్రహణవిధి నెఱపునపుడు
మరుఁడు ము న్నేయ లో దూరి వఱలుచున్న
ములుకు లెల్లను వెలికి రాఁ దలలు సూపె
ననఁగఁ బులకాంకురంబులు తనరెఁ జెలికి. 100

క. తెరచీఱ లెత్త నైదువ
లిరువురు మోములను జూచి రింపుగఁ దలఁబ్రాల్
శిరముల నిడికొని రంతట
వరుఁ డామెకుఁ దాలె బొట్టు వలపునఁ గట్టెన్. 101

ఉ. చూపులు సేయువేళ నొకచోద్యము గానఁగ నయ్యె నప్డు క్రొం
జూపులదొంగ లొండొరులశోభలు చూఱగొనంగ నేఁగుచోఁ
బ్రాపయి వచ్చి నెమ్మదులు పట్టుపడెన్ ధరఁ బుణ్య మంచుఁ బోఁ
బాప మెదుర్కొనె న్నరు నవశ్యము నానుడి నిక్కమై కదా. 102

క. సతిపతు లప్పుడు తగ నా
హుతులన్ వ్రేల్చి రరుణార్చిహుతభుఙ్ముఖమం
దతులితపలాశశాఖా
తతులన్ దధిలాజలన్ ఘృతంబున నంతన్. 103

క. వరుఁడు నవోఢాపాదము
కరమునఁ గీలించి సన్నెకలు ద్రొక్కించెఁ
విరహార్తి నాకతంబున
నరయఁగ నొఁ దప్పు నైఁపు మని తెలుపఁగ నాన్. 104

క. జాయాపతులకు బంధువు
లాయాదేశాధినాథు లమలాంబరభూ
షాయోషాదికవస్తువు
లాయావేళ్లఁ జదివించి రటఁ గట్నములన్. 105

ఆ. మంగళంపుదివ్వె లంగన లిడునంత
మంగళార్థ మనుచు మగువ మగఁడు
నదె కనుం డటంచు నార్యులు సూపఁ జూ
చిరి యరుంధతిని రుచిరగతముల. 106

భీముఁడు దమయంతి నత్తవారియింటికి కనుచుట.

వ. ఇట్లు విధిదృష్టవిధానంబున వివాహంబు నిర్వర్తిల్లినయనంతరంబ తదుత్సవాగతు లగుబంధుమిత్రాదుల నెల్ల సత్కరించి భీమభూవల్లభుండు వారివారియిండ్ల కంపిపుచ్చి కృతకృత్యుం డై యత్తవారియింటికిం బోవనున్నతనూజాతం జేరఁ బిలిచి తనతొడపైఁ గూరుచుండఁ బెట్టుకొని శిరంబు పుడికి యాఘ్రాణించి మించినవేడ్కఁ నుపలాలించుచు. 107

సీ. పాదముల్ గడిగి నీపయ్యంటఁ దడి యొత్తి
విభుని వీవనలతో వీవవమ్మ
భోజనాంతమునందు భుజియింపు తత్పాత్ర
నిదురఁ బొందినవెన్కఁ నిదురఁ బొమ్ము
లేవకున్నప్పుడ లెమ్ము పిల్చినయేని
చేఁ బని విడిచి చెచ్చెఱ గమింపు
పని యున్న సుఖసుప్తుఁడును సుఖాసీనుఁడు
నై యున్నచో లేప కమ్మ యెపుడు
తే. జీవితేశ్వరు నెదలోన సేవగించి
సారెసారెకుఁ బోరెడుసారసాక్షి

నీక్షణము సేయ నొల్లకు మెల్లవేళ
భయము భక్తియుఁ గదురంగ వలయు మెలఁగ. 108

ఆ. సతులు పతినిఁ గాక శంకరు నేనియుఁ
దలఁపఁ జనదు జపము తపము తీర్థ
యాత్ర మంత్రసాధనాదిక మెల్లను
సతికిఁ బతియ సూవె జగమునందు. 109

ఉ. కావున నీవు నాథునకుఁ గాయమునీడవలె న్మెలంగుచుఁ
శ్రీ విభవంబు నాయువును జెందుము మిక్కిలిపూజనీయులఁ
వేవురఁ బుత్రులం గనుము నీయశ మెల్లజగంబులం గనం
బో వెలయింపు మిం పిడుము పుట్టినయింటికి మెట్టినింటికిన్. 110

వ. అని బోధించుచు బాష్పపూర్ణనయన యగునప్పూర్ణేందుముఖి నక్కు-
నం జేర్చుకొని బుజ్జగించుచుఁ బజ్జ నున్న జామాతదెక్కు మొగం బై.

చ. ఇది కడుముద్దరాలు నడి కింతయు నోర్వదు తల్లిదండ్రి చా
టుది గడిదేర దెల్లరఁ దటుక్కున నేరనిమాట లాడు నె
య్యదనున నెట్టులుండ నగు నయ్యది యేమి యెఱుంగ దక్కటా!
పదరెడుభర్త నే పగిదిఁ బాయక సేవ యొనర్చునో కదా! 112

శా. కంటిం బెంచితిఁ బెద్దఁ జేసితిని నీకైఁ బెట్టితిం తండ్రి నై
కంటే యిం కిట మాదికాదు సుమి యీకన్యావతంసంబు నీ
వెంట న్వచ్చెడు నీవె భర్త వయి నీవే తల్లివై తండ్రివై
కంటిఁ దెప్పనఁ దప్పు సైఁచి కరుణం గాపాడి రక్షింపవే. 113

వ. అని యెన్నో చెప్పి యప్పుడంతి నప్పతి కప్పనంబు గావించి మించిన
వేడ్క జాంబూనదాంబరాభరణాదులు కట్నంబు వెట్టి యంపి
పుచ్చుటయు. 114

నలుఁడు దమయంతీసహితుండై స్వపురంబున కరుగుట.

తరువోజ.—

నలుఁ డంతఁ గొన్ని దినంబు లచ్చోట
నలినాయతాక్షితో నలువొప్ప నుండి

తులలేనివేడుకతోఁ దొప్పఁదోఁగి
తురగలించెడుతనదుముదారు బలసి
కొలువ మాయయనుజ్ఞ గొని స్వపురమున
కుం జని శచితోడఁ గూడి దేవేంద్రుఁ
డలరునట్టులు దమయంతితోఁ గూడి
యతివైభవంబున నలరారె నపుడు. 115

వ. అట్లు దమయంతీస్వయంవరోత్సవము ప్రవర్తిల్లినపదంపడి ప్రయా
ణంబై విమానంబు లెక్కి మీఁదిమీఁదికిం బోవుచు. 116

మ. బలభిద్వహ్ని పరేతరాడ్వరుణు లాభైమీవిలాసంబు నా
నలసౌందర్యము చెప్పుకొంచును వియన్మార్గంబునం బోవుచోఁ
గలియున్ ద్వాపరుఁ డడ్డమై సురల వేడ్కం గాంచి యెం దుండి మీ
రలు విచ్చేయుచునుంటి రుర్వరకుఁ జేరం బోయి యీరాక యో.

తే. అనుటయుఁ ద్రిలోకవల్లభుం డనియె నిట్లు
మహిఁ బ్రతీక్షింపఁ జని మేము మాపురముల
కరుగుచుంటిమి మీ రతిత్వరితగతులు
గలిగికొని యుంటి రెందుఁ బోఁ దలఁతు రనుడు. 118

తరలము —

కలి సుపర్వులఁ గాంచి యిట్లను గాశ్యపిన్ దమయంతి యన్
గలికిమిన్న స్వయంవరం బగుఁ గాదె నన్ వరియించు న
ప్పొలఁతి యంచుఁ గుతూహలమ్మునఁ బోవుచుంటి ననన్ సుప
ర్వులు హసించుచు నింత మున్నది వోయె! నోయి! నివృత్తమై.119

వ. ఆవైదర్భి యొరుల నెవ్వరి వరింపక మాసన్నిధానంబునన నైషధుం
డనువాని న్వరించె ననఁ గోపఘూర్ణమానమానసుండై కలి యి
ట్లనియె. 120

తే. వేలుపులచెంతఁ గాదన కాలతాంగి
మానవుని భర్తగాఁ గొనెఁ గాన దాని
కొప్పుఁ జుఁడి శిక్ష విధియింప నిప్పు డనిన
లోకపాలకు లిట్లని రాకలిఁ గని. 121

క. తగ ది ట్లాడకు మాచెలి, తగినగతి న్యాయసుజ్ఞుఁ డాఁ గొని నలుని౯
దగిలి వరియించె నేచెలి,సుగుణోత్తరు వానిఁబొందఁ జూడకు చెపుమా.

మ. శ్రుతులు౯ శాస్త్రములుం బురాణములు సంశోధించి బోధాంచితో
న్నతధర్మంబు లెఱింగి సత్యమును జ్ఞానంబుం దపశ్శౌచముల్
ధృతియు౯ శాంతియు దాంతియు౯ దమముఁ గీర్తిస్ఫూర్తులుం గల్గి సు
వ్రతుఁడై వేల్పుల కీడువచ్చుఘనుఁ డారాయండు సామాన్యుఁడే.

క. అట్టిగుణోత్తరు నుత్తము, నెట్టిఁడునేఁ దిట్ట నెంచునేఁ దను దానే
దిట్టికొనునట్టిఁ డాతఁడు, కట్టిఁడియై నరకకూపగతుఁ డగు వింటే.

వ. అని పలికి దిక్పాలురు దివంబునకుం జని రంతఁ గలియు ద్వాపరంబుం
గని యి ట్లనియె. 125

ఆ. చంప నొల్ల నలుని సామ్రాజ్య మెడలించి
భైమితోడిపొందు పాయఁ జేసి
వనటఁ గూర్తు నీవు ఘనతరాక్షముల వ
సించి సాయ మెంచి చేయవలయు. 126

వ. అని సమయంబు చేసి కలి ద్వాపరంబుతో నిషధపురంబున కరిగి చొర
నవసరంబు గాన కంతరం బరయుచుం బండ్రెండుసంవత్సరంబులు
వేఁచియుండ నాలో నలుండు. 127

చ. రవివలెఁ దేజున న్వెలిఁగి, రాష్ట్రము లేలుచుఁ జక్రవర్తియై
మివిలి, యయాతివోలె హయమేధము దొట్టి మహాధ్వరమ్ములు౯
దవిలి యొనర్చి, భూతలమునం బ్రతి గానక యింద్రసేనుఁ డ౯
దవుసుతు నింద్రసేన యనుదాని సుతం గని యొప్పె నొప్పుగన్.128

## నలుని రాజ్యపరిపాలనము.

సీ. [illegible] నొవ్వక యుండఁ బూఁదేనెఁ గొనుమధు
పమురీతిఁ బ్రజనుండి పన్నుఁ గొనుచు
నాప్రజ౯ దనప్రజ నట్లు భావించి స
[illegible]ము వారికై వ్యయ మొనర్చుఁ
బాఠశాలలఁ బెట్టి బాటలు నిర్మించె
విప్రాగ్రహారముల్ వెలయఁ జేసెఁ

బురములఁ బల్లెల వరవైద్యశాలలు
నన్నసత్రంబులు నమర నిలిపెఁ
తే. జెఱువులం ద్రవ్వె నూతులు వఱలఁ జేసె
వర్ణసంకర మది లేనివరుస నడపె
నాల్గుజాతులవారి నానలుఁడు ధర్మ
మూర్తియై ముజ్జగంబులఁ గీర్తి పర్వ. 129
క. జారులుఁ జోరులును దురా
చారులుఁ గ్రూరులును నిత్యసత్యవిదూరుల్
లే రెపుడుం బంటలతో
ధారుణి పొలుపొందు నలుఁడు తత్పతి గాఁగన్. 130
వ. ఇట్లు ధర్మైకతత్పరుండై ప్రజలం బాలించుచున్నసమయంబునం దొక్కనాఁడు. 131

నలుఁడు కలిచే వంచితుం డగుట.

ఉ. కాల్మడి చేసి కాళ్లు గడుగ న్మఱపుం గొని వార్చి సంధ్యకై
కేల్మోగిచె న్నలుం డపుడు క్రేవల నున్నకలీశ్వరుండు పో
కా ల్మని రేఁగి నైషధునికాయమునం జొరఁ బాఱి బోరనన్
జాల్మఁడు పుష్కరాహ్వయునిచక్కటికిం జని వేడ్క నిట్లనున్. 132
ఆ. కలిని నేను రాజ! నలుని వంచింపఁ ద
లంచినాఁడ నీవు మించి వాని
తోడ జూద మాడి తులలేని తద్రాజ్య
మొడిసి కొనుము తోడుపడుదు నేను. 133
సీ. అని కలి ప్రేరేచి యపుడ వృషం బయి
యనుసరించెను వానియాలఁ జేరి
యతఁ డాతనిం గూడి యరిగి నలుం గని
పిలిచె దురోదర మెలమి సలుప
నలుఁడు జూదం బాడఁ బిలువంగఁ బడి పోవ
కుంట కా దని దాని కొప్పుకొనియెఁ
నికృతిఁ బుష్కరుఁ డొడ్డి నిలిచి పాచికలను
దొరలించె ఫలకమం దురురయమున

తే. గలిసమావిష్టుఁ డగుట నన్నలుఁడు మొనసి
తనకుఁ గలసర్వధనము లుత్తమము లొడ్డి
యోడె నాప్తులు వారింప నుడుగ కాడి
చలముఁ గొని యాఁడుచున్న పుష్కరునితోడ. 134

—౧ నలుఁడు పుష్కరునితోఁ జూదమాడి యోడిపోవుట. ౧—

వ. ఇట్లనేకమాసంబులు విడువక చలంబున జూదం బాడునలు నుడుపం జాలక ప్రకృతిప్రధానవర్గం బది యంతయు సూతముఖంబున దమయంతి కెఱింగించిన నామె దుఃఖించుచు వచ్చి దుర్వ్యసనాసక్తచిత్తుం డగుప్రాణేశ్వరునిం గాంచి నాథా! నిన్నుఁ జూచువారై పౌరులెల్లరు వచ్చి ద్వారదేశంబుకడ వేచియున్నవారు. నీ వీదురోదరం బుడిగి వారి నాదరింపు మని గద్గదస్వరంబునం బలికినఁ గలిసమావిష్టుం డగు నతండు ప్రత్యుత్తరం బిడ కాడుచుండె నది యొఱింగి చేయునది లేక శోకించుచుఁ బ్రకృతివర్గంబు నిర్గమించిన నామె యున్మత్తుని తెఱంగున నోడ లెఱుంగక యోడినకొలంది వేడుక వీడక మత్సరంబు పెచ్చుపెఱుఁగ మఱియు మఱియు నొడ్డి యాడుచున్న జీవితేశ్వరుం జూచి పాచికలు పరాఙ్ముఖంబు లగుటఁ బరికించి తమ కపజయకాలం బని తలంచి పరిదేవనంబు సేయుచు నంతిపురంబునకుం జని బృహచ్ఛయన యనుపరిచారికం బుచ్చి మంత్రులకుం జెప్పి వార్ష్ణేయుం డనుసారథిం బిలువఁ బంచి వాని కిట్లనియె. 135

ఉ. సూత! యెఱుంగుదే కద విశుద్ధచరిత్రుఁడు నైషధావనీ
నేత నిజప్రభావ మది నీ ఱయిపోవ నెటున్నవాఁడొ నా
కీతఱి సందియంబ యగు నే మనుదాన నె దెట్లు మాఱునో
ద్యూతము మానకుండె నయయో! సుహృదుల్ తగ దంచుఁ జెప్పినన్

వ. ఇది యంతయుం గాలమాహాత్మ్యంబ కానిమ్ము రాజదయితమ్ము లగు నశ్వరాజమ్ములం బూన్చినరథంబుపై మాదారకుల నిడుకొని కుండిననగరంబునం గలబంధుజనులకడ విడిచి నీవు నంద యుండు మట్లు కాదేని నీయిచ్చవచ్చినచోటికిం బోయి యుండు మనిన నతండును.

తే. మంత్రులకు దాని నెఱిఁగించి మఱియు వారి
యనుమతిం గొని దొరబిడ్డలను రథమ్ము
మీఁద నిడికొని చని భీమభూవయితున
కప్పనము చేసె నంతయు నడుగఁ జెప్పి. 138

తే. పిదప నాతఁడు దుఃఖంబు పెచ్చుపెఱుగ
నట వసింపక తిరుగుచు నందు నిందుఁ
జని యయోధ్యలో ఋతుపర్ణుసారథి యయి
బ్రతికి యుండినదానన భృతికి నిలిచె. 139

వ. ఇటఁ బుష్కరుండును. 140

ఉ. మోసము చేసి జూదమున మోదము హెచ్చ నలావనీశునిం
ద్రోసి సమస్తసంపదలతో మహిరాజ్యము నాహరించి పెం
హాస మెసంగ నిట్లనియె నయ్య! పణం బిడ నుండె నేని నీ
వీసమయంబునం దిడి వహింపుము హస్తమునందుఁ బాచికల్. 141

తే. గెలిచికొంటి కదయ్య! నీకలధనంబు
లెల్ల దమయంతి యొక్కతి యే విశిష్ట
యగుచుఁ గానంగఁ బడు దాని నలర నోడ్డ
యాడు మిష్టంబ యేని నా నవనివిభుఁడు. 142

వ. హృదయవిదారకంబు లగువానివచనంబులకు మనంబునం గనలియుఁ జేయునది లేమిం జేసి మారు పలుకక తనమేనిపైఁ గలసర్వవిభూషణంబులుం దీసి వైచి యేకవస్త్రధరుండై శోకించుచుం దొలంగి పోయె దమయంతియు నిరస్తభూషయు నేకవస్త్రయునై పతి ననుసరించె నన నైమిశారణ్యవాసు లవ్వలివృత్తాంతంబు సెప్పుమని సూతు నడుగుట యును. 143

ఆ శ్వా సాం త ము.

శా. నాకీ వీయుపకారముల్ సలుపు మన్నం జేత నైనంతలోఁ
బ్లోకా దం చనఁ బోక చేయుటకు నై పూనుల్ దయాస్వాంతుఁడై

శ్రీకాంతుం డలతూములూరికులవర్ధిష్ణుండు వానిఁ శుభ
శ్లోకుఁ శ్రీశివరామనాముని మహేశుం డేలు నెల్లప్పుడున్ 144

గద్యము. ఇది శ్రీమహామహోపాధ్యాయ, కలాప్రపూర్ణ కవిరాజ కవిసార్వభౌమ శ్రీపాదకృష్ణమూర్తిశాస్త్రి ప్రణీతంబయిన నైషధీయ చరితం బనుశృంగారతరంగిణియందుఁ జతుర్థతరంగము.

శ్రీ. శ్రీ. శ్రీ.

---

శ్రీ ర స్తు.

# నై ష ధీ య చ రి త ము

## శృం గా ర త రం గి ణి

### పం చ మ త రం గ ము.



వేంకటరమణాంబా
పావనతరగర్భశుక్తి వరమౌక్తిక మ
త్తై వెలసి సకలబుధజన
సేవితుఁ డగుతూములూరిశివు నేలు శివా. 1

వ. అక్కథకుండు శౌనకాదుల కిట్లనియె నట్లు దురోదరంబున నోటు
వడి తొలంగి పోయి. 2

నలుఁడు దమయంతితో వనుల కరుగుట.

తే. నలుఁడు దమయంతితోఁ బేదవలెఁ బురంబు
వెలిఁ ద్రిరాత్రము లుండె నవ్వేళఁ బుష్క
రుండు చాటించె నలుపాలి కొం డెవండు
చనిన శిక్షింతు నని యుగ్రశాసనంబు. 3

శా. దానంజేసి యెవండు నాతనికి సత్కారంబు గావింపఁ బోఁ
డానాళ్లట్లు పురోపకంఠమున నీళ్లాహారమై యొప్ప ధా
త్రీనాథుండు క్షుధార్తుఁడై నవసి యెందేఁ గందమూలాదు లే
నానో యంచుఁ జరించె నల్లడ నరణ్యంబందు దైన్యంబునన్. 4

చ. తిరుగుచు నైషధేశుఁ డొకదిక్కున బంగరువన్నె టెక్కలన్
బరఁగినపక్షిసంఘమును బాఱఁ గనుంగొని మెచ్చి నా కిటన్

దొరకెను భక్ష్య మందునను దొరపుటాఁకలి దీఱు నంచు స
త్వరముగఁ బట్టుకోఁ దలఁచి వైచెను గట్టినచీర దానిపై 5

మ. అవి యప్పట్టముతోడఁ బై కెగసి దుఃఖాక్రాంతుఁడై దీనుఁడై
భువి నున్నట్టిదిగంబరు న్నలుని సంబోధించుచు న్నేము నీ
దవుసర్వస్వముఁ గొన్న పాచికల మి ట్లాచ్ఛాదనంబుఁ హరిం
చువగ న్వచ్చితి మంచుఁ బల్కి చనుడుఁ క్షోణీతలాధీశుఁడున్. 6

వ. దీనవదనుండై దుఃఖించుచు దమయంతిదిక్కు మొగంబై. 7

చ. గరితరో! దయ్యపుంజెయిది గంటివె పాచిక లంట పక్షు లి
వ్వరుస నధోంశుకంబుఁ గొని పాఱె నయో యిఁక నేమి సేయుదుఁ
సిరి చెడి యున్న నే నెటులు జీవనయాత్ర యొనర్తు నార్తుఁడఁ
గురుతరదుఃఖపంకమునఁ గూలితి సోలితి నాలితో నిటన్. 8

వ. అని మఱియు. 9

తే. సుదతి! విను నాహితోక్తు లియ్యది విదర్భ
కిది యవంతికిఁ గోసల కిద్ది దక్షి
ణాపథంబున కిద్ది వింధ్యమున కిద్ది
తెరువు లివి యన్నియును వీనిఁ దెలిసికొనుము. 10

వ. అని మాటి కార్తుండై పలికిన నులికిపడి దమయంతి డగ్గుత్తిక వెట్టి
పతి కి ట్లనియె 11

చ. అకటకటా! మదీయహృదయం బిది చీల్చినయట్లు యయ్యొ నీ
వికృతవచఃప్రసంగముల వేఁగితిఁ గూటికి కాక యిట్లు గు
డ్డకుఁ జెడి కాననంబున బడల్పడుని న్నిటు వాసి పోవ మా
మకమన మిచ్చగించునె శ్రమం బని యెంచునె జీవితేశ్వరా. 12

తే. వనములం దుండి శ్రాంతుఁడై వనటఁ గుందు
పతినిఁ బాయక యుండినసతి తదీయ
విక్లమం బెల్లఁ బోకార్చి విరతిఁ గూర్పఁ
దలఁప సతికన్నఁ జుట్టంబు గలదె పతికి 13

సీ. ప్రాణనాథునకుఁ గైవల్యసంప్రాప్తికి
సదన మైనది ప్రాణసతియ సూవె
పగనికి నీ రేడుజగములందును నిద్ద
మగుయశం బిడునది మగువ సూవె
పతి కనంగదశా ప్రతతి దాఁకకుండ ని
రతసౌఖ్య మిడునది రమణి సూవె
యింటియాతనికి ననేకాపదలు వాపి
యలరించునట్టి దిల్లాలు సూవె

తే. పనుల దాసి కరణములఁ బరమమంత్రి
భోజ్యములఁ దల్లి రతి రంభ భూమి క్షమను
రూపునను లక్ష్మి యనఁగఁ బేర్కొనుచు నిల గృ
హస్థు నేలెడునది గేస్తురాలు సూవె. 14

చ. బ్రదికినయప్డు నీడవలెఁ బ్రాణవిభు న్విడ కుండునట్టి దై
సదమలచిత్తముం గలిగి సంతతసేవ యొనర్చు గేస్తురా
లెదియును వెంటరాదు తను వీఁగి గమించెడునప్డు డొక్క యి
య్యదియ చితాగ్ని మేన్విడిచినట్టిద యై పతిదారిఁ బట్టెడున్. 15

క. విను మఖిలదుఃఖరోగా
ర్తునకుం బరమౌషధంబు సుతమతి యగుచుఁ గా
జనుభార్య యని వచించిరి
మునితుల్యులు వైద్యు లెల్ల మును జననాథా. 16

వ. అని పలికిన నలుం డి ట్లనియె. 17

తే. తన్వి! నీమాట తథ్యంబు ధరణిలోన
నార్తుఁ డై యున్న వానికి నాలిఁ బోలు
మిత్ర మౌషధమును లేవు మేను విడిన
విడుతునే కాని విడుతునే వెలఁది! నిన్ను. 18

ఉ. నా దమయంతి యి ట్లనియె నాథ! నను న్విడనాడునిచ్చ లో
లే దను దేని మార్గముల లెక్క వచింపఁగ నేటి కిట్లు కా

దేదియొ కల్గెఁ గావునన యిట్లు గణించితి వంచు లోన నెం
తో దయివాఱుచున్న యది దుఃఖ మకారణజాయమానమై. 19

క. అది గాక నాదుబంధుల
సదనంబున కరుగు మనెడి సద్భావమయేఁ
సదమలమతి! యిరువుర మరు
గుద మట మాతండ్రి యరసికొను మనల దయన్. 20

తరువోజ.—

అనిన నలుం డను నతివ! నారాజ్య
మలవిదర్భనిరాజ్య మరయ నొక్కటియ
యనఁ దగుఁ గాని ము న్నచటికి నే మ
హావిభవంబుగ నరిగియు నిప్డు
ధనవిహీనుండ నై దైన్యంబుతో ము
దంపడి పోయి తద్బంధుజనాళిఁ
గనుఁగొన నోప నోకమలాయతాక్షి!
కరముఁ జింతిలకు మిక్కరణిఁ జిత్తమున.

ఘోరారణ్యవర్ణనము.

వ. అని నలుండు వైదర్భి నాశ్వాసించి పలుకుచు దానికట్టినపుట్టంబున సగంబు దానునుం గట్టుకొనియె నట్లు వా రేకవస్త్రసంవీతులును క్షుత్పిపాసాపరిశ్రాంతులు నై యిట్టు నట్టు మెట్టుచు మహారణ్యాంబునం బ్రవేశించి రదియును. 22

సీ. ఒండొంటితో నుండుదండికొండలు మెండు
కొని యాకసంబును గనుచునుండ
గట్లతోఁ బోట్లాడున ట్లుబ్బి చీఁకట్ల
నిడుచెట్లు పొలమెల్ల నిఱికి యుండఁ
జిక్కనై యొక్కొక్కఁ డక్కజంబుగ నిక్కి
బలురక్కసులు దిక్కు లలముకొనఁగ
నల్లిబిల్లిక నల్లి మొల్లమై ముళ్లతోఁ
బె ళ్లేచి పెనుడొంక లల్లుకొనఁగఁ

తే. బులులు సింగము లెల్గు లేస్గులును గాఱు
దున్నలుం బోట్టిదుష్టజంతువులు ప్రబలఁ
బాములుం దేళ్లు జెఱ్ఱులు ప్రాఁకులాడ
గహనమై చూడ నయ్యె నక్కాననంబు. 23

మ. పులి గానీ గిలి గాని యొక్కపరి పెంపుం గల్గి పెల్లార్చినం
బోలమెల్లం గలయంగఁ బర్వి గుహలం బూరించి హోర్వారవం
బలుపం బాటకుఁ గాక పీఁక మెయి బ్రహ్మాండంబు ప్రీలించున
ట్టులనై తెం పది లేక జాముపఱ కుండుం గొండల న్నిండుచున్.

మ. అటవీగర్భముఁ జూచునిచ్చమెయి సప్తాశ్వుండు దీప్తాంశువుల్
పటుశక్తిం జొరఁ జేయ నెంచియును జాలక్ లేక పీఁక న్జవో [జ్జొ
త్కటదేహాల్ మృగవాహుఁ బుచ్చుటయు నాతం డెంతయే నందుఁ
చ్చుటకుం జూచెను గాని సాధ్యపడ దాచో ప్పింతయు న్వింతగన్.

మ. శరణం బయ్యెడు జారచోరుల కజస్రం బంధకారంబు శాం
బరికిం దానక మట్టిదోషిని నశింపం జేయ నౌ నంచు భా
స్కరుఁ డన్న న్విని బీతునం బఱచి రక్షం గోరి తత్కాననాం
తరమం దెల్లెడ నిండి యుండె నన నాధ్వాంతం బటం జొప్పడున్.

వ. అట్టి మహారణ్యమధ్యంబునం బడి జాయాపతు లిరువురుం బోయి పోయి యొక్కచో నధ్వగులు విశ్రమింపం గట్టినయొకచట్టిం గని యందుఁ బరాగపటలపరీవృతాంగులై కడుంగడు విలపించుచు ధరణీతలంబునం బడి నిద్రవోయి రంతఁ గొంతవడికి దుఃఖోన్మథితచిత్తుం డగుటం జేసి రాజసత్తముండు కన్నుఁ దెఱచి గాఢనిద్రావశంబున నొడ లెఱుంగక పండియున్న ప్రాణేశ్వరిం దిలకించి రాజ్యాపహరణసుహృత్త్యాగవనవాసాదులం దలంచుకొని పలవించుచుం దన మనంబున. 27

చ. మలయజవాయు వైన నొకమాడ్కిన కాక కడంకఁ దాఁకె నే
నలసెడునీలతాంతమృదులాంగి యొకించుక యెండక న్నెటఁ
దెలియనియీనృపాలసుత నేఁ డిటు ఘోరవనాంతరంబుల
న్మెలఁగుచు నిట్టిఆకటికినేల శయింపఁగ నయ్యె నయ్యయో. 28

ఆ. కాలుకెండలోనఁ గాల్నడ వచ్చుట
నలసి సొలసి యీలతాంగి యిచట
నొడలు తెలియకుండఁ బడి నేల నిద్రించు
చుండె దీనిఁ గనిన నుల్ల మెరియు. 29

ఉ. అక్కట! నాకుఁ గూర్చుపరమామలగాత్రి నరేంద్రపుత్రి తా
నిక్కరణి న్వగం బొగులు నెంతయుఁ జింతల దీనిఁ గూడి నే
నిక్కడ నుండ నోప మఱి యెక్కడి కేనియుఁ బోవ నోప నే
చక్కి మెలంగువాఁడ నలిజాఁడఁ గనుంగొన దుఃఖ మయ్యెడిన్. 30

నలుఁడు దమయంతిం బెడఁబాసి పోవుట.

క. స్వజనత్యాగము మేలో, నిజమరణము మేలొ యెట్లు నేఁ జేసినచో
వృజినంబుగాక యుండునొ, నిజ మారయ లేకయుంటి నెమ్మనమందున్.

చ. నను విడనాడె నేని యెలనాఁగ నిజాప్తులఁ జేరు నెట్టులే
నను విడనాడకుండిన వనంబులఁ బెన్వగ లందు నిక్కువం
బని బహురీతుల న్మనమునందు విచారము చేసి చేసి దీ
నిని విడు టొప్పు నం చతఁడు నిశ్చయముం బొనరించెఁ బిమ్మటన్. 32

తే. కలిసమావిష్టుఁ డగునతం డలరుఁబోఁడి
విడిచి పోవఁగ సమకట్టి వెలఁదిమిన్న
కట్టుపుట్టమ తనకును గట్టుపుట్ట
మగుట నడిమికి ఖండింప నాత్మ నెంచి. 33

వ. దమయంతి మేలుకొనకుండ నే నెట్లీవస్త్రావకర్తనంబు నేయుదునో యని సభాభవనంబు నలుగడం గలయఁ బరికించి యొక్కచో నొక్క యొఱలేనిఖడ్గంబు పడియుండం గని దాని నందుకొని తద్ధారాగ్రంబున వస్త్రార్ధం బుత్తరించి నివృత్తహృదయుండై వెడలి కొండొకదవ్వు చని మరలి వచ్చి నిద్రించునామెం జూచి శోకించుచు. 34

తే. ఎండకన్నును వానక న్నెఱుఁగకుండ
నంతిపురముల నుండునీయన్నుమిన్న
యిట్లనాథవలెఁ జీరు లెడల నేల
నొడ లెఱుంగక నిద్రించుచుండె నకట! 35

చ. మలయజవాతపోత మొకమాడ్కి శరీరము సోఁక వచ్చినన్
జెలి యిది కందిపోవు నని చేడెలు వేడుక వీడి నెమ్మనం
బుల భయ మందుచుండెడు పోఁడిమిమై మెలమెల్ల నాడుచో
నలసెడునీనెలంత కిటు లయ్యెనె దయ్యముచెయ్ది నక్కటా. 36

తే. హంసతూలికాతల్పమునందుఁ బండు
కొనియు మే నొత్తె నని వెతం గొనెడుపువ్వుఁ
బోఁడి నేఁ డిట్లు నేలపై బూదిలోనఁ
గండ్లు లొత్తఁగ నిద్రింపఁ గలిగె నకట. 37

వ. నే నీనారీశిరోమణిం బెడఁబాసి పోయినంతలో మేలుకాంచి. 38

చ. చినిఁగినచీర మేల్కొనినచేడియకంటఁ బడంగ బెంగమైఁ
దనమది నెంతచింతిలునొ తామరసేక్షణ నన్నుఁ గాన కి
వ్వనమున నెట్టు లుండునొకొ వాచవి కాదొ మృగాళి కియ్యెడం
గనుఁగొనువారు నశ్రువులు కాలువ గట్టఁగ సాగె నయ్యయో. 39

వ. అని మఱియు నిట్లు ఘోరారణ్యంబునం బడి యున్న దీని నాదిత్యులు, నశ్వులు, విశ్వేదేవులు, మరుద్గణంబులు నేప్రొద్దు రక్షించుచుందురు గాక యని దీవించి దేవురించుచుఁ గలిసమాహృతజ్ఞానుండై నైషధుండు. 40

చ. విడి వడిఁ గొంతదవ్వు చని వెండియు వచ్చి సభాస్థలంబునన్
మడఁతినిఁ జూచి దుఃఖమున మానఁజేయుండి యొకింతసేపు పై
వెడలియు వెండి వచ్చియును వీఁగుమనం బది రెండుపాయలై
నడవ నరేంద్రుఁ డుయ్యెల యనం దలపోయఁగ నయ్యె నయ్యెడన్.

దమయంతి పతిం గానక దుఃఖించుట.

వ. ఎట్టకేలకుం గల్యవకృష్టుం డగుటం జేసి తెంపు చేసికొని నలుండు దైన్యంబు దోఁపం జేయుచున్న దమయంతి నాశూన్యవనంబునం దిగ విడిచి చనియె. నంతఁ గొంతవడి కక్కాంత మేలుకొని కన్ను విచ్చి నలు గడం గలయఁ బరికించి నలుం గానక శోకవ్యాకులితచిత్తయై తత్తఱం పడి మిగులవగలం బొగులుచు నిజవస్త్రావకర్తనం బట్టె కంటం బడ హా యని యుచ్చస్స్వరంబున. 42

సీ. హానాథ! హానాథ! హాజీవితేశ్వర!
నను బాసి పోవుట న్యాయ మఁటవె?
నాబహిఃప్రాణమా! నను విడనాడి పో
నెట్లు కా ల్లాడెనో యెఱుఁగఁ జెపుమ?
నినుఁ బాసి యే నొక్క నిమిషమాత్రం బైన
నెమ్మేనఁ బ్రాణముల్ నిలుపఁ జాల
విడువ నోడకు మని నుడివి సత్యం బది
పోకార్తువే యిట్లు పూజ్యచరిత!
ఆ. నిదురపోవు నన్ను నెఱి వీడి ఘోరాట
విని మృగాళిఁ బడఁగ విడిచి పోతి
వకట! నష్ట నైతి నతిభీతి కైతిఁ జ
చ్చితి నయొ! యిఁక నేమి సేయుదాన. 43

క. బలవన్మరణము తగ దని
పలికిరి మునివరులు దానఁ బ్రాణములు విడన్
దలఁచియుఁ దలఁకితి లేకు
న్న లలి న్విడకుండుదాననా? కాయంబున్. 44

మ. పరిహాసంబునఁ జేసి మాటికిని న న్బాటించి వీక్షించుచున్
సరసన్ గుల్మములందు డాఁగి పగల న్వర్తింతువో కాని నా
కరయన్ రామి భయంబు దుఃఖమును హెచ్చయ్యెన్ భరింపంగ లే
నరవిందేక్షణ! దర్శనం బొసఁగి న న్లాలించి పాలింపవే. 45

మ. ఒకనాఁ డీవును నేను గూడి పురబాహ్యోద్యానమాకందవృ
క్షకదంబంబులనీడలందుఁ గడువేడ్కన్ మెట్టి క్రీడించుచో
నొకయీరంబున డాఁగి కూ యనుచు న న్నోడించి త ట్లిప్పు మా
మకచిత్తంబు గలంగ డాఁగితివొ రమ్మా తాళలే నిం కిటన్. 46

తే. లోకపాలురకడ నీవు నాకుఁ గూర్చి
వాకొనినవాకు లెల్ల లోకైకనాథ!
సత్యములు గాఁగఁ జేయ నీస్వాంతమందు
దలఁపు మీకు డెంతయేనియు దయ గలిర్ప. 47

తే. ఇట్లు పడునన్ను నోదార్ప వేమి వచ్చి
నాకు శోకింప నింతయు నీకయి కడు
నొగిలి శోకింతు నాఁకటఁ దగిలి నన్నుఁ
గూడ కెటు పలవింతు వొక్కొ యటంచు. 48

వ. అని శోకార్తయై విలపించుచు లేచి నిలువ నోప కిలం బడి లేచి యిట్టట్టు మెట్టుచు నిట్టూర్పు వుచ్చుచు నార్చుచు నేడ్చుచు నల యుచు సొలయుచు దిక్కులు చూచుచు నదరుచు బెదరుచు సంచ లించుచుఁ దమ కట్టియిక్కట్టు తెచ్చిపెట్టినకట్టిఁడులం దిట్టుచు బిట్టు ప్రలపించుచు శార్దూలాదిదుష్టసత్త్వసేవితం బగు నమ్మహారణ్యంబున నందు నిందుఁ బతి నన్వేషించుచు నున్మత్తవలె సంచరించుచుండె నాసమయంబున. 49

దమయంతిం గొండచిలువ పట్టుకొనుట.

తే. ఒడ లెఱుంగక తొట్రుపా టడర వచ్చి
తనదుచెంగట మెట్టెడుతన్వి నరసి
సరభసంబునఁ బట్టె దుర్భరము మెండు
కొన మహాకాయ మగునొక్కకొండచిలువ. 50

చ. పెదపెదనల్లమచ్చ లతిభీష్మములై యొడలెల్ల మొల్లమై
బెద రిడుచుండఁ గొండవలె విగ్రహ మాగ్రహ మే యనంగ నై
పొదల మహాగుహం దెగడుపోలిక నాలిక లార్చునోటితో
నదటున వచ్చి పట్టుకొనె నట్టిటు మెట్టెడునత్తలోదరిన్. 51

చ. పదములు పామునోటఁ బడఁ బట్టు విడం బొనరింపఁ జేతులన్
విదులుచుచుం దదాస్యమున వ్రేయుచు రాయుచు సంచలించుచో
నది తనతోఁకతో నదిమి హస్తయుగంబును మేనుఁ జుట్టినం
గదలఁగ లేక కూలఁ బడి కాంత నితాంతము సంతపించుచున్. 52

వ. అట్లు తన్నుఁ బట్టినం బట్టు తప్పించుకొనం జాలక జాలింబడి కరం బాక్రోశించుచు నుచ్చస్వరంబున. 53

ఉ. దిక్కు సుమంత లేక యిట దేవరుగొట్టన మెట్టుచున్న న
న్నిక్కడ మొక్కలీఁ డగుచు నీపెనుఁబాము గ్రసించె నక్కటా!

యెక్కడి కేఁగినాఁడవో హృదీశ్వర! న న్నిడి నేగి యయ్యో నీ
వక్కటికంబునం గదియ నై హృదయేశ్వరి నన్నుఁ గావవే. 54

తరువోజ.—

అని వగచుచునున్న యవసరమందు
నటకు మృగవ్యాధుఁ డరుదెంచి యొకఁడు
ఘనభుజంగముముఖగహ్వరమందుఁ
గ్రాలెడుదమయంతిఁ గని వేగిరించి
తనచేసురియ నోటిదరినుండి వ్రయ్యఁ
దఱిగి దాసరిపాముఁ దడయక చంపి
వనజాక్షి వెడలించి వనముల సర్వ
వదనస్థితం బైనవర్షంబు గడిగి. 55

వ. వన్యంబు లాహారంబుగా నిడి దమయంతి నూఱడించి యి ట్లనియె.

ఉ. ఎవ్వతె వీవు ఘోర మగునివ్వన మెవ్వగఁ జేరఁ గల్గె తీ
నివ్వెఱ కేమికారణము నీరజలోచన! చెప్పు మన్న నా
యవ్వ నిజప్రవృత్త మది యంతయుఁ దా మృదులస్వరంబుతో
నవ్వనచారికిం దెలియ నానతి యిచ్చె యథాక్రమంబుగన్. 57

తే. అయ్య! ననుఁ గొండచిల్వ కాహార మగుచుఁ
బోవ నగుదాని నీరీతిఁ గావ నైతి
నీవు, నీఋణ మెట్టులు. నేను దీర్చు
కొందు నోతండ్రి! నీ కిదే వందనంబు. 58

తే. అట్లు పల్కిన విని మృగవ్యాధుఁ డర్ధ
వస్త్రసంవీతఁ బీనసువర్తుల స్త
నాఢ్య సుశ్రోణిఁ జంద్రనిభాస్య సుంద
రాంగిఁ గని కామశరవిద్ధుఁ డై తపించి. 59

ఉ. చక్కనిచుక్క యిక్కలికి జాబిలి యీబిడమోము చందొవల్
జక్కవలన్ హసించెడిని జానుఁగు లెన్నఁగఁ జక్కిలంబు లీ
ముక్కును జెక్కివేసినటు ముచ్చటఁ గూర్చెడుఁ జిల్కపల్కు ల
మ్మక్క! యొయారి దీని బిగియారఁ గవుంగిటఁ జేరఁ దీసెదన్. 60

ఉ. బంగరుబొమ్మ కొమ్మ యిది బాపురె! యీపువుఁబోఁడితోడ నే
సంగతినేని కూటమి ఘటింపఁగఁ జేసికొనంగఁ గల్గినే
నంగజతాప మార్చుకొనునట్టిద కాదు మదీయజన్మముం
గంగసముం దరించెడిని వాకొన నేటికి నేనె పో దొరన్. 61

క. ఇది నా కాలై నాఁగుడి
సెదెసం గా ల్వెట్టె నేని చెప్పఁగఁ బని యుం
డదు నేన కుబేరుఁడ న
య్యెద వెన్నుఁడు నా కడంగియే యుండు నిఁకన్. 62

వ. అని పలుదెఱంగులం బడి పలవించుచు మోహపరవశంబున నొడ లెఱుంగక క్రిందు మీఁదు లరయఁ జాలనిచిత్తంబున నత్తమిల్లుచు మెత్తనివచనంబుల నత్తన్వి ననునయించి తనమనోరథం బెఱింగించి చెనకం జూచుటయు నంతలో నగ్నిశిఖయుం బోలె నంట శక్యంబు గాక వెలుంగునమ్మహాపతివ్రత. 63

మృగవ్యాధుఁడు దమయంతి ముట్టఁ బోయి మృతుం డగుట.

చ. తగ దిటు లోరి! దారి నను దాసరిపాము మొగంబులోఁ బడం
దెగియెడుదానిఁ గాచితివి దేవుఁడ వైనను దండ్రి వైన నీ
వగుదువు నేఁ ద్రిలోకవిభునంతటివానికి ధర్మపత్ని నై
తగియుఁ బతివ్రతాత్వమును దాలిచి యుంటిని నీ వెఱుంగవో? 64

ఆ. అగ్నిశిఖయుఁ బోలె నంట శక్యము గాదు
నన్నుఁ బోటిగరితఁ గన్నుఁ గాన
కిట్టిపనికిఁ బూన నట్టె చా వగు దెంచు
నొడలిమీఁదియాస విడకు మన్న! 65

వ. అని బతిమాలుచుం బలుకుచున్నను గన్నుఁ గాన కమ్మృగవధాజీవ నుండు సద్భావంబు లేనిమూర్ఖుండును మోహపరవశుండునుం గావున వెనుకముందు లెఱుంగక ముట్ట వచ్చుటయు నామె కన్నెఱ్ఱ చేసి నేను బతివ్రతన యేని పరమేశ్వరుండు నన్ననుగ్రహించుఁ గావుత మని పలికి వానిదెస నలుకం జేసి యొక్కింతలో నింత కన్నుఁ దెఱచె. 66

క. కనుఁ దెఱచునంతమాత్రం
బున దావానలవిదగ్ధభూరుహమువలెన్
దనువునఁ బొగ లెగయఁగ న
వ్వనచరుఁడు గతాసు వగుచు వసుధం బడియెన్ 67

వ. అంత నాదమయంతి వసుధం బడినవానిం జూచి వగచుచు. 68

ఉ. దాసరిపామునోటి కగుదాని ననుం బ్రదికించి తండ్రి వై
దోసమువంకఁ బోవుటలు దొడ్డతనం బనరాదు నాఁగ నా
బాస గ్రహింపఁ బోక ననుఁ బట్టఁగ వచ్చినదాన నిట్టు లై
పాసితె నీదుచుట్టములఁ బాప! మయో! విధి చెద్దు తప్పునే. 69

క. నను బ్రదికించినకతనన్, ఘనతరపుణ్యం బొనర్పఁ గలిగెం దానన్
వనచరుఁడు వీని కయ్యెడు, ననువగులోకముల సుఖసముచితరీతుల్.

వ. అని పలికి దమయంతి సింహశార్దూలాదిదుష్టసత్వసమేతంబును, నానా
విధపక్షిగణాకీర్ణంబును, మ్లేచ్ఛతస్కరసేవితంబును, సాలవేణుధరా
శ్వత్థతిందుకార్జునాదివివిధవృక్షసంఛన్నంబును, ధాతుశతసద్ధభూధ
రాంచితంబును, మహోన్నతనికుంజపుంజరంజితంబును, నదీనదసరస్త
టాకవాపీకూపశతసహస్రశోభితంబును, బిశాచోరగరాక్షససమూ
హసమావృతంబును, నగునమ్మహారణ్యంబు భర్తృవ్యసనపీడితయై
ప్రవేశించె నంత. 71

ఉ. ఘోరవనంబునం దిటులు కొంతనరాని మహార్తి నొందు నీ
సారసపత్రనేత్రఁ గనఁ జాల నటంచుఁ దలంచి మిత్రుఁ డీ
ధారుణి వీడి పోవు ననఁ దారకమార్గము పట్టి పశ్చిమ
ద్వారమునుండి పోయి చరమాద్రిని దాఁటె రయంబు పెంపునన్.

క. కెంజాయ లడరి యుడిగెన్
సంజయు సరిపడియె నపుడు సాంద్రంబై నిం
గిం జతపడియెన్ మబ్బులఁ
బెంజీఁకటు లలముకొనియెఁ బృథివితలమునన్. 73

అంధకారవర్ణనము.

సీ. కాలకంఠుని కంఠగహ్వరంబుననుండి
వెలికి వచ్చినహాలాహల మనంగఁ
త్రికకుపహార్యంబు తెగి భిన్నభిన్నమై
విశ్వంభరం బడి విరిసె ననఁగ
బ్రధ్నుండు తనకు లోఁ బడినచందురు కళం
కముఁ దీసి యటు పాఱఁ గ్రాసె ననఁగ
యమరాట్టు తనదువాహనముతో మెట్టుచు
నిజకాంతి జగమెల్ల నించె ననఁగ
తే. జారచోరాపకీర్తి యాచక్కిఁ బిక్క
టిల్లి యీరైదుదిక్కుల నల్లె ననఁగఁ
గన్ను మిన్నును గనరాక కడఁగి మిట్టు
పల్ల మొకటిగ ధ్వాంతంబు పర్వె నపుడు. 74

క. పుడమి యిది యాకసం బిది
కడ లివ్వి యనంగరానిగతిఁ జిక్కఁగ నై
కడుకొని సూదులఁ బొడువఁగ
నెడ మింతయు లేక ధ్వాంత మెంతయు విరిసెన్. 75

వ. ఇట్లంధకారంబు బంధురంబై కన్ను మిన్నుఁ గానరాకుండునట్టిసమయంబున నవ్విదర్భరాజనందన డెందంబున భయం బిసుమంతయుం దొరల నీయక నిజాధినాథు నన్వేషించుచు శరీరపారవశ్యంబున నగపడినవాని నెల్ల నడిగికొనుచుం బోయి పోయి యొక్కచో నొక్కశిలాతలం బాశ్రయించి మగని నుద్దేశించి దుఃఖించుచు. 76

ఉ. ఎక్కడ నుంటి వోయి హృదయేశ్వర! నన్ విడనాడి యివ్వనిన్
మిక్కిలిజన్నముల్ సలిపి మిథ్య వహించుట నీకుఁ బాడి గా
దక్కట! నాసమక్షమున నాసురవర్యులు వించునుండ నీ
వక్కటికంబునన్ నుడివినట్టినుడుల్ స్మరియింప నొప్పదే. 77

క. ధర సాంగోపాంగసవి
స్తరవేదచతుష్టయంబు చదువుటకంటెన్

వర మొక్క సత్యవాక్యము
పరిపాలించుట యటంచుఁ బలికిరి మౌనుల్. 78

చ. పిలిచినఁ బల్కవే మయరయొ భీషణమై వివృతాస్యమై మహో
జ్జ్వలగతి మృత్యువో యనఁగ వచ్చి భుజించెదు నన్ మృగేంద్ర మాఁ
కలిఁ గొనియుండె నీదయకుఁ గాఁ గలదానన యేని నీవు నా
వెలలెడు ప్రాణము న్నిలుపవే పఱతెంచి నరేంద్రచంద్రమా. 79

సీ. నినుఁ గాక వేఱొక్క నెలఁతఁ బ్రేమింప నన్
పలుకు సత్యము సేయఁ దలఁపు మీశ!
చిక్కి వివర్ణనై పొక్కుచుం బిలిచినఁ
బలుక వేటికి మాఱు సలలితాత్మ!
యూథనాథుని విడియున్న కరిణివోలె
వగచున న్నేలవో వసుమతీశ!
యీఘోరవనములో నెందును వెదకియుఁ
జూడలేనైతి నిన్ సుందరాంగ!

తే. వనులఁ బడిపోయె నైషధావనివిభుండు
వానిఁ గనుఁగొంటిరే? యని వేని నడుగ
వేఁడు గనుఁగొంటి నని నాకు వేడ్క మీఱ
మా ర్వలుక నుండునో యిట మానవేంద్ర! 80

వ. అని ప్రలపించుచుం గదలిపోవునామె కమ్మార్గమధ్యంబున. 81

చ. పెటపెట శబ్దముల్ చెవులు బీటలు వాఱఁగఁ జేయఁ గాఱుచీఁ
కటులు వడంగఁ బెంబొగలు కన్నులఁ గొట్టుచు బెట్టు పుట్టఁ బ్ర
స్ఫుటముగ నాల్క లార్చుచును బోరున నాకము ముట్టి దావ మ
చ్చటఁ గన నయ్యె నైషధునిచానకు మానక నాల్గుదిక్కులన్. 82

చ. మృగములు పక్షులున్ బెదరి మేదురనాదము నల్కలంకులన్
దగులఁగ నార్చుచున్ వడిగ దాహభయంబునఁ బాఱుచుండ న
మ్మగువ దవానలం బెదుట మండుచు వచ్చుటఁ జూచి దుఃఖశాం
తిగఁ బరమేశ్వరుండు నను దేర్చెడు నంచని సంతసించుచున్. 83

ఆ. ప్రలయమందుఁ బోలె బగ్గున మండెడు
నగ్గిమంటలోని కరిగె నంతఁ
జల్లఁబడియె స్వప్నసదృశమై కార్చిచ్చు
మగువతలఁపు వ్యర్థ మగుచుఁ బోవ. 84

పంచ. స్వయంవరంబునందు నింద్రసమ్ముఖంబునన్ ధనం
జయుండు తానును స్వరం బొసంగి యుండెఁ గావునన్
బ్రియంబునన్ సతీమతల్లి బీతునన్ స్వదాహశ
క్తి యెల్లఁ జెల్లఁ జల్లనయ్యెఁ దేఱి చూచినంతనే. 85

వ. ఇట్లు కార్చిచ్చు చల్లారినంత దమయంతి యెప్పటిదారింబట్టి పోవుచుండె నప్పుడు. 86

సింహశార్దూలాదులు దమయంతి కెదురుపడుట.

సీ. కాండ్రు కాం డ్రనుచును దీండ్రించుకోల్పులుల్
దాపుదాపున నుండి దాఁటిపోయె
ఖణిలుఖణి ల్లని కాన దద్దిర్ల ఱం
కెలు వేయుసింగముల్ కెలన మెలఁగె
బొబ్బొబొబో యని బొబ్బరించునెలుంగు
గొడ్డు లడ్డంబుగా నడ్డి పాఱె
గింగుగింగు రనంగ ఘీంకరించుచు రేఁగి
కారుటేనుంగులు కడల నడచెఁ

తే. జిట్టలును గారుదున్నలు సివ్వగులును
దుమ్ముగొండ్లును దోఁడేళ్లు దుప్పు లార్పు
లుప్పరం బంట నడయాడెఁ జెప్ప నేల
పాములును దేళ్లు నల్గడఁ బఱవఁ జొచ్చె. 87

ఉ. నింగిఁ బగుల్చునో యన ఖణిల్లని ఱంకె లెసంగఁ జేయుచున్
సింగ మొకండు నైషధునిచేడియచెంతకు రాఁగ నామె నన్
మ్రింగి మృగేంద్ర! ప్రోవు మని మీఁదికి మీఁదికి వచ్చుచుండ నా
సింగము దైన్యముం దెలుపు చిన్నరవం బొనరించి చెంగటన్. 88

వ. మునికాళ్లో నేల మోయఁ బీఠంబు వెట్టుకొని కూరుచుండి కన్నీరు
విడుచుచున్నం గని దమయంతి దానిచెంతకుం జని. 89

మ. మృగనాథుండను నే వనాంతరముల న్మే లందుచున్నాఁడ నీ
మృగమధ్యం గని దీనికష్టములు వో మే ల్గూర్ప లేకుంటి నా
దగునాథత్వము కాల్పనే యనుచు దుఃఖావేశముం దెల్పుచున్
వగ నెమ్మోమునఁ జూపుచుంటివి కదే పంచాస్య! ని న్నెంచెదన్. 90

మ. వనసత్వంబులలోన నీకుఁగలసత్వంబుం గృపావేశమున్
ఘనశౌర్యంబును వీర్యమున్ బలము లోకఖ్యాతసామర్థ్యమున్
గన లోకంబున వేరికేని కలవే కంఠీరవేంద్రా! ననుం
గని చిత్తంబున నుత్తలంపడెదు నీ న్నైగ మోడ్చి సేవించెదన్. 91

వ. అని దానిం దరియ వచ్చినంత నది చేతు లెత్తి దీవించునదియుం బోలె
మునికా ల్లెత్తి శిరం బాఘ్రాణించి తొలంగి చనియె నంత. 92

సీ. కారుకాటుకడాలు కాదు కా దనఁ జాలు
నెఱకలు మేనెల్ల నిండికొనఁగ
వజ్రసారంబులై వంకలు దేరిన
ఖరనఖరంబు లుగ్రతను జూప
నొక్కింతలో నుక్కుఁ జెక్కఁ జాలెడునాఁకు
టాయి నా నాలుక టాపుఁ జూప
మృత్యుదంష్ట్రలు వోలె మెఱుఁగెక్కుదంష్ట్రలు
ఘనతరవిస్ఫులింగముల నీన

తే. గుట్టల న్నెట్టల న్నెట్టుపొట్టికాళ్లు
చెట్టుచేమల నెక్కంగఁ జేతులు గను
బ్రాణికోటికి మృత్యురూపమ్మొ నాఁగ
వచ్చె భల్లూక మొక్కఁ డావనితకడకు. 93

వ. వచ్చినం గని దమయంతి. 94

శా. భల్లూకం బిది క్రూరజంతు వగు నాప్రాణంబులం దీసి నా
కుల్లాసంబు ఘటింపఁ జాలు నని లో నూహించి రా ర మ్మయో
భల్లూకేశ్వర! నన్నుఁ జంపి తిని నాస్వాంతంబునం గల్గుగో
డెల్లం బాయఁగఁ జేసి పుణ్యమునఁ బో మ్మే నిన్నుఁ బ్రార్థించెద న్.

వ. అంతలో నయ్యెల్లుగొడ్డు కొన్నియారెపం డ్లాపడఁతికడం బడవైచి వడివడిం బఱచె నంతఁగొంతటిలోనఁ జతుర్దంష్ట్రంబును, మహోగ్రంబు నగునొక్కవ్యాఘ్రంబు బెదురుపడి లోచనగోచరం బగుటయు వగవ కామె నిశ్శంకంబుగా దానిచెంతకుం జని సంబోధించుచు ని ట్లనియె.

ఉ. నీవు మృగాధినాథుఁడవు నీకు నరణ్యమునం బ్రభుత్వ మౌఁ
గావున వేఁడుచుంటి నినుఁ గావుము నేను విదర్భరాట్సుతన్
దేవనిభుండు నైషధుఁ డనింద్యచరిత్రుఁడు నామనఃప్రియుం
డీవనిఁ దప్పి పోయె నెట నేఁ బొడఁగంటి వయో వనేశ్వరా! 97

క. నలుజాడ తెలిసితేనియుఁ, దెలిపి ననుం బ్రోవు మట్లు తెలియనిచో నో
పులిరాజ! నీదునోటన్, నిలువం జేకొనుము నన్ను నెగులిది తీఱన్.

క. అని యంతఁ బోవ కట నొక
ధునిఁ గని దమయంతి చింతతో నో స్రోత
స్స్విని! నన్నుఁ దేర్ప వేనియు
నినుఁ జేరెద నింతలోన నేఁ దెగువ మెయిన్. 99

వ. అని యట నానాధాతుసమాకీర్ణంబును బహుశృంగసమంచితంబును వివిధవిహంగమసంకులంబును దరుగుల్మలతావితానవిరాజితంబును నగునొక్కశిలోచ్చయంబుఁ గని దాని నుద్దేశించి యి ట్లనియె. 100

దమయంతి పర్వతవృక్షాదులం బ్రార్థించుట.

సీ. భూధరేశ్వర! నే నమోవాక మొనరించి
సేవింతు నను దయఁ జిత్తగింపు
మే రాజపుత్రిక, భూరమణుం డైన
నానాథుఁ డెంతయే నలువు మీఱి
తేజుమైఁ గావించె రాజసూయాశ్వమే
ధాధ్వరములు సుర లచ్చెరుపడ
నిషధేశ్వరుం డయి నెఱి గన్నవీరసే
నుం డెన్న నాశ్వశురుండు సువ్వె
తే. దైవబల మింత తప్పుట ధరణి వీడి
వనులఁ బడి భర్తఁ గానక వనటఁ గుందు

చుంటి నలచక్రవర్తిని గంటి వేని
తెలియ నానతి యిచ్చి నన్ దేర్పు మిపుడు. 101

వ. అని యభ్యర్థించుచుం బలికి వైదర్భి మఱియును. 102

సీ. దారులారా! పాలుపేటులారా! మీరు
భువనైకమోహనుఁ బోల్చినారె?
పశువులారా! కీరశిశువులారా! మీరు
క్షితిజనేశ్వరుని వీక్షించినారె?
గట్టులారా! పుట్టచెట్టులారా! మీరు
ఘనభూభృదగ్రణిం గాంచినారె?
పాములారా! పెనుగాములారా! మీరు
వరనాగబలవేద్యు నరసినారె?

తే. మబ్బులారా! విసరుగాలియుబ్బులార!
చుక్కలారా! పువుఁబొదలయిక్కలార!
వేల్పులారా! పవలురేయుఁ దాల్పులార!
నామనోహరుఁ దిలకించినారె మీరు? 103

వ. అని పరిదేవనంబు సేయుచు నొక్కచోట. 104

సీ. బలినెత్తిపైఁ బాదములు వెట్టుటకుఁ బోలెఁ
బాతాళ మంటినపాఁతు గలిగి
బొడ్డుబిడ్డనిసృష్టి పొలుపు చూచుటకు నాఁ
జుక్కలపైఁ దలల్ సూపఁ గలిగి
దశదిశల్ నిండినతను వొప్పు నని చెప్పఁ
గడుదవ్వు సాఁగుశాఖలను గలిగి
మేరుమందరములతో రవరవలాడ
మొనసెడు నా మేటిమొదలు గలిగి

తే. చుట్టునుం గ్రింద నెంతయో మట్టు వేఁడి
వేల్పుకిరణాళికిం జోటు గొల్ప నట్లు
చల్లదన మిచ్చుచుం జంతుసమితి నేల
వెలసి సాలద్రుమం బొప్పు విష్ణు వనఁగ. 105

వ. దమయంతి వానిం దిలకించి చేతులు జోడించుకొని ప్రదక్షిణించి
యిట్లని ప్రార్థించె. 106

మ. కరుణాంభోధీ ! ననుఁ బ్రోవ నీవనమునం గన్పట్టినట్టిండ వా
పరమాత్ముం డగువిష్ణుమూర్తి వని నే భావింతు నీ కెల్లచో
ట్లరయ న్వచ్చెడు నామనోహరుఁడు నాప్రాణేశ్వరుం డానలుం
డరయన్ రాఁ డెట నుండెనో తెలిపి నాయారాటముం దీర్పవే. 107

వ. అని పరిపరివిధంబులం బ్రార్థించియుఁ బ్రయోజనంబు గానక. 108

చ. ఎడసె విభుండు దవ్వగుచు నేఁగి కనుంగొనుదాన నంచుఁ బె
న్వడిఁ జని దిక్కెఱుంగ కొకవైపునకు న్మఱియొక్కవైపు గా
నడచుచు నందు నందును గనంబడుగట్లను జెట్లఁ వేఁడుచున్
గుడుగుడుగుంచములఁ దిరిగెఁ గోమలి రేపగు డెంచునంతకున్. 109

వ. అట్లు తిరిగి తిరిగి దారియుం దెన్నునుం గానక నదీపర్వతమధ్యంబునం
బడి యడలు గుడుచుచు నొడ లెఱుంగ కొక్కచోటం బడి మూర్ఛం
బొంది యుండె నయ్యవసరంబున. 110

చ. వనగజ మొక్కఁ డక్కడకు వచ్చి వనంట మునింగి యున్నయ
వ్వనితను గాంచి దుఃఖమున వందురు నాఁ జెఱుగేఁక పెట్టుచున్
గొనకొని చేత నెత్తుకొని గొబ్బున నబ్బలునేటి నీఁదుచున్
జని యవలన్ బ్రతీరమున సాధ్విని నిల్పెను దారిఁ దెల్పుచున్. 111

వ. దమయంతియు నంత మేలుకాంచి వనగజంబునకు వందనంబు గావించి
నితాంతచింతాసాగరనిమగ్నమానమానసయై యుత్తరంబు ముట్టి
మూఁడహోరాత్రంబులు నడచి ముందట నొక్కతాపసారణ్యంబున.

మహామునులు దమయంతికి దర్శన మిచ్చుట.

ఉ. ఆఁకు లలంబులున్ జలము నాశుగముం దమ కెల్లవేళలం
దాఁకలి దీర్చుకోఁ దగినయట్టివ యై చనఁ గృత్తివాసు లై
వీఁకఁ దపం బొనర్చుచును వెల్గుమునీంద్రులపావనాశ్రమం
బాకమలాయతాక్షి గనె నచ్చట నచ్చెరుపాటు దోఁపగన్. 113

వ. అందు వసిష్ఠవామదేవాత్రిసదృశు లగుమహామునికుల్యాధ్యక్షులు
తపించుచుండుటం గాంచి సమీపించి నమస్కరించి వినయవినమి

తో త్తమాంగయై నిలిచి యున్నం గని మునివర్యులు స్వాగతంబు
వలుకుచుం గూరుచుండం జేసి యథోచితాపచితుల నామెం బూజించి
యి ట్లనిరి. 114

చ. ఎవతెవు తల్లి! నీ విటకు నేటికి వచ్చితి నీతనుద్యుతుల్
దివి భువి నిండి మాదృశులదృష్టులకు న్మిఱుమిట్లు గొల్పుఁ జె
ప్పవె వనదేవివో తెలియఁ బర్వతదేవివొ లేక వారిదే
వివొ తలపోయ మాహృదయవీథుల విస్మయ మావహిల్లెడున్.

ఉ. నా నలపత్ని మౌనుల ఘనం బగుభక్తి భజించి యి ట్లనున్
నే నిపు డీరు పల్కినటు నిక్కము దేవతఁ గాను మానవిం
గాని, వినుండు చెప్పెద నఖండపరాక్రమశాలి యై జగ
న్మానితుఁ డైననైషధుఁడు మామకజీవితనాథుఁ డారయన్. 116

ఆ. అతఁడు దేవనమున నఖిలరాజ్యము గోలు
పోయి నన్నుఁ గూడి పొలములందు
మెలఁగ వచ్చి యిపుడు తొలఁగి పోయెను వాని
వలను వెదకుచుంటి వగచి వగచి. 117

మానిని.

ఓమునినాయకులార! భవద్వన ముత్తముఁ డాన్నృపసత్తముఁ డెం
తేముద మావహిలం గనునిచ్చ మెయిం జనుదెంచెనొకో కరుణా
భూములరై వచియింపుఁడు మ్రొక్కెదఁ బుణ్యచరిత్రు నలుం గన కే
నీమెయిఁ గొన్ని దినంబులలో విడి యింపొనఁ గూడుతు నాత్మ కొగిన్.

వ. అని విలపించుదమయంతిం జూచి తాపసో త్తము లి ట్లనిరి. 119

ఉ. రాఁ గలకాల మెంతయు వరం బయి యొప్పెడు మీకు మాతపో
యోగమునన్ గ్రహించితి మయోగ్యనిషూదనుఁ డానలుండు ప్ర
జ్ఞాగరిమన్ రిపుం దఱిమి సౌఖ్యగతి న్నిజరాజ్య మందు నీ
లోఁ గననయ్యెడిన్ సకలలోకనుతంబుగఁ దొంటివైఖరిన్. 120

తే. అనుచు దమయంతినిం బల్కి మునివరేణ్యు
లరయుచుండ నంతర్హితు లైరి వారు

సాగ్నిహోత్రపరాశ్రము లగుచు నమ్మ
హామహత్త్వముఁ గని విస్మితాత్మ యగుచు. 121

క. దమయంతి తనమనంబున
నమితాశ్చర్యంబు నొంది హాహా! యిది ని
క్కముగాఁ గల యగుఁ గాదే
నమఃగాశ్రమ మేది పూజ్యు లగుమును లేరీ? 122

వ. అని చింతాకులస్వాంతయై దమయంతి కొండొకచోటికిం జని యట
నొకపుష్పితాశోకంబుఁ గని శోకించుచు. 123

చ. వనముల మెట్టులన్ మిగుల వాడినవాఁ డొకచీరలో సగం
బునె మొలఁ జుట్టఁబెట్టుకొని పోయెడివాఁడు మహామనోవ్యథం
గనుఁగవ నశ్రుబిందువులు గ్రమ్మఁ జరించెడివాఁడు ఱేఁడు నీ
గనుఁగొన రాఁడుగా తెలిపి నావెత దీర్పవె వృక్షరాజమా. 124

వ. అని మఱియు నొండువలనికిం జని. 125

ఉ. కమ్మనికుందనంబుపసఁ గా దనిపించెడిమేనివాని నె
త్తమ్మికి నీడుజో డనుచుఁ దల్పఁగ వచ్చెడుమోమువానిఁ బో
పొమ్మని బెళ్కు బేడిసలఁ బోవఁగఁ ద్రోల్కనుదోయివాని నా
పొమ్మగువాని నెం దయినఁ జూడరుగా వనులార! చెప్పరే. 126

వ. అని పలుకుచుఁ బర్వతంబులు వృక్షంబులును వ్యక్తులే యని తలంచి
వానిం బలుకరించి పలుకరించి వలగొని వలగొని పోవుచుం బోవుచు.

ఉ. చీమ చిటుక్కు మన్నఁ దనచెల్వుఁడు వచ్చెడు నంచు నల్దెసల్
పో మది సేయు నాఁకు లొకపోఁడిమి నల్లలనాడ నద్దెసన్
భూమిభుజుండు మెట్టు నని పోఁ దలఁపోయు శుకం బొకింతలోఁ
గోమలశబ్దమున్ సలుపఁ గో యని పోవఁ దలంచు నాయెడన్. 128

దమయంతి కొకసార్థంబు కనిపించుట.

వ. ఇట్లనేకపర్వతంబులు ననేకవనంబులు ననేకసరిద్వరంబులుం దాఁటి
దాఁటి పోయి పోయి ముందట హస్త్యశ్వరథసంకులం బగునొక్క
సార్థంబు గని సమీపించుటయు నందలిజనంబు ధూళిధూసరిత
శిరోరుహాయు, నేకవస్త్రార్థసంవృతయుఁ, గృశీభూతశరీరయు, వివ
ర్ణయు నై పిచ్చిదానిమచ్చున వచ్చునచ్చిగురుఁబోడిం గని. 129

ఉ. కొందఱు పాఱి రార్తు లయి కొందఱు చింతిలి రెంతయేనియుం
గొందఱు భీతులై పడిరి కొందఱు పొందిరి ద్వేషభావముల్
గొందఱు నింద చేసి రెదఁ గొందఱు చేతులు తట్టి రార్చుచుం
గొందఱు కేరుచు న్నగిరి కొందఱు పిల్చిరి గారవంబునన్. 130

తే. ఏమి రోయుచునుంటివో యింతి! నీ వె
వర్తు వేటికి వచ్చి తీవాసిదాన
పరయ మానిసివా? విపినాధిదేవ
తవ? నిజము చెప్పు మనిరి కొందఱు భజించి. 131

మ. మఱియుం గొందఱు భక్తితత్పరత నామాన్యాకృతిం జూచి య
క్కఱ దీఱన్ వినుతించి నీ వమరివో? గంధర్వివో? యక్షివో?
నెఱి మీఱన్ వెలుఁగొందుచుంటివి నినున్ సేవింతు మే మెప్పుడుం
జెఱుపుం జేయకయుండి మాచనుప రక్షింపం గదే తల్లిరో! 132

వ. అని యందఱు నన్నిచందంబులం బడి ప్రవర్తించుచుండ భర్తృవ్యసన
పీడిత యగునాబేల బాలవృద్ధాదిసమృద్ధం బగుసార్థంబునం గలసార్థ
వాహులం గని మెల్లన నిట్లనియె. 133

ఉ. మానవి నే నలుండనెడు మానవనాథునిపత్ని భీమభూ
జానికి నాత్మజన్ వినుఁడు సార్థజనేశ్వరులార! నావిభుం
డైనయతండు రాజ్యవిభవాదికము న్విడి వచ్చి నన్నిటం
గానలపాలు చేసి చనెఁ గాంచితిరే నెఱఁగింపుఁడీ దయన్. 134

తే. అనుడు శుచి యనుసార్థవాహాధినాథుఁ
డామె కిట్లను నలుని న్వనాంతరమునఁ
గాన నెప్పుడుఁ గాంతు సింగములఁ బులుల
నెలుఁగులం గారుదున్నల నేనికలను. 135

క. నినుఁ గాక యొక్కమానిసిఁ
గనుఁగొన నిక్కానలోనఁ గటికిపిశాచం
బని జడియుమమ్ము దీనుల
మనుచున్ యక్షేశ్వరుండు మణిభద్రుఁ డిటన్. 136

తే. అనుజు నావిధ మీాబిడా నరుగు నెచటి
కని సుబాహునిచేదిరాజ్యమున కనుచుఁ
దెలిసి భర్తృలాలస యయి తలఁపు దెలిపి
యనుమతిం గొని వారితో నరిగెఁ దాను. 137

చ. చనునయుఁ గొన్ని నాళ్లడవిచక్కిఁ బ్రయాణముచేసి యొక్కచో
వనజసుగంధబంధురము స్వాదుసుశీతలవారిపూర మై
ఘనతర మైనచె ర్వొకఁడు గాంచి బడల్పడి యుంట దానికిన్
వెనుకటిదిక్కున న్విడిసె వేడ్క మెయిన్ శుచినాము నానతిన్. 138

ఆడవియేనుఁగులు సార్థవాహులం జంపుట.

ఉ. అంతట నర్ధరాత్రసమయంబున సార్థము నిద్రవోయి వి
శ్రాంతి వహించి యుండ నట సాంద్రతమంబున కెత్తువచ్చి దు
ర్దాంతదురంతవేగమున దంతిసమూహము దప్పిఁ జెంది త
త్ప్రాంతమునుండి వచ్చె మదధార లవారిగఁ గాఱుచుండఁగన్. 139

తే. ఇట్లు పఱతెంచి వన్యమదేభయూథ
మట మెలంగెడుగ్రామ్యగజాళిఁ జూచి
ఘీంకరించుచుఁ బైఁ బడి క్రేళ్లుదాఁటి
వడివడిగఁ దాఁకి కడుఁ జిందువందు చేసె 140

క. కరిఘటలు కరుల నరులం
బరిజనులం బశుల శిశుల బహుళోష్ట్రములం
బరిపరివిధములఁ గూల్చినఁ
బరపై పె ల్లెగసె నడరి భయదారవముల్. 141

వ. అప్పుడు. 142

మ. పదసమ్మర్దితులై కరాభిహతులై బాధోగ్రదంతస్ఫుట
త్పదహస్తోరుకపాలఫాలశిరులై పంచత్వముం గాంచి ర
ప్పదమందుం గలవారు కొందఱు విపత్పాథోధిమగ్నాత్ము లై
మదధారాపరిషిక్తభూతలమహామాతంగజాతోద్ధతిన్. 143

తే. సాధ్వసంబున నగు రభసమునఁజేసి
పఱచి చెల్లెక్కి కాలూఁదఁ బడమిఁ బుడమి

కొఱగి చచ్చిరి కొంద ఱొండొరులఁ దాఁకి
కొనుట నఱచుచుఁ ద్రెళ్లిరి కొంద అపుడు. 144

మ. నరు లేన్గుల్ తురగంబు లశ్వము లటఁ వన్యాళిచేఁ ద్రుంగిపోఁ
గరముల్ గాళ్లును వ్రేళ్లునుం దలలు డొక్క ల్పిక్కలుం బ్రక్కలున్
నరముల్ ప్రేవులు గుండెలు న్వసలు నాంత్రంబు ల్వప ల్మాంసముల్
ధరణిం బాఱెను గుప్పతిప్ప లగుచుం దద్రక్తకూలంకషన్. 145

వ. ఇట్లాబిడా రంతయు నంత మైనం గని దమయంతి చింతాకులస్వాం
తయై తనదురదృష్టంబునకుఁ బరిపరివిధంబులఁ బరిదేవనంబు సేయు
చున్నంత హతశేషు లయినకొందఱు. 146

సీ. బంధుజనంబును బశుధనంబును నేల
పాలయ్యె నయ్యయో బంధులార!
వననాథు మణిభద్రు మనము పూజింపక
వనముఁ జొచ్చుట నిట్లు వనట వచ్చెఁ
దొలివొల్త విఘ్నకర్తలను మ్రొక్కనితప్పు
గురుతరమై యిట్లు పరిణమించెఁ
గదలునప్పుడు మనగ్రహచారమునకుఁ దో
డపశకునములు మెండయ్యె నేమొ

ఆ. రాచదాన నని పిశాచి యియ్యది వచ్చె
వచ్చినపుడె బీతు పెచ్చుపెఱిగె
నింతపాపమునకు నిదియె దీనిని మొత్తి
మిత్తి కిత్త మిపుడ మిడుక మిడుక. 147

తే. ఇట్లు కొందఱు పలుకంగ నింతలోన
మఱియుఁ గొందఱు నిది యేటిమాట మనపు
రాకృతం బిట్టు లుండ నీరాజవదన
సలిపినది యేమి? మీ రిట్లు పలుకఁ జనునె? 148

వ. అని వారిఁ దౌర్జన్యంబునుండి మరలించి రంత దమయంతియు. 149

ఉ. దైవము క్రూరకర్మ మయి దాపుర మయ్యె నయో తలంపఁగాఁ
జావఁ దలంచినట్టినసుఁ జంపక బంధులతో సుఖంబునం

బోవఁగ నున్నసార్థజనపుంగవులన్ గొని చంపె నింక నే
నేవిధి నెత్తిపైఁ బడినసీవిపదంబుధి నీఁదుదాననో? 150

మ. ఎవ నే నెవ్వరికిం దలంప నశుభం బీజన్మమం దెప్పుడే
నివి జన్మాంతరసంచితాఘఫల మింతే కానిచో నిట్టు లా
పదపై నాపద వచ్చునే కరులు చన్పం గూల్చెఁ గా కింత నా
కు దయం జూపిన నాత్మహత్యకును నేఁ గూడం గదా! దైవమా!

చ. మదగజ మొక్కసార్థజను మర్దితుఁ జేయుచునుండ నేను ద
త్పదమును బట్టి త్రొయుటకుఁ దాఁకసిల న్నను నెట్టెఁ గాని నా
హృదయము ప్రీల మెట్టి మడియించుట కించుక యొంచ దయ్యె న
య్యది మును నేఁ బొనర్చినమహాఘఫలం బగుఁ గాదె చూడఁగన్.

తే. భర్తృరాజ్యాపహరణంబు బంధుజనప
రాజయము పతిపుత్త్రవిరహము గహన
వాస మురగగ్రహణము నీవరుస వచ్చె
నాథు లేమందు హతవిధి కక్కటకట! 153

ఉ. పిన్నటినాఁటనుండియును బేరున కే నిసుమంతపాప మే
నెన్నఁడు జేసియుండ నిది యింతయు సత్య మటంచు బాస నే
నెన్ని పొనర్తుఁ గాని త్రిదశేంద్రుల రోసి స్వయంవరంబునం
దు న్నలుని న్వరించినది దోసమ దైె యిటు లయ్యెనో కటా! 154

చ. నలుని వరించుపట్టునను నాకు ననుగ్రహదృష్టి చూపి వే
ల్పులు వర మిచ్చి రట్టిబుధపుంగవు లిట్లు పొనర్పఁ జూతురే!
తెలియదె వారి కే నొరులఁ దేఱి కనుంగొనుచిత్తవృత్తితో
మెలఁగనిదాన నంచు నిటు మేరయె వారల శంక సేయఁగన్. 155

క. నాదోష మిం దొకింతయు
లే దానలుదోష మనఁగ లే ముత్తముఁ డా
భూదయితుదూతకృత్యం
బాదివిజుల మెచ్చునట్టిదై పేర్పడదే. 156

క. ఇది దైవపరీక్షయె యీా
నెద నెట్లు తలంచుకొన్న నిసుమంతయుఁ దోఁ

పడు కతము దీన నౌనగు
నది యెల్ల భరించుచుండు టది తప్పు డిఁకన్. 157

దమయంతి చేదిపురంబుఁ జేరుట.

వ. అని విలపించునమ్మించుఁబోఁడి మఱునాఁ డరుణోదయంబున హతశేషు
లగుసార్థజనులతోడం గూడి కతిపయప్రయాణంబులఁ జేదిపురంబు
నకుం జని రాజవీథిం జనుచున్నసమయంబున. 158

సీ. ఇది యెంటిఁ జనుదెంచు నెలనాఁగ వెక్క నే
రైన నుండిరో చూత మనుచుఁ గొంద
ఱిది సుందరాంగి లే రేరు దీనిం బట్టి
కొని పోవ ప్పెడు ననుచుఁ గొంద
ఱిది రాచశేవమై నెసఁగెడు నీగతి
యరుదెంచు నేమొకో యనుచుఁ గొంద
ఱిది పతివ్రత యెవ్వారేఁ గీడు దలఁచిన
యంతనే చచ్చెద రనుచుఁ గొంద

తే. ఱిట్లు పలువురు పలురీతు లెసఁగఁ బలుకు
కొనుచుఁ జూచిరి చెయి వీచి రనుసరించి
దైన్యమును జూపి రతిభక్తి దరిసి మ్రొక్కి
రప్పురంబున దమయంతి యరుగుచుండ. 159

ఉ. గ్రాసము లేక గాసిపడి కానఁ గృశించి విముక్తకేశి యై
మాసినచీరఁ గట్టుకొని మానక వెంబరవిత్తు వోలె నై
వేసర కాకతాయ లగువేగురు కుఱ్ఱలు వెంబడింపఁ గా
నాసకి రాచకొంకి దరియం జనుదెంచెఁ జలాచలాంగియై. 160

వ. ఇట్లు వచ్చువైదర్భిం జూచి ప్రాసాదతలగత యగురాజమాత ధాత్రిం
బిలిచి యంగుళి నిర్దేశంబు సేయుచు ని ట్లనియె. 161

మ. పురవీథిం బ్రజ లాఁగ వేఁగుచు నదే పూఁబోఁడి దుఃఖించుచుం
శరణు న్వేఁడుచు వచ్చుచున్నయది యున్మత్తాకృతిం గ్రాలునిం
దిరయో నాఁ జను నీమెకల్మి నగళుల్ దీపించు నీ వేఁగి య
ప్పరివేష్టించెడుమూఁకఁ ద్రోలి యిట కాపద్మాక్షిఁ దె మ్మర్మిలిన్. 162

మ. ఇది విష్ణు న్వీడి వచ్చినట్టిసిరియో యీశుం బెడంబాసి భూ
వరముం జేరినగౌరియో నలువపై వైరంబునం జేసి స
మ్మున మెచ్చుం జనుదెంచినట్టిచదువుంబూఁబోఁడియో కాని నా
మది నింతింతనరానివేడ్క మొలపింపం జాలి చూడం దగెన్. 163

ఉ. అచ్చెరువయ్యెఁ గార్మొయిల నల్లికబిల్లిక నాటలాడుమిం
చచ్చుట నేలమీఁదఁ బొరలాడెడునో యన మూఁక మూఁగికో
వచ్చెడు నాసరోజముఖివంకఁ గనుంగొనుదే ప్రియంబుమై
నెచ్చటనుండి యెచ్చటికి నేఁగుచు నిచ్చటి కేఁగుదెంచెనో? 164

వ. అని చెప్పి యప్పద్మాక్షిం దనప్రాసాదరాజంబునకుం దెప్పించి యి
ట్లనియె. 165

చ. సుగ మనుమాట లే కీటులు సోలియు జాలి మెలంగునీ వహో
మొగిలమఱుంగున న్మెఱుఁగుపోల్కిఁ గనంబడు దేరిదానవో
మగువ! మనుష్యకాంతలకు మానగు నిట్టిసురూప ముండు నే
తగు దొకదేవకాంత వన దాఁపక చెప్పుము నీదువృత్తమున్. 166

మ. ఇద మిత్థ మ్మని చెప్పఁ జాలను గుమారీ! దైవతంత్రం బదె
ట్టిదొ కానీ నినుఁ జూచినంతటన నాడెందంబునం దుత్సవం
బొదవింపం గలహార్ద మా నొడలియొప్పే చెప్పెడిఁ గొప్పసం
పద నిక్కంబు వచించి నాకడ వసింపం జిత్తముం జేయుమా. 167

తే. అనుడు వైదర్భి యి ట్లను నమ్మ! నేను
మానవిఁ గట్టువాల్జాతి మనెడునట్టి
దాన మగనాల గుణనిధి యైననాదు
మగనికి న్నీడ వలె నేను దగిలి యుందు. 168

వ. దైవోపహతుం డైననామగండు ద్యూతనిర్జితుండై వనంబులం బడిన
నేను వాని నాశ్వాసించుచు ననుసరించి యుండ క్షుత్పిపాసాపరి
శ్రాంతుం డగుటం జేసి విమనస్కుండై యతండు మై మఱచి నిద్రించు
నన్ను విడిచి నడచి పోయె నే నాయేకవస్త్రార్థధరు నాప్రాణప్రియు
నన్వేషించుచుఁ గందమూలంబు లాహారించుచుఁ బ్రొద్దు పోయినకడ
నిద్ర వోవుచు సింహశార్దూలాదిదుష్టసత్వసమూహంబు సహాయం

బుగా వనంబులం బడి వనటం బడితి నని కన్నీరు మున్నీ రై పాఱ నా_త్తస్వరంబున నేడ్చుచుమయంతి నూరార్చి రాజమాత యి ట్లనియె. 169

తే. నీపయిం బ్రేమ నా కయ్యె నెలంతమిన్న !
నీవు నాకడ నుండుము నీమగండు
నిందు నందును దిరిగి తా నిందు వచ్చుం
బురుషులం బుత్తు రాకున్న నరసి తేర. 170

తరువోజ.—

అనిన వైదర్భి యి ట్లనియె నాసమయ
మరయు మెంగిళు లంట నంఘ్రిధావనము
పొనరింప నెపు డన్యపురుషులతోడ
ముచ్చటింపను దుష్టబుద్ధి నే నైనc
గని కోర వానినిc గనలి దండింపc
గాc దగు నీకు నాకాంతుని రోయు
ననఘునిం గాంతు ని ట్లయిన నే నిచట
నడcగి యుండెదc గానియ ట్లైనc బోదు.

వ. అనుటయు రాజమాత నీవు నీవ్రతంబు లెల్లం జెల్లించుకొనుచు నాకడ నుండు మేను నీయిష్టప్రకారంబునం బ్రవర్తించెద నని తనకూcతు సునంద యనుదానిం బిలిచి యి ట్లనియె. 172

తే. దేవరూపిణి సైరంధ్రి దీనిc జూడు
మీడు జోడైనదగుటచే నిదియు నీవు
సఖులరై మోద మొందుcడు సతత మనుడు
నా మెతోడ సునంద దా నడcగి యుండె. 173

వ. అంత నట నలుండును. 174

—నలుcడు దావానలంబునం బడినకర్కోటకు నుద్ధరించుట.—

మ. తరుణీరత్నముc బాసి కాఱడవిc జిత్తభ్రాంతిచే మెట్టుచుc
దరుగుల్మప్రతతీవితానములు నుద్యజ్జ్వాలలం గాల్చుచుc

సురమార్గంబున విస్ఫులింగములతో జొబ్బిల్లి త్రైలోక్యభీ
కరమై మండువదావానలంబుఁ గనియెం గట్టావడి న్నందఅన్ 175

క. కని జేచ్చుపాటు దోఁపఁగ
జననాథుఁడు నిలిచి యున్న సమయమునందున్
విన వచ్చె నతని కోనల!
ననుఁ గనర మ్మనెడునార్తనాదం బరుదై. 176

చ. నల యని పిల్వ వచ్చెడిని నన్ను నెఱింగినవాఁ డెవం డిటం
గలిగెడి? మంటలోఁ బడినకష్టునిశబ్దము వోలెఁ దోఁచెడిన్
నలుగడ దావ మేర్చెడిని నా కెవియుం గనిపింప కుండె నే
కెలనికిఁ బోవ నార్తు బ్రదికించినపుణ్యము నొందఁ బోదునో? 177

వ. అని నలుగడం బరికించుచున్న నలుండు విన మఱియును. 178

చ. అనలము చుట్టు ముట్టుకొనె నయ్యయొ! యియ్యెడ దిక్కు లేక నే
నను వఱి చావ నైతి దహనార్చులు పేర్చి మదీయదేహముం
గొనకొని తాఁక వచ్చెడిని గొంతటిలోఁ గడతేరి పోదు నో
ఘనభుజ! నీకృపారసముఁ గాలెడునాపయిఁ జల్లఁ జూడవే. 179

క. నే వింతవాఁడ నైనన్, జీవింపఁగ మన మొకింత చేయుం బ్రీతిం
గావున వేఁడెద నిన్నున్, "జీవన్ భద్రాణి పశ్యసి" యనన్ వినుటన్

ఉ. సారెకు నార్తనాద మది జానుఁగులం బడ నైషధుండు శం
కారహితాత్ముఁడై యనలగర్భమునం జొరఁ బాఱి బోరునం
గారునఁ జుట్టఁ బెట్టుకొని కాయ మపాయమునం జలించి పో
నేరనినాగరాజుఁ గని నేఁగల నోడకు మంచుఁ బల్కుచున్. 181

వ. పరుగుపరుగునం దరియ వచ్చెదు రాజుం గని నాగరా జిట్లనియె.

ఆ. గహ్వరీశ! నేను గర్కోటకుం డను
వాఁడ దేవమానివర్యుఁ డైన
నారదునకు నెగ్గు నడపినకతన నా
తఁడు శపించె నన్ను నెడదఁ గనలి. 183

వ. దానంజేసి నే నిట్లచలంబు వోలెఁ జలియింప నేరకున్నవాఁడ నేఁ డీ
యుపద్రవంబు గడవ నన్ను మఱొందుచోటికిం గొనిపొమ్ము నేను

నీకు సఖుండనై శ్రేయంబు సేయనోపుదు నిట్టినన్ను మోయనోప
నందువేని కను మని యంగుష్ఠమాత్ర గాత్రుం డగుటయు నలుండు
వెఱవ కనలంబునం జొరంబడి. 184

సీ. కనికరంబున దానిఁ గరములఁ గైకొని
భయవర్జితం బైనబయలునందు
విడువ నెంచుటయు నానిడుపఁ డెఱేఁగి పల్కు
నడుగు లెన్నికొనుచు నడవు మయ్య
నీకడ శ్రేయంబు చేకూఱఁ జేసెద
నన నలుం డ ట్లెన్నికొనుచు నడచె
నపుడు సర్పము దశమపదంబునఁ బాని
కాయంబుపై వడిఁ గాటు వైచెఁ

తే. గాటు వైచినమాత్ర నమ్మేటిమగఁడు
వికృతరూపము ప్రాపింప విస్మితుఁ డయి
కొదికి కనుచుండునంతఁ గర్కోటకుండు
నాత్మరూపముఁ గైకొని యనియె నిట్లు. 185

క. ఉపకారికి నపకారము
విపరీతము గాఁగ ఘోరవిషధర మిది నా
కిపుడు పొనర్చె నటంచుఁ
నృపవర! సంకోచ మొందుదే విను మెల్లన్. 186

ఆ. నీవు కఱవు మనిన నేను గఱచితి నే
కాదులను గణించునప్పుడు దశ
యంటి వనినఁ గఱవు మని యర్థ మగుఁ గాదె
యిందు నాదుదోష మింత గలదె? 187

వ. అని యించుక విలాసంబుగం బలికి మఱియు ని ట్లనియె. 188

క. నిను నోరు లెఱిఁగిన నెగ్గగు, నని నీరూపంబు వికృతి నందఁగ నే ని
ట్లొనరించినాఁడ వగవకు, జననాయక! దీన లగ్గు సమకుఱు నీకున్.

సీ. విను మెంతవనుక నీతనువున నావిషం
బమరంగ నుండెడు నంతవనుకఁ
గలుగదు విషజంతుకలితభయంబును
యక్షరాక్షసపిశాచాదిభయము
విగ్రహంబుల శత్రువిజయంబు గలిగెడు
జగమెల్ల నీకు వశంబ యగును
బ్రహ్మబంధులు నిన్నుఁ బరిభవింపఁగ లేరు
దుఃఖభారం బెల్లఁ దొలఁగి పోవు
తే. బాహుకుం డనుపేరను బరఁగి నీ వి
చటన కల దయోధ్యాపుర మటఁ జని ఋతు
పర్ణుఁ డనుఱేని నిక్ష్వాకువంశభవుని
నాశ్రయింపుము నీ కిష్టుఁ డగు నతండు. 190

క. నీ కక్షహృదయ మిచ్చెడు
నాకువలయనాథుఁ డీవు నశ్వహృదయముం
జేకొన నాతని కిచ్చెద
వోకుంభినిపతి ! శుభంబు లొందెడు నిన్నున్ 191

వ. ఆవల నీకుఁ బుత్త్రమిత్త్రకళత్త్రసంగమంబును రాజ్యప్రాప్తియు నగు నీవు నీరూపంబు నొందం దలంచునాఁ డీవస్త్రంబుల ధరించి నన్ను స్మరింపు మపుడ నీరూపంబు నీకు వచ్చు నని పలుకుచుం దనకడ నున్న దివ్యవాసోయుగం బతని కిచ్చి నాకు నీకతంబున శాపవిమోక్షం బయ్యెఁ బోయి వత్తు నని కర్కోటకుం డంతర్ధానంబు నొందె ననంతరంబ. 192

నలుఁడు బాహుకుండై ఋతుపర్ణు నాశ్రయించుట.

సీ. మిట్టపల్లంబుల మిసిమి దప్పినతల
పొట్టిచేతులు, కాళ్లు, మిట్టగ్రుడ్లు
గుడుసుజుంజురు వెండ్రుకలు వ్రేలుపెదవులు
దొప్పలు దేరినగొప్పచెవులు

క్రొక్కారెబిక్కారిముక్కును, జిక్కి లో
నిగ్గినచెక్కులు, గొగ్గిపళ్లు
స్రుంగినమెడయును, గూనునడుము, మక్క
లించినపొట్టయుం బెంచునడుము

ఆ బండికందెనజిగి బైసిమాలినమేను
వేసడంపుసారము బూసినడలు
గలిగి కనుఁగొనంగఁ గడునేవ కొల్పెడు
వికృతరూపమునను వెలసె నలుఁడు. 193

వ. ఇట్లు వికృతరూపంబు నొందిననలుండు పదిదినంబుల కయోధ్యాపురం
బునకుం జని ఋతుపర్ణుని దర్శనము చేసి. 194

ఉ. బాహుకనామధేయుఁడను బార్థివవల్లజ! వింటె నన్ను నే
వాహనశిక్షయందుఁ గడువాసి మెలంగుదు సూదకృత్యమం
దేహరవాదియుక్ సవ తొకించుకయుం గొనరాఁడు నాకు సం
దేహము లేదు శిల్పములఁ దేరినవాఁడ నసుక్ భరింపుమా. 195

తే. అనుడు ఋతుపర్ణుఁ డను నోయి హయచయంబు
వ యేని నాయొద్ద నుండు
మేను నూర్వరహాల నీ కిత్తు జీత
మశ్వయూథాధినాథుఁడ వగుము నీవు. 196

వ. ఈవార్ష్ణేయజీవలులు నీకు సహకారు లగుచుందు రని వారిం జూపిన
నలుండు వల్లె యని వాజిశాలకుం జని వాజులం బరీక్షించి ఋతు
పర్ణు ననుమతంబున నయ్యయోధ్యాపురంబునం దొక్కచో నుండి
కాలక్షేపంబు సేయుచుఁ గరంబు చింతాజ్వరసంతప్తచిత్తుండై దమ
యంతిం దలంచుకొని. 197

ఉ. అక్కట! క్షుత్పిపాసలకు నై కడు డస్సి యరణ్యమందు నీ
వెక్కడి కేఁగితో? మది యొకింతయు లేనిమగండు మందుఁడై
దిక్కును మొక్క లేనికడఁ ద్రెళ్లఁగ నేయుటఁ జేసి యెంతగాఁ
బొక్కుచు నుంటివో? తెలియఁ బోలదు నామదికిం దపస్వినీ! 198

చ. సుమనసు లంతవారు నినుఁ జూచి కడుంగడు సొక్కి మక్కువన్
గోమిరెగ ని న్వరించి తమకోరిక వారక దూతమోముతో
నమరఁగఁ జెప్పిరన్ విన కనార్యుని న న్నధమాధము న్వివా
హామునఁ బరిగ్రహించి యకటా! యిటు బాముల కైతివే సతీ! 199

చ. నిను విడనాడ నెప్పటికి నే నని పల్కియు నీమగండు కా
ననమున నిద్రవోవునెలనాఁగను ని న్విడనాడి యొంటిమైఁ
జనియెఁ గృపావిహీనుఁ డయి చానరో! నీ వపు డెంత యేడ్చితో!
కనుఁగవ నెంత నీ ర్వెడలి కాలువ గట్టెనో? యెట్టు లయ్యెనో? 200

ఉ. ఘోరవనాంతరంబునను గుయ్యిడుచుం జనుచున్న నీకు నే
దారియుఁ దోఁపకున్నపుడు దగ్గఱఁ దీసినచుట్టలై పులుల్
గోరికఁ బొట్టఁ బెట్టుకొని గో డుడుగింపక యుండునే ఖలుం
డారమణుండు క్రూరనరకాధుల నొందక యుండునే కటా! 201

సీ. చిరిఁగినచీర నీచేఁ దగిలినయప్డు
మగనికై నీ వెంత పొగిలితివొకో?
హానాథ! హానాథ! యని పిల్చు చటఁ దిరు
గాడుచో నీ వెంతయడలితివొకో?
పెనుబాము నిను మ్రింగికొని యున్నయప్పుడు
దిక్కులే కీ వెంతపొక్కితివొకో?
వాలుమెకంబు నీవంక వచ్చిననాఁడు
సాహస మీ వెంత సలిపితివొకో?

తే. కారుకేస్తులు నిను బట్టి కాల మెట్ట
నున్నయప్పుడు నీ వెంత యోడితివొకో?
కటకటా! యిన్నిపాట్లు నీకట్టుకొన్న
మగనికతమున నయ్యెఁగా మగువమిన్న! 202

వ. అని ప్రతిసాయంసమయంబునందును నీపద్యంబులు పఠించుచున్న
బాహుకుం జూచి యొక్కనాఁడు జీవలుండు నీ వెవ్వతెకై వగచు
చుంటి వనిన నతం డతని కిట్లనియె. 203

శా. మందప్రజ్ఞుఁ డొకండు మున్ విడి సతిన్ మా నేఁడు గార్కొనలో
నిం దందుం జరియించుచున్ హతవిధిన్ హెచ్చిల్లుమోహంబునన్
గుం డెం డెందము డింద నిట్టు లది నాకున్ జ్ఞప్తికి న్వచ్చుటన్
సందేహింపక యిప్పు డత్తెఱఁగు లోఁ జర్చింతు నోజీవలా! 204

వ. అని ప్రతారించి చెప్పి నలుం డాదమయంతికై పరితపించుచు నటనజ్ఞాతవాసం బుండె నని చెప్పిన నైమిశారణ్యవాసు లవ్వలివృత్తాంతంబు సెప్పు మని సూతు నడుగుటయును. 205

ఆ శ్వా సాం త ము.

మ. శివుఁడున్ రాముఁడు నొక్కఁడే యని నుడిం జెప్పంగ నిప్పట్లఁ దా
శివరామాఖ్య యభిఖ్య గాఁగఁ గొని సుశ్రీవైభవోపేతుఁడై
శివునిన్ రామునిఁ గొల్చుచున్ సతతముం జెల్వొందుసీతాపతిన్
శివుఁడున్ రాముఁడు సోముఁడున్ రవియు రక్షిం త్రైల్లకాలంబునున్.

గద్యము. ఇది శ్రీమహామహోపాధ్యాయ, కలాప్రపూర్ణ, కవిరాజ, కవిసార్వభౌమ శ్రీపాదకృష్ణమూర్తిశాస్త్రి ప్రణీతంబయిన నైషధీయచరితం బనుశృంగారతరంగిణియందుఁ బంచమతరంగము.

శ్రీ. శ్రీ. శ్రీ.

శ్రీరస్తు.

# నైషధీయచరితము

## శృంగారతరంగిణి

### షష్ఠతరంగము.



మద్విక్రమపత్తన
భూమిసురశ్రేష్ఠుఁ డగుచు భూభుజు లెన్నన్
శ్రీ మించిన వేంకటశివ
రామయ వర్ధిల్లుఁ గాక రామునికరుణన్. 1

వ. అక్కథకుండు శౌనకాదిమహామునుల కిట్లనియె నట్లు దమయంతియు నలుండును వనంబులం బడియు నెట్టకేల కిట్లు పురంబులు చేరుకొని యున్నయప్పు డక్కడ విదర్భేశ్వరుం డగుభీమభూవల్లభుండు. 2

భీమరాజు నలదమయంతుల నన్వేషింప విప్రులం బుచ్చుట.

తే. కూఁతు రల్లుండు రాజ్యముఁ గోలుపోయి
వనులఁ బడి రని విని కుంది వారి రోయ
ద్విజవరులఁ బుచ్చె ధరఁ గల్గుదేశములకుఁ
బుష్కలంబుగ విత్తంబు మొత్త మిచ్చి. 3

వ. మఱియు వారి జాడ చెప్పినవారికి వేయిగోవులును, గని వచ్చిన వారికిఁ బదివేలగోవులును, దోడితెచ్చినవారికి నగరసమ్మితమ్ము లగు కొన్నిగ్రామంబులు నిచ్చెద నని యనిపిపుచ్చి తనమనంబున. 4

శా. నాజామాతృఁడు లోకవందితుఁడు సౌందర్యప్రభావంబునన్
దేజస్సారమునం బ్రతాపమున దాతృత్వంబునం దత్త్వవి
ద్యాజిజ్ఞాసను గందు నిందు రవి దేవానోకహంబున్ శుకున్
వ్యాజం బింతయు లేక గెల్వఁ దగువాఁ డాతండు సామాన్యుఁడే. 5

చ. పలికియు బొంకఁ బోఁ డెపుడు పల్కిన పల్కులు లోకహితుల్యముల్
పిలిచినఁగాని పోఁ డెటకు బీ తెఱుఁగండు హాసన్ముఖుండు ని
ర్మలమతి వాగ్విశారదుఁడు రాజకులైకవిభూషణుండు మా
నలుఁ డొకరాజమాత్రుఁడ యనం దగ దెన్న నతండు రత్నమే 6

క. శ్రీశ్రీశభక్తుఁ డాగ, ర్భశ్రీమంతుండు శాంతభావుం డనఘుం
డాశ్రితవత్సలుఁ డఁటె రాజ్యశ్రీ విడి పోవు టెన్న నచ్చెరు వకటా!

శా. గారాబంబునఁ గాంచి పెంచితిని నాకన్యావతంసంబు వి
ద్యారామామణి కెత్తువచ్చెడు నసూర్యంపశ్య యైశ్వర్యవ
త్ప్రారంభాంచిత కాంచనాంగసుషమాప్రఖ్యాత నాతల్లి తా
నేరీతిన్ గహనప్రచారమున నా క్లేశింపఁగా నుండెనో? 8

క. పలికింప నలసిపోవం
గల దని యల్లారుముద్దుగాఁ బెంచిననా
కులదీపము దమయంతికి
బలుపాటులు వనములందుఁ బడ నయ్యె నయో! 9

క. మొకమల్ తివాసులం దొ
క్కొకయడుగుగ వేసి యలసి యూర్చెడునది మా
సుకుమారగాత్రి వనులం
దకటా! యెటు కఱకుతాల్ప నడు గిడెనో కదా! 10

వ. అట్లు వగచుచుండె ననంతరంబ. 11

మ. ధరణీదేవకులావతంసములు మోదం బొప్ప విశ్వంభరం
బురముల్ రాష్ట్రములున్ మహావనములున్ భూధ్రంబులున్ భూరిని
ర్ఝరిణుల్ దొట్టిసమస్తభూములును సంరంభంబున న్వెట్టి రా
వరకీర్తిన్ నిషధాధినాథుని నలున్ వైదర్భినిన్ రోయుచున్. 12

తే. అంతట సుదేవుఁ డనుద్విజుం డందు నిందు
నరయుచుం జేదిపురమున కరుగుదెంచి
రాచనగరునఁ బుణ్యాహవాచనంబు
చేయఁ బడుచుంట విని తాను జేరి యచట. 13

వ. అంతిపురంబున సుసంహాసహితనై యప్రతిమానరూపసంపన్న యయ్యు ఘూమజాలనిబద్ధం బైనబృహద్భానుప్రభయుం బోలి మలినయై కృశాంగియై యున్నదమయంతిం జూచి. 14

సీ. పారప మది సోఁకఁ బస చెడు బంగారు
మన వెలవెలఁ బోవుతనువు గలిగి
చము రెఱుంగక మట్టిఁ జమురుట నడగట్టి
నెఱసిన ట్లగపడు నెఱులు గలిగి
బొట్టుగా కొకనల్లపూసయుం దాల్పమి
జా నేదువికృతవేషంబు గలిగి
నెఱమాసి తోలునా నెఱఁ బాసి తుండెమై
సరిపోనియేకవస్త్రంబు గలిగి
తే. కోల యగుమోము లోతైనవాలుఁగనులు
వాడివత్తలై కిక్కిసకాడ లైన
కాలునేతులు గలిగి యిక్కడ మెలంగు
నీమె యొకపేదముత్తైదు వేమొ యనుచు. 15

వ. ఇంచుక చని భీమరాజుం బోలినహావభావంబు లామెకడం గొన్ని కానిపించుటం జేసియుఁ దొల్లి చూచినవిగ్రహంబువలెం దోచుటం జేసియు దమయంతి యగునో యని సంశయించి దానిచెంతకుం జని.

తే. కరతలంబులు గో ళ్లరకాళ్లు కన్నుఁ
గొలుకు లధరంబు నరుణిమఁ గలిగి యుంట
మఱియు శుభలక్షణము లెన్నొ వఱలుచుంట
నేలయేలికచెలి యని నిశ్చయించి. 17

వ. మఱియుం దరియ వచ్చి భ్రూమధ్యంబునం గలతిలకాలకముం గని కృతార్థుండ నైతి నని సంతసించుచు. 18

సుదేవుఁడు చేదిపురంబున దమయంతిం దిలకించుట.

శా. రాకాచంద్రనిభాననప్రభఁ దమిస్రంబుం దొలంగించుచుఁ
నాకన్నుంగవకు న్మనంబునకు నానందంబు సంధించు నీ
లోకైకైకేద్యపవిత్రగాత్రి గరిమన్ లోకోత్తరుండై విద
ర్భాకాంతుం డగుభీమభూపతికిఁ బోల్పన్ గర్భవాసం బగున్. 19

వ. ఇప్పరమపతివ్రతావతంసం బిప్పుడు పతివిరహంబునం బరితపించునదియై జలోద్ధృతం బైనమృణాళియుం బోలె శుష్కస్రోతం బైననదియుం బోలె నీలాభ్రసంవృతం బైనచంద్రరేఖయుం బోలె శోభింప నేరక కృశాంగియు భోగవిహీనయుఁ బాంసుపటలచ్ఛన్నయు మలినవస్త్రధారిణియు దుఃఖస్వరూపిణియు నై భర్తృసందర్శనాపేక్షం జేసి దేహంబు ధరించి యున్న దని నిశ్చయించి. 20

చ. సతికి విభూషణంబు పతి సాధ్వి విభూషణ మెన్న భర్తకుఁ
బతి విడి పత్ని పత్ని విడి భర్తయునుం బ్రదుకంగ లే రిలం
బతిఁ బెడఁబాయుటం బగచుభామిని దీనిఁ గనుంగొనంగ నా
మతియుఁ దపించుచున్న దిఁక మానినిబంధులఁ జెప్ప నేటికిన్. 21

ఉ. ఎన్నఁడు గల్గునో? పగ పి దేఁగుట లెన్నఁడు సౌఖ్య మబ్బునో?
యెన్నఁడు వీరు రోహిణియు నిందుడునుం బలె గూడి యుందురో?
యెన్నఁడు రాజ్యమంది సుఖియించెదువీరలఁ జూడఁ గందుమో
యెన్నఁడు భీముఁడుం బ్రజయు నింతియు నెంతయు సంతసింతురో.

వ దుఃఖాక్రాంతచిత్తయు నార్తయు నై ధ్యానతత్పర యగునీసంపూర్ణపూర్ణిమాచంద్రముఖి నే నిపు డాశ్వాసించెదం గాక యని సుదేవుండు దమయంతిచెంతకుం జనుదెంచి యాశీర్వదించి యి ట్లనియె.

మానిని.—

నేను సుదేవుఁడు నాఁబడువాఁడను నీసయిదోడున కిష్టుఁడ నో
మానిని! నీపితృనాజ్ఞను వచ్చితి మక్కువతో నిను రోయఁగ నీ
స్థానమునం గనుఁగొంటిని నీదగుతల్లియుఁ దండ్రియు సోదరులుం
సూనులు సేమమునం గల రచ్చట శోక మొకం డగు నీకతనన్. 24

క. నిను రోయ బ్రాహ్మణోత్తము
లను నూర్లగఁ బుచ్చె భూతలమునఁ దిరుగ నీ
జనకుం డం దొకఁడను నేఁ
గనుఁగొంటి న్నిన్ను మంచికాలం బగుటన్. 25

మ. అనినం గన్నులు విచ్చి చూచి యతనిం హా! తల్లి! హా! తండ్రి! హా!
యనుఁగుంజుట్టములార! మీమనికి శ్రోత్రానందకందంబుగా

వినఁ గల్గె న్వినిపించె నీఘనుఁడు నాప్రేమాస్పదుం డైననా
ధుని విన్పించెదువివ్వెదగ్రజుని నెండుం జూతునో యింకిటన్. 26

వ. అని మిగుల వగలం బొగులుచు వాని నానవాలుపట్టి తనబంధువర్గం
బులయు సుహృదులయు కుశలం బడిగి బాష్పపూరితనయనయుగ
ళయై గోడుగోడున నేడువ సాఁగె నంత. 27

క. కన్నీ రురులఁగ నేడ్చెడు
నన్నారి సునంద చూచి యతిరభసమునన్
దన్నుం గన్నజనిత్రికి
నున్నట్లు వచించెఁ బోయి యుదిలకొనుమదిన్. 28

తే. చేదిపతిమాత యపుడు చెచ్చెర గమించి
భైమి వసియించుచోటి కాభూమిసురునిఁ
జేర రమ్మని పిలిచి పూజించి పలికె
వినయవినమితగాత్రియై వెలఁదిఁ జూపి. 29

తరళము.—

అనఘ! యెవ్వనికూఁతు రెవ్వనియాలు బంధుల భర్త నెం
దునను బాసె నె టీ వెఱంగిటి తోయజాననవృత్తమున్
వినఁగ నిష్ట మిదంతయు న్వినిపింపు నా నుపవిష్టుఁడై
ఘనుఁడు బ్రాహ్మణవర్యుఁ డాయమఁ గాంచి యి ట్లనియెం దగన్.30

తరువోజ.—

అతివరో! విను విదర్భాధీశుఁ డనఘుఁ
డగుభీముపుత్త్రి యీయమ వీరసేన
సుతుఁడు నలుం డనుక్షోణీశుపత్ని
సుమి దమయంతి యన్ సుదతి; విభుండు
హృతరాజ్యుఁడై వని కేఁగినఁ దాను
నేఁగె నాతనివెంట నిది భీముఁ డెఱిఁగి
క్షితిసురులను బుచ్చె క్షితియెల్ల రోయఁ
జెప్పి నే నిట వచ్చి చెలి దీనిఁ గంటి. 31

వ. ఏనిభూరిమధ్యంబున మేఘచ్ఛన్నం బైనచంద్రబింబంబువలె మాలిన్య సంవృతం బై పద్మసంకాశం బై శంఖలక్షణలక్షితం బగుపిప్లువుం దిల కించి రాజపుత్త్రిగా నిర్ణయించుకొంటి నని మఱియును. 32

చ. సిరి గలపుట్టుమచ్చ యిది చేయఁబడె న్విధిచేత దీని కీ
ధరణితలంబునం గలుగుతామరసేక్షణ లెవ్వరేనియుం
బురు డన రాదు లచ్చి యనఁ బోలును రూపున నీమె ధూళిధూ
సరితశరీరయై నివురుచాటున నిప్పువలె న్వెలింగెడిన్. 33

వ. అనిన నివ్వెఱంపడి రాజమాత దమయంతినుదుటం గలమాలిన్యంబు పోఁ దుడిచి పుట్టుమచ్చం బరిశోధించి మించినవేడ్కం దానిం గట్టుకొని కంట నీరు వెట్టుకొనుచుండె నప్పుడు సునంద తల్లిం గాంచి యి ట్లనియె. 34

శా. అమ్మా! యిమ్మహిళాశిరోమణి యెవర్తో భీమభూజానిపే
రమ్మానాఖ్యుఁడు చెప్పినప్పుడ భవత్స్వాంతంబునం దెంతయే
సమ్మోద మ్ముదయించినట్లు తెలియం జాలె న్మదీయాత్మ నా
కిమ్మాడ్కిన్ వివరించి చెప్పఁగదె నీ కేలిట్లు గారాబముల్. 35

వ. అని యడుగుచుండ రాజమాత శాసుత నక్కునం జేర్చుకొని లాలించుచు ని ట్లనియె. 36

ఉ. కూఁతుర వైతి నీ విపుడు కోమలి! నేనును నీదుతల్లియుం
గూఁతుల మాదశార్ణములకుం బతి యైనసుదామనామభూ
నేత కతండు భీమునకు నీజనని న్నను వీరబాహు వి
ఖ్యాతమహామహీశునకు నాండ్రుగఁ జేకొన నిచ్చె ముచ్చటన్. 37

క. నిను నేఁ బుట్టినయప్పుడ
కనుఁగొంటి దశార్ణమందు గాదిలిబిడ్డా!
విను నీపితృగృహ మెట్టిది
యన వచ్చునో యిదియు నట్టి దన వచ్చుఁ జుమీ. 38

వ. నాయైశ్వర్యం బంతయు నీయైశ్వర్యంబ యని కరం బాశ్వాసించుచున్నంత దమయంతియు నత్యంతప్రహృష్టాంతరంగయై తల్లికి సాష్టాంగనమస్కారంబు గావించి చెల్లెలిం గౌఁగిలించుకొని. 39

చ. చెలియల! నన్నెఱుంగకయె చేసితి వీవు మహోపచారముల్
చెలిమియు నాపయిం గలదు చెప్పెడిదే మిఁక సర్వసౌఖ్యముల్
గలిగెను నాకు నీకడ నొకానొకసేఁగియు లేక యెప్పుడుం
దలఁచెద నిన్ను నీదయను నాతను వుండినయంతకాలమున్. 40

దమయంతి విదర్భాపురంబు జేరుట.

వ. అని తల్లిం జూచి. 41

మ. నను సైరంధ్రినిఁ గా నెఱింగియుఁ బనుల్ నాచేతఁ జేయింప కె
ప్పును నీకూఁతు సునందనుం బలె గృపాపూర్ణాంతరంగంబునన్
గనుచుం బ్రేముడి నాదరించితివి నీకంటె న్మదీయాంబ హె
చ్చని నే నెన్నఁడుఁ గాని యెంచుకొన నిం దైనట్టి యీనాళ్లలోన్.

ఆ. గట్టువాలుదానిఁ గా నన్నుఁ జేకొని, కన్నబిడ్డకన్న మిన్న యైన
గారవంబుతోడఁ గని యాదరించితి, వెన్నఁదరమె నన్నుఁగన్నతల్లి.

వ. అని తల్లికూఁతులు సంభాషించుకొనుసమయంబునఁ జేదిపురీశ్వరుం
డగు సుబాహుం డావృత్తాంతం బంతయుం గంచుకివలన విని వడి
వడిం దల్లిగృహంబునకుం బఱచి వచ్చి దమయంతి నక్కునం జేర్చి
కన్నీరు నించుచు ని ట్లనియె. 44

ఉ. చెల్లెల! నిన్ను మాజనని చేర్చిన దంచు నెఱింగి గట్టువాల్
పల్లవపాణి యైనఁ బరభామిని యుండెడుచోటి కేఁగుటల్
చెల్ల దటంచుఁ దల్లిని భజించుతలంపును మానివైచితిం
జెల్లెల వైతి నే నెపుడొ చేసినపుణ్య మిటుల్ ఫలించెఁ బో. 45

వ. అని పలుకుచున్నయన్నం గాంచి నమస్కరించి దమయంతి యి
ట్లనియె. 46

చ. ఇడుమలకై వగం బొగలి యెక్కడనో పడకుండఁ గీడులో
నడచె నొకింత మే లనఁగ నాదగునన్నయుఁ దల్లి చెల్లెలున్
గడిమి నెసంగుచోటఁ బడఁ గల్గితిఁ గావున నాదుమాన మి
వ్విడువునఁ గాచుకోఁ గలిగి వర్తిలుచుండఁగ నైతి నగ్రజా. 47

వ. అని నంత నెల్లరు నుల్లాసంబునం జేలుచుండి రపుడు దమయంతి
వారలం గాంచి. 48

క. ఎడఁబాటు సైఁప విడిచితి
బుడుతలఁ దడ వయ్యెఁ జూడ బుద్ధి జనించెన్
విడ నోప మిము న కైనన్
వెడలెద మీయాజ్ఞ యైనఁ బితృగృహమునకున్. 49

వ. అనిన నన్నయుఁ దల్లియు వల్లె యని సుదేవుం బహూకరించి నీవు పోమ్ము దమయంతి రేపట మాపట బయలుదేఱి వచ్చు నని విదర్భేశ్వరునకుం జెప్పు మని యంపివుచ్చి మఱునాఁ డరుణోదయంబున గతిపయ సేనాసమేతంబుగా నొక్క చతురంతయానంబున నామెం గూరుచుండం బెట్టి మంత్రిజనంబుఁ దోడిచ్చి విదర్భాపురంబున కంపివుచ్చుటయును. 50

చ. కతిపయవాసరంబులకుఁ గాంచనగంధి విదర్భ కేఁగి తా
సుతులను దల్లిదండ్రులను జుట్టల సందఱఁ జూచి వారిచేఁ
గుతుకముతోడఁ జూడఁబడి కొంతసరానివియోగదుఃఖమున్
మతిఁ గొని సద్వ్రతంబులను మానక చేయుచు నుండె మెండుగన్.

క కలికి నిజదేహసౌఖ్యం
బులకు న్వెలి యగుచు నలుని బొందుఁ దలఁచుచున్
మలినార్ధవస్త్రమున్ విడ
కలయక గురుదేవపూజ లపుడు పొనర్చెన్. 52

క. తనయింట వచ్చియుండిన
తనయం గని భీమరాజు తద్దయుఁ బ్రీతిం
గొని యిచ్చె సుదేవునకున్
ధనములు ధాన్యములు గోశతంబులు భక్తిన్. 53

మ. వ్రతముల్ సేయుచు గౌరినిం గొలుచుచున్ బ్రాహ్మీమహాదేవికిన్
నతు లర్పించుచుఁ గందమూలములె బోనం బట్లుగా దేహయా
త్ర తగం దీర్చుచు నాఁటివస్త్రమె సదా తాల్పంగనై స్థండిల
క్షితిమీఁదన్ శయనించుచుం గడవఁ జేసెం భైమి యక్కాలమున్.

వ. ఇట్లు కొన్ని దినంబులు గడచినవెనుక నాదమయంతి తల్లి కేకాంతంబున ని ట్లనియె. 55

చ. నను బ్రతికింపనిష్టము మనంబున నీ కగునేని తల్లిరో
వినిచెద నిష్ఠ నాపతిని వీరవరేణ్యుని నైషధేశ్వరున్
గనుఁగొని తేరఁ బుచ్చు మని కాళులపైఁ బడ లేవ నెత్తియుం
గనులను వేఁడినీ రురులఁగం బ్రతి పల్కఁగ లేక రాజ్ఞియున్. 56

క. వగఁ బొగిలె నయ్యవస్థన్
నగరునఁ గలభామినీజనము గని మిగులన్
బొగిలెన్ హాహారవ మపు
డగుడెంచెన్ రాజభవన మది నిండుకొనన్. 57

వ. ఆవృత్తాంతం బంతయు భీముండు భార్యవలన విని జామాత నన్వే
షింప సమర్థులగుమతిశాలుర బ్రాహ్మణుల నియోగించుటయు వైదర్భి
వారిం గని యిట్లనియె. 58

అలసగతి. నలుఁ డిపుడు మాఱువల నల్వాఱి మెలంగున్
దెలియుట యసాధ్య మగు దేవతల కేనిన్
లలితగతి మీ రిల మెలంగుచు సభాంత
స్థలముల వచింపుఁ డిటు సారెకును దీనిన్. 59

తరువోజ.—

జూదరీ! నీ విట్లు శోచనీయముగ
శ్రుతివిహితార్థంబు చులుకన మీఱె
నాదగువస్త్రంబు నడిమికిఁ జించి
నడ డస్సి నిదురించు నను వని వీడి
పోఁ దగునే భార్యఁ బ్రోవ భర్తకును
బోలును గాదె యీబుద్ధి యె ట్లబ్బె?
నీదుధర్మజ్ఞత నీదువంశంబు
నేఁడైనఁ దలఁచి నన్ నెఱిఁ బ్రోవ రావె.

వ. ఇట్లు మీ రెల్లకడలం బలుకునది దీన మీ కెవ్వఁడు దీనుండై వగచుచు నతిప్రయత్నంబునం బ్రతివచనం బిచ్చు నతం డెట్టిరూపున నున్న మీ రెఱింగి నా కెఱింగింపుఁ డని గౌరవించి పంచినం బని విని చని బ్రాహ్మణు లెల్లరాష్ట్రంబులు నెల్లపురంబులు నెల్లగ్రామంబులు నెల్ల

ఘోషంబులు నెల్లయాశ్రమంబులు నెల్లవనంబులం దిరిగి తిరిగి దమయంతిపలుకు లెల్లకడలం బలికి పలికి నలు నెఱుంగ నోడి మగిడి వచ్చి రంతఁ గొంత కాలంబునకుఁ బర్ణాదుం డనుద్విజుండు వచ్చి దమయంతిం దర్శించి. 61

పర్ణాదుఁడు నలునిజాడ లెఱింగించుట.

ఉ. తేపులు మాపులు న్నడచి తెక్కలు గల్గినయట్లు పోయి నే
నీపుడమిం గలట్టివను లేఱులు పల్లెలు పత్తనంబులుం
జూపులఁ గట్టి మెట్టుచును సోబనపుంగళ నొప్పునాయయో
ధ్యాపురి కేఁగి నీపలుకు లన్నియుఁ బల్కితి నోలగంబునన్. 62

వ. అవి విని విననియట్లు ఋతుపర్ణుండు లోనగువా రేమియు మాఱు వలుక కుండి రపుడు హ్రస్వబాహుండును గురూపియు శీఘ్రయానకుశలుండును సూదక్రియానిపుణుండును సూతుండు నగునొక్కపురుషుండు బాహుకనామధేయుండు నన్ను ము న్నెఱింగినవాఁడుం బోలె పలుకరించి విజనస్థలంబునకుం బిలిచి నిట్టూర్పు నిగిడించుచు. 63

శా. ఈ వేదేశమునందు నుండుదువు ని న్నే రేని పుత్తెంచిరో?
నీవే వచ్చితొ? యేమికార్యమున కీనీవృత్తులం దిర్గ దే
యేవిద్యల్ గణియించి తర్థులను మీపృథ్వీశుఁ డాలింపఁడో
చేవ ల్దేరినవాఁడు కాఁడొ? సుఖమై చెల్వొందునో? చెప్పవే. 64

చ. అనవుడు నే విదర్భపురియం దగువాఁడను మామహేశ్వరుం
డనఘుఁడు సౌఖ్యవంతుఁ డన నౌ నయినం దనకూఁతు రల్లుఁడుం
వనిఁ బడి పోయి రీనడుమ వచ్చెను గూఁతురు మాత్ర మల్లుఁ డిం
కను గనరాఁడు నే నతనికై తిరుగాడుచు నుంటి నిగ్గతిన్. 65

వ. అని పలికితిం బలికినంత నతండు వెండియు నోద్విజపుంగవా! నీ విపు డోలగంబున నుడివినది ధర్మార్థవచనంబు గానొప్పు నా కర్థింపుము. 66

చ. పురుషునియందుఁ ద ప్పయినఁ బొల్తుక సైఁచినయేని పుణ్యపుం
దెరువునఁ బోవు నీలువునఁ దేరినవా రిటు లల్ల రెప్పుడుం

సిరి చెడి రాజ్యహీనుఁ డయి సిగ్గున నైక్షుధ నొంది మందుఁ డై
దురపిలువాఁడు భార్య నటు ద్రోచిన దోషము నొందఁ డారయన్.

ఆ. అనుచుఁ బలికి పోయె నతఁ డంత నే నిట్లు
విని వచింప వచ్చితిని బ్రమాణ
బుద్ధి యయ్యె దేని భూమీశునకుఁ జెప్పి
పోలినట్లు సేయఁ బోలు నీకు. 68

వ. అని చెప్పిన పర్ణాదునకు వేనవేలు ధనం బిచ్చి యంపిపుచ్చి దమయంతి తల్లికడకుం జని తద్వృత్తాంతం బంతయు జెప్పి యిప్పు డొకయుపాయంబు గంటి నది మాతండ్రికిం జెప్పిన నొప్పండు శాస్త్రంబు నొప్పదు నామనంబు నొప్ప దట్లయిన నిట్లు చేసినం గాని నీయల్లునిం దెలిసి తెచ్చుట యసాధ్యం బిది కార్యసాధనక్రమంబ కాని మఱొండు గాదని చెప్పి యొప్పించి తండ్రికిం దెలియకుండ సుదేవు నయోధ్యకుం బుచ్చెద నాతండు నన్నుఁ దెచ్చినట్లు నలుం దేర నోపు నని తదనుజ్ఞం గొని సుదేవు రాఁ బనిచి యి ట్లనియె. 69

సుదేవుఁ డయోధ్యలో ద్వితీయస్వయంవరము చాటుట.

చ. బ్రదికెనొ చచ్చెనో నలునిపల్కు వినంబడ రామి భీముఁ డం
గద దమయంతికిన్ మఱియు గారవ మార స్వయంవరోత్సవం
బొదవఁగఁ జేయ నెంచె నరుణోదయమం దగు నెల్లి దాని కేఁ
గుదురు నరేంద్రు లంద ఱటకుం బ్రియ మేనియు నీవు నేగుమా.

వ. అని నీ వయోధ్యాపురంబున ఋతుపర్ణునకుం జెప్పి ర మ్మనిన సమ్మతించి సుదేవుం డతిత్వరితప్రయాణంబులం జని ఋతుపర్ణునకుం జెప్పిన నతండు బాహుకుం గని యి ట్లనియె. 71

చ. అరుగఁ దలంచినాఁడ దమయంతిస్వయంవర మారయ న్మహో
త్తర మది నేఁడ పోఁ దగు విదర్భకు నె ట్లొనఁగూడునో యనన్
దురపిలి బాహుకుండు మదిఁ దొట్రిలుచున్ సతి యి ట్లొనర్పఁగా
దొరకొనునే యి దెల్ల ననుఁ దోకొనిపోవునుపాయ మేమొకో! 72

చ. ఖలుఁడు మహాఘమున్ సలిపెఁ గా దన కంచుఁ బరిత్యజించి చం
చల మగుస్త్రీస్వభావమున సాధ్వియ యైనను గాఢదీప్త యై

తలఁచెనో యిట్లు మార్కగనిఁ దమరసేషణ గాంచె బిడ్డలన్
సలుపునె దోషకార్య మిట సత్య మసత్య మెఱుంగఁ బోలెడున్. 73

వ. అని కార్యంబు నిశ్చయించుకొని బాహుకుండు కృతాంజలియై ఋతు
పర్ణున కిట్లనియె. 74

తే. తెలిసితిని రాజ! నీపల్కు- లెలమి నొక్క-
పగట నేను విదర్భకుఁ బఱప నేతు
నరద మిటు చూడు మనుచు లాయమున కపుడ
యేఁగి నడఁదీఱుహయముల నేఱి తెచ్చె. 75

తే. అవి పృథుప్రోతములు మహోహనువులు కుల
శీలసంపన్నములు గురుశిక్షితములు
వరదశావర్తకలితముల్ వాతరంహ
ము లవలక్షణవర్జితములు తలంప. 76

క. వానిఁ గనినంత నొడయఁడు
మానసమునఁ గోప మూని మహి నల్పబల
ప్రాణము లియ్యవి మహద
ధ్వాన మ్మెటు నడవ నోపుఁ దగ వివి యనుడున్. 77

తే. ఒకటి నుదుటను రెండు మస్తకమునందుఁ
బార్శ్వముల రెండు రెం డుపపార్శ్వములను
వక్షమున రెండు ప్రోథము నొకండు
సుడులు గలిగిన ఘోటంబు వడి మెలంగు. 78

క. ఇవియె సలక్షణవాహము, లవు నేఁడ విదర్భ కరుగు నైనను నీ కో
యవనీశ! యేవి నచ్చిన, నవియే నేఁ దెచ్చి కూర్తు నానతి యిదు దే.

వ. అనిన ఋతుపర్ణుండు మెచ్చి నీవు హయతత్త్వజ్ఞుండవు నీకుం బోలి
నట్లు చేయు మనిన నతం డాహయచతుష్టయం బరదంబునకుం బూన్చిన
నృపుండు దానిపై నధిరోహించుటయును. 80

ఋతుపర్ణుండు నలునితో రథం బెక్కి- విదర్భకు వచ్చుట.

ఉ. మోఁకరిలంగ నశ్వములు భూమిపయిం బడె నప్డు బాహుకుం
డాఁక దొఱంగఁ బగ్గముల నట్టిటు నొత్తుచు నిల్వ షూపుచున్

వీకఁ గొనంగఁ జేసి తనవెన్నడి సూతుని నిల్పి ఛే! యనన్
నాకపథంబు ముట్టి జవనంబునఁ బాఱె నొగిన్ రథాశ్వముల్. 81

తే. వాయువేగంబునన్ బాఱువాహనముల
సరసి ఋతుపర్ణుఁ డెంతయు స్వాంతమందు
విస్మయము నొంది ముద మంది వేయిగతులఁ
బొగడుచును మెచ్చె బాహుకుఁ దగిలి తగిలి. 82

వ. అంత వార్ష్ణేయుండు వానివాహనసంగ్రహణంబు గని రథఘోషంబు
విని బాహుకుని హయజ్ఞతకు మెచ్చుచుఁ దనమనంబున. 83

సీ. ఈతండు నిర్జరనేతసారథి యైన
మాతలియో లేక మాన్యుఁ డైన
శాలిహోత్రుఁడో కాక జగదేకవీరుఁ డై
నలువు మీఱెడునట్టినైషధుండో
కేవలనరుఁ డైన మావులశాస్త్ర మి
ట్లెఱుఁగున బాహుకుం డెఱుఁగఁ గలఁడె
నలలక్షణంబు లీనరునందుఁ జూపట్టు
వయసు, విద్యయు, బుద్ధి వఱలు సమత

తే. ఘనులు దైవోపహతు లయి జను లెఱుంగ
కుండఁ బ్రచ్ఛన్నవృత్తిమై నుందు రిట్లు
వికృతరూపముతో నున్నవీనియందు
భేదభావ మొకింతయు లేదు నాకు. 84

ఉ. ఈరథవేగముం దొరయ నీఁదయు నేదియు లేదు గాని యి
చ్ఛారతి నొప్పునప్పు డొకస్వాంతము నే ననుచుండు నీరవం
బారయ ఘుంఘుమార్భటుల నంబుధిఁ ద్రచ్చెడునాఁటినాదమో
నా రహి గొల్పెడిన్ మది కనారతమున్ శ్రవణాతిపర్వమై. 85

చ. నలరథఘోషమే యిది యన న్వెనుదీయను గాని బాహుకుం
డలనిషధాధినాథుఁ డగునా యని సందియ మావహిల్లెడిం
దెలియ నితండు సర్వజగతీతలనాథుఁడ యై స్వరూపముం
దెలుపుచు నొడ్లఁగొల్చు పని నిల్చుట లొప్పమి ని ట్లెసంగునో. 86

మ. ఇదియుం గాక యితండు నన్నుఁ గని మున్నే నాఁడో మిత్రత్వముం
బొదలం జేసినవాఁడు నాఁ బలుకు రేపు ల్మాపు లేకాకియై
సుదతీ! లో నిడికొంచు నేమియొ వచించుం దన్నుఁ దా నంచు వి
న్నది విన్న ట్లను జీవలుం డరయ నీతం డానలుండే యగున్. 87

వ అని నలసారథి తనమనంబునం దలంచుచుండె నప్పుడు. 88

మ. దవులం బ్రక్కలఁ బొల్చువస్తువులు చెంతం బ్రక్కలం బొల్చువ
స్తువులున్ ముందుకు వెన్కకుం బొలమునన్ దొర్లాడి రాఁ బోఁ గనుం
గవకుం దోఁపఁగ మున్ను చూచినది వెన్కం జూడ సాధ్యంబు గా
కవురా! నా నరదంబు వాఱె నొగి నానారణ్యముల్ దాఁటుచున్.

మ. నదుమన్ వాఁగులు నేళు లడ్డ మయినన్ జంకించుచు న్వాగురా
లొడికం బేర్పడ లాగి పట్టి యటు ని ట్లొక్కూఁపునం దాఁటిపో
నడగండ్ల న్నడిపించుచున్ గడియకున్ గవ్యూతు లెన్నే ని గాఁ
బుడమిం దోలె రథం బహస్కరరథంబుం బిచ్చుకుంటో యనన్. 90

వ. ఇట్లు వాయువేగంబున రథం బేఁగుచున్నయప్పు డయోధ్యాపురాధి
నాథుండు బాహుకుం జూచి నాయుత్తరీయం బిదె పైనుండి జారి
పడియె దాని నీవార్ష్ణేయుండు పోయి తెచ్చునంతకు హయంబుల
నాఁగఁ బట్టు మనిన నతం డతని కి ట్లనియె. 91

క. నీపటము పడినచో టిట
కోపరివృఢ! తెలియ నొక్కయోజనదూరం
బేపగిదిఁ దేర శక్యం
బో పలుకుము నాఁగ మెచ్చె నుర్వీపుఁ డెడఁదన్. 92

వ. అంతలోన నానాదేశంబు లతిక్రమించి పోవుచుండ నొక్కచో నొక్క
ఫలవంతం బైనవిభీతకవృక్షంబు లోచనగోచరం బగుటయు ఋతు
పర్ణుండు బాహుకుదిక్కు మొగం బై. 93

ఉ. అందఱు నన్నియుం దెలియనట్టిరు గా రొకరుండు దక్కఁగన్
గొందఱు కొన్ని యే యెఱిఁగికొందురు నాకును లెక్కలందుఁ బెం
పొందు వివేక మే నరసియుండినమాత్రన యెట్టిసంఖ్యయుం
బొందుగఁ జెప్ప నేరుతు నపూర్వ మటంచు జనుల్ నుతింపఁగన్. 94

వ. ఈతాండ్రవృక్షంబునం గలపర్ణఫలంబులలెక్క చెప్పెద వినుము రాలినపర్ణంబులు నూటయొక్కటి, ఫలంబులు నూఱు, శాఖాంతరంబులం గూడినయారెండుశాఖలయందు నైదుకోట్లుపర్ణంబులు, రెండువేలతొంబదియైదు ఫలంబులు నున్న వని చెప్పిన విస్మయంపడి బాహుకుండు రథంబు నిలిపి రాజుదిక్కు మొగంబై. 95

మ. ఇది ప్రత్యక్షము చేసికొనఁగ మన మయ్యెఁ దేవ! నే నెన్ని వ
చ్చెద నొక్కించుకలోన రశ్ములను వార్ష్ణేయుం డిటం బట్టు నా
ముదితుం డైననరేంద్రుఁ డిందుఁ దడయం బోల్పొందఁ బో దన్న నె
మ్మది నౌత్సుక్యము పాయ రాని దగుటం బ్రార్థించుచు న్నాటికిన్. 96

తే. బాహుకుం డను క్షణమాత్ర వత్తు నీవు
నంతదనుకఁ బ్రతీక్షింపు మట్లు కాద
యేని వార్ష్ణేయసారథివై నడుపుము
దారి చక్కని దింతలోఁ జేరుకొందు. 97

వ. అనిన నాభాంగాసురి ప్రసన్నుండై నాకు నీవ సారథివి నిన్ను విడిచి నేఁ బోవువాఁడం గాను విదర్భకుం బ్రొద్దుగ్రుంకకుండం బోఁ గలవాఁడ నేని నీసందియంబు దీర్చుకొని ర మ్మనిన నతండు రథావతరణంబు సేసి చని విభీతకంబు నురలం ద్రోచి పండ్ల నెన్ని చెప్పిన యన్నియ యున్న విస్మితుండై మరలి వచ్చి. 98

చ. ఇది పరమాద్భుతంబు ధరణీశ్వర! నీ వెటు చెప్ప నేర్చితో
మదికి సుమంత తోఁప దతిమానుష మం చన వచ్చె నాఁగ ని
య్యది నెగడొందు నక్షహృదయం బనునుత్తమవిద్య దీనినిన్
హృదయమునం దలంచునరుఁ డెప్పుడు దోషము లంట కొప్పెడున్.

వ. అనిన బాహుకుం డేను నీకశ్వహృదయం బిచ్చెద నాకు నీవక్షహృదయం బి మ్మని యడిగిన ఋతుపర్ణుం డశ్వహృదయం బపేక్షించి దాని వలసినప్పుడ కొనువాఁడై వాని కప్పు డక్షహృదయం బుపదేశించెఁ దత్ప్రభావంబున. 100

సీ. నలు నాశ్రయించినకలి యప్డు వానిదే
హమునుండి కర్కోటకాహివిషము
గ్రక్కుచు వెలివచ్చి కానంగఁ బడుటయు
నలుఁడు శపింప లోఁ దలఁచెఁ గనలి
తలఁకి భీతుం డయి కలి కరంబులు మోడ్చి
ననుఁ గావు మయ్య యోనరవరేణ్య!
దమయంతి శాపంబు దగిలి నే నీలోన
నహివిషంబునఁ గాల నైతి నిపుడు

తే. జగముల న్నిన్నుఁ గీర్తించుజనుల కెపుడుఁ
గాని నావలన భయంబు గలుగఁ బోవ
దన నలుఁడు నల్క విడి కలి కాజ్ఞ యొసఁగె
నతఁడు నవ్విభీతకవృక్ష మాశ్రయించె. 101

వ. దానం జేసి విభీతకం బప్రశస్తం బయ్యె నిది కలిమాయం జేసి యొరు లెఱుంగ కుండె రంత నలుండు విగతజ్వరుం డయ్యు వికృతరూపుండై వచ్చి రథం బెక్కి రథ్యంబుల కిలువ సూపుటయు నవి విహంగంబుల తెఱంగున నెగసి నిమేషమాత్రంబునఁ గుండినపురంబు సేరం జనియె నంత సాయాహ్నంబున ఋతుపర్ణుండు భీమరాజానుజ్ఞాతుండై నిజ రథఘోషం బెల్లదిక్కులం బర్వఁ బురప్రవేశంబు సేసె. 102

దమయంతి రథఘోషంబు విని సంతసించుట.

క. ఆరథనిర్ఘోషము విని
సారెకు వారిధులు గదల సకిలించు చటఁ
జేరిన నలునశ్వంబులు
మోరలు పై కెత్తి చూచె మురిపెం బెసఁగన్. 103

తే. హర్మ్యములయందు శాలల నలరుచున్న
నెమ్ములును వారణమ్ములు నెమ్మి గలుగ
నాడె ఘుంకార మొనరించె నన్నలురథ
రవము విని మేఘరవ మనుభ్రాంతి గదుర. 104

చ. నలుఁడు నలుం డటం చొగి ననారతము౯ జపియించు భైమి య
న్నలఘుఘోషము న్విని మనంబున నెంతయు సంతసించుచు౯
నలుఁడ యితండు కానపుడు నా డిటు లొప్ప రథంబు దోలునే
తెలియుదుఁ గాక యం చపుడు తేఱిన మోహాభరంబు పెంపునన్. 105

వ. ప్రాసాదోపరిభాగంబునకుం జని తేరిపై నెక్కి వచ్చువారిం జూచు చుండె నప్పుడు బాహుకవార్ష్ణేయులు దిగిన వెనుక ఋతుపర్ణుండు రథావతరణంబు చేసి భీమరాజుం దరియ వచ్చిన నతం డతని నతి గౌరవంబున నెదురేఁగి తోడితెచ్చి పూజించి స్వాగతంబు వలుకుచు నాగమనకారణం బడిగిన ఋతుపర్ణుం డట స్వయంవరం బనుమాటయు వినక విస్మితుండై వివేకంబున నతని కి ట్లనియె. 106

క. వచ్చితిని నిన్నుఁ గనుఁగొని
ముచ్చట దీఱంగ నాడి పో నరవర ! నా
మెచ్చి యను భీముఁ డిటు దయ
వచ్చుట నే ధన్యతముఁడ వసుధానాథా ! 107

వ. అని ప్రీతిపూర్వకంబుగాఁ బ్రియవచనంబు లాడి వాని నొక్క దివ్య భవనంబున నధివసింపం జేసి. 108

క. మీయట్టిగుణసముద్రులు
మాయింటికి రాకఁ జేసి మాన్యుఁడఁ గానీ
మాయల్లుఁడు నలుఁ డడవుల
కై యింకను గానరామి నంగదపడుదున్. 109

తే. అనిన ఋతుపర్ణుఁ డనియె నే నది యెఱింగి
నినుఁ బలుకరించి పోయెదుమనముఁ జేసి
యే యిటకుఁ వచ్చితిని నలుం డింతలోనె
మీకు దర్శన మిచ్చెడు మిడుకు టుడుగ. 110

వ. అని సమయోచితసంభాషణంబు గావించె నంత బాహుకుం డా రథంబు రథశాలకుం దోలుకొని పోయి రథ్యంబులకుఁ జేయంగల యుపచారంబులు చేసి రథసమీపంబున విశ్రమించి నలుగడం బరి కించి తనమనంబున. 111

చ. పురమున నెందునుఙ్ సవడి పోల్పఁగరాదు స్వయంవరోత్సవం
బరయఁగ రాజు లేరును సమాగతు లౌట కనంగ రా దలం
కరణము లేదు బాంధవనికాయము వచ్చి వసించినట్లు గో
చరమును గా ది దెల్ల సతి సన్మతిఁ బన్నినపన్నకం బగున్. 112

క. నాజాడ లెఱఁగి రేపే
రాఁ జెల్లు సతీస్వయంవరంబున కనుచుఙ్
రాజాస్య తెలిపె నేఁ గా
కేజనుఁడుం జాలఁ డనుచు నెఱఁగినదగుటన్. 113

వ. అని పలుదెఱంగులం బలవరించుచు. 114

క. ఎఱఁగినపుర మది గావున
నెఱఁగినవా రరుగుదేర నే మే నడుగఙ్
నెఱి చూపుఁ గాని సందియ
మఱగొర నేయంగ నడుగ కాఱడి వోవున్. 115

వ. దమయంతియు నట్లు రథావతరణంబు నేసినముప్వురిలో బాహుకుం
డెవండో యెఱుంగఁజాలక. 116

దమయంతి బాహుకునికడకుఁ గేశినిం బుచ్చుట.

క. నలరథఘోషమువో లెఙ్
దెలియంబడె ఘోష మిపుడు తెలియం బడఁ డా
నలుఁ డిందుఁ గుఱుచచేతులు
గలవికృతాంగుండు నలుఁడు గావలయునొకో. 117

వ. అని కేశిని యనుదూతిం బిలిచి. 118

తరళము. కుఱుచచేతులతోడఁ దేరికిఁ గూయిగా శయనించె నా
పొఱడువాఁడు నలుం డొకో యని పోలఁ దోఁచెడు నోసి! నీ
వఱగొఱల్ గొన కేఁగి మెత్తగ నాడి వేడుక నిక్కువం
బెఱఁగి ర మ్మిపు డిచ్చ పోచ్చెడి నింద యుండినయట్లుగన్.

వ. అని పుచ్చి తాను దనమేడపై నుండి చూచుచుండె నంతలోఁ గేశిని
యుం జని బాహుకుం గని కుశలం బడిగి మాదేవి వినఁగోరుచున్న
యది నీ విందుల కేల వచ్చితివి నిజంబు సెప్పు మనుటయు నతండు.

 మ. ధరణీశుం డగుభీమరాజు సుతకుం దాల్మిం ద్వితీయస్వయం
వరముం జేయఁగ నెంచె నెల్లి యనుచుం వాక్యం బయోధ్యాపురీ
శ్వరుఁ డాబ్రహ్మముఖంబున న్విని మహేచ్ఛ న్వచ్చె నిం దెంతయే
ధర నీనాఁటన దాఁటి నే నతనివెంట న్వచ్చితిం సాదిన్నై. 121

వ. అనుటయు మీలో మూఁడవవాఁ డెవ్వండు నీ వెవ్వండ వెందుల
కీఋతుపర్ణు నాశ్రయించితి వని యడిగిన కేశిని కతండు వెండియు. 122

తే. అతఁడు వార్ష్ణేయుఁ డనుసూతుఁ డతివ! నలుని
సారథి నలుండు నష్టుఁడై చనుఁడు వచ్చి
చేరె భాంగాసురి న్నేను వారువముల
దిద్ద వండ నయ్యేలికయొద్ద నుంటి 123

వ. అనుడు నది వార్ష్ణేయుండు నలుండు నష్టుఁ డైన తెఱం గెఱుంగునో
యనుటయు నతండు. 124

తే. నలునిబిడ్డల నిటఁ బెట్టి వెలలి పోయె
నాతఁ డేమి యెఱుంగు నె ట్లనున్య లెఱుఁగఁ
జాలుదురు రూపు చెడి గూఢచారి యైన
వాని వాఁ డెఱుంగును వానివనిత యెఱుఁగు. 125

వ. అనినం గేశిని యి ట్లనియె ని ట్లయోధ్యాపురంబునకుఁ దొల్లి పర్ణా
దుండు వచ్చి. 126

తరువోజ.—

జూదరీ! నీ విట్లు శోచనీయముగ
శ్రుతివిహితార్థంబు చులకన మీఱి
నాదగువస్త్రంబు నడిమికిఁ జించి
నడ డస్సి నిదురించునను వని వీడి
పోఁ దగునే భార్యఁ బ్రోవ భర్తకును
బోలును గాదె యీబుద్ధి యె ట్లబ్బె
నీదుధర్మజ్ఞత నీదువంశంబు
నేఁ డైనఁ దలఁచి న న్నెట్లుఁ బ్రోవ రావె.

వ. అని చదివినప్పుడు నీ యిచ్చిన ప్రతివచనంబు మాదమయంతి నీవలన
విన నభిలషించుచున్న దనిన నతండు వ్యథితహృదయుండు నశ్రు
పూర్ణలోచనుండు నై లోనిదుఃఖం బెఱుకపడనీయక గద్గదకంఠంబు
వెట్టుకొని. 128

చ. పురుషునియందుఁ ద ప్పయినఁ బొల్తుక నైఁచినయేని పుణ్యపుం
దెరువునఁ బోవు నీలువునఁ దేఱినవా రిట నల్గ రెప్పుడుఁ
సిరి చెడి రాజ్యహీనుఁ డయి సిగ్గులకై క్షుధ నొంది మందుఁడై
దురపిలువాఁడు భార్య నటు ద్రోఁచిన దోషము నొందఁ డారయన్.

వ. అని పలికితి నని కంట నీరు వెట్టుకొనియె నది యంతయుం గేశిని దమ
యంతి కెఱింగించిన నామె వాని నలునిఁగా శంకించి వెండియుంబోయి
విశేషంబు లరసి ర మ్మని పుచ్చిన నది పోయి వచ్చి. 130

క. అతిమానుష మత్యద్భుత
మతిచిత్ర మదృష్టపూర్వ మశ్రుతపూర్వం
బతనిచరిత్రము గన నా
కతఁ డొకవే ల్పనుచుఁ బోల్ప నయ్యె న్వింటే. 131

సీ. పృథివీపతికి వండి పెట్టంగఁ బాశవ
పలలంబు రా నల్లబానసీఁడు
మనమునం దలఁచినమాత్రన జలములు
మెండయి కడవల నిండుకొనియెఁ
దృణముష్టిఁ గొని సవితృనకుఁ జూపుడు దానఁ
బ్రభవించి యనలంబు ప్రజ్వరిల్లెఁ
బ్రొయ్యిలోఁ బెట్టిన నెయ్యేడ కేనియుఁ
గాలవు వానికిఁ గాలునేతు

తే. లహహ వానికరద్వయ మందు వాడి
వత్తె లయ్యెను బూ లెంతవడికి నైనఁ
దావి వీడవు చెడ వొండుదారిఁ బడవు
వానిమాహాత్మ్య మెంతన వలయు నమ్మ. 132

వ. అనిన దమయంతి దానిచే బాహుకుండు వండిన ఖాదినంబుల్లో

దెప్పించుకొని తెని నలుం డని నిశ్చయించి వానికడకుఁ దనబిడ్డలం బుచ్చుటయును. 133

చ. కొడుకును గూఁతునుం దిగిచి క్రుచ్చి కవుంగిటఁ జేర్చి శీర్షముం
బుడుకుచు ముద్దు వెట్టుకొని మోమున మోము గదించి యంకమం
దిడుకొని బాష్పబిందువుల నెంతయు వింతగ వారిమేనులం
దడుపుచు మేఁగగు ర్పొడువ నైషధుఁ డొప్పె వికార మేర్పడన్.

వ. అంతలో వారిం దనతొడనుండి డింపి కేశినిం జూచి వీం డ్రిద్దఱు నాబిడ్డలం బోలి యుండుటంజేసి యిట్లు చేసితి నీవు నాకడ కిట్లు పలుమాఱు వచ్చి పోవుచున్నం బ్రజ లొండొక తెఱంగునం దలంతు రింక రా వలదు పొమ్మనుటయు నది మగిడి వచ్చి సర్వంబును దమయంతికి నివేదించిన నామె తల్లికడకుం జని యి ట్లనియె. 135

దమయంతి బాహుకుం దనకడకుఁ బిలిపించుట.

చ. జనని! పరీక్ష చేసితిని సర్వవిధంబుల బాహుకుండు స
జ్జనునుతుఁ డైననైషధుఁడు సందియ మెందును లేదు గాని రూ
పున నిసుమంత యుండె నది పోలఁ గనుంగొన నెంతుఁ గాన నా
తనిఁ బిలిపింతువో యిటకుఁ దా నయి నే నటఁ బోవుదాననో? 136

తే. అనుమతి యొసంగు మనుడు నాయమ విదర్భ
పతికిఁ దత్సర్వ మెఱిఁగింప నతఁడు దనరి
నలుని రావించె దమయంతి మెలఁగుచోటి
కపుడు తనుఁ గాంచి దుఃఖించు నతనిఁ గాంచి. 137

వ. దుఃఖించుచు నాఁటిమలినార్ధవస్త్రంబ కట్టుకొని జటిలయై యున్న దమయంతి వాని కి ట్లనియె. 138

చ. అలసి వనంబున న్నిదురనందినదానిఁ బరాపవాదముం
దలఁపనిదాని సాధ్వి యగుదానిఁ బ్రజావతి యైనదాని నే
కలఁతకుఁ గానిదానిఁ గులకాంత నయో నలుఁ బోలి వీడిపోఁ
గలిగినవాని నొక్కరుని గంటివొకో యెట నేని బాహుకా. 139

క. దేవతలం గా దనుచుఁ, నే వరియించితిని వాని నేదైవముగా
భావించితి నిట్టినరుం, బో విడుచుట ధర్మ వగునె పో! వాని కిలన్.

మహాస్ర.—
అనుచుం గన్నీళు లేశ్లై యటఁ బఱవఁగ దుఃఖార్తయై యున్నపత్నిం
గని శోకవ్యాకులుండై కలుషరహితుఁ డక్కాశ్యపేంద్రుండు దా ని
ట్లనియెం గాంతామణీ! నే నలకలినిహార్తిఁ హావడిం బొంది ని న్న
ట్లనురాగం బేఁగ దుష్కార్య మనక విడఁగా నై వగం గుంద నైతిన్.

వ. కలిదోషవిముక్తుండ నైననే నిపుడు నీద్వితీయస్వయంవరం బిటఁ బ్రవర్తిల్లుచుండుటం జేసి మారాజేంద్రునితో నిన్నుఁ జూడ వచ్చితి నా కొండుప్రయోజనంబు లేదు వినుము. 142

క. అనురక్తు ననువ్రతు జన,వినుతుం బతి విడిచి సుదతి వేఱొకపతినిం
గొన నెంచి కోర్కికిం దగ, జను టనురూపంబె చెపుమ జలజాతాక్షీ!

వ. అనిన వెఱచఱచి దమయంతి ప్రాంజలి యై. 144

సీ. ఇందు నాతప్పని యెంతె వేల్పుల రోసి
నిను వరించితి నన్ను నీ వెఱుఁగవె
భవదభిగమనార్థ మవనీసురులు కడ
లకు నేఁగి నానుడుల్ పలికి రందుఁ
బర్ణాదుఁ డెఱిఁగె నీ ప్రతివచనం బిడ్డ
కతన నయోధ్య నొక్కవిధమునను
నినుఁ దేరఁగ నుపాయ మని స్వయంవరము నే
నెసఁగించితిని దండ్రి యెఱుఁగకుండ

ఆ. నీవు గాక యొకరుఁ డేకాహ్నమున నూఱు
యోజనములదారి వాజుల నడ
పుటకు నోపఁ డనుచు మూర్త మెల్లియ యొప్పు
ననుచుఁ దెలుపు మంటి నవనినాథ! 145

పంచ. స్వయంవరంబు మాట నిక్కవంబ యేని భూమిభృ
చ్చయం బ దేది యొక్కరుం డెసంగుచుంటఁ గంటివే?
యయంబ నేఁడ యైనఁ బత్తనాలయాంగణాద్యలం
క్రియ ల్పొసంగి యుండె నట్టె? రిత్తనేలఁ జూడవే. 146

క. త్రికరణశుద్ధిగఁ బలికితి, నకలంకమనస్కురాల నని నే నిటఁ దా
వకపదము ... సేసెఁ, సకలజగం బెఱుఁగ బాస సదమలహృదయా!

చ. తగ దన కే న ...తయినఁ ద ప్పొనరించితి నేని రేఁబవల్
జగముల లోపల న్వెలుపల న్వెలుఁగొందెడుచంద్రసూర్యులున్
మృగహయుఁడు న్ననుం గినిసి మిత్తికి నిత్తురు గాక కానిచోఁ
దగవరులై యథార్థమును దాఁపక తారు వచింత్రు, గావుతన్. 148

వ. అని పలుకుచున్న సమయంబున నంతరిక్షంబునుండి వాయుభట్టారకుం
డల్లరు విన ని ట్లనియె. 149

మ. నిషధాధీశ! నిజంబు వల్కెద నిటన్ నీదేవి యేయింత క
ల్మ...ముం బొందె యెఱుంగ దే మెపుడుఁ బోలం గాంచుచున్నార మీ
విషవర్షంబులు మూఁడు; ని న్నిటకు రావింపంగ నీతీఱునన్
మిష గల్పించె నశంకితాత్మఁ డయి దీనిం బొందుమీ పొందుగన్.

వ. అని పలుకుచున్న సమయంబున. 151

మాలిని. సురలు విరులవానల్ సోనలై కుప్పతిల్లన్
గురిసిరి ధర యెల్లన్ దుందుభిధ్వాన మొప్పెన్
విరిసెఁ జదలు కాంతిన్ నిర్మలంబై శివంబై
సరవిఁ గుబులుకొంచుం జల్లఁగా గాలి వీచెన్. 152

నలుఁడు కర్కోటకప్రభావంబున నిజరూపంబు నొందుట.

సీ. అంత నయ్యద్భుత మంతయు నారసి
నలుఁ డంతరంగమునం దనర్చి
దమయంతిఁ బ్రేమించి తలఁచెఁ గర్కోటకు
నతనియిచ్చినవస్త్ర మది ధరింపఁ
దత్ప్రభావంబునఁ దనతొంటిరూపము
నలరాజునకు వచ్చె నలువుమీఱ
నైజదేహచ్ఛవిఁ దేజరిల్ పతిఁ గాంచి
తగఁ గౌఁగిలించె విదర్భతనయ
తే. నలుఁడు నాసతి నక్కున నలరఁ జేసి
కొడుకునుం గూఁతుఁ బ్రీతిమైఁ గ్రుచ్చి యెత్తె

మగువ మగనియురంబుపై మొగముఁ జేర్చి
యూర్చె నతఁడును వగఁ దక్కి కూర్చి పేర్చె. 153

వ. అంత నలదమయంతులవృత్తాంతంబు విని విదర్భేశ్వరుండు వడివడిం జను దెంచి సంజాతసస్య యై యబ్దవారి నాప్యాయిత యైనభూతధాత్రి యుంబోలెఁ బతింగూడి యపగతతాపయై శీతాంశునింగూడినత్రియామయుం బోలె వెలుంగుచున్న కూఁతుం గాంచి సంతసించి తనకభివాదనంబు సేయువారి నభినందించి యాశీర్వదించి దేవాయతనంబులం బూజలు సేయించి పురం బలంకరింపం బంచి పరమోత్సవంబునం బొందె నంత. 154

శా. ఆవైదర్భియు నైషధుండు నపు డన్యోన్యానురాగంబునన్
భావం బొప్పఁగ నాఁటిరేయి విలసత్పల్యంకభాగంబులై
శేవం బొల్చి వనంబులం దమకుఁ బాటింపంగ నైనట్టిపా
ట్లా వేళ న్వచియించుకొంచు మిగులన్ హర్షించి రుత్కంఠమై. 155

ఆ. నాలుగేండ్ల కట్టు లాలు మగండును, గలిసికొనినయట్టికారణమునఁ
గనిరి వారు సర్వకామార్థసిద్ధులు,గలిగి ముదము నొంది రెలమి నపుడు

వ. అంతఁ బ్రభాతం బగుటయు. 157

తే. గోముఖశ్రీలు మేలుమ్రుగ్గులును దోర
ణములు ధ్వజములు నల్గడ నలువుమీఱఁ
జేసి ప్రో లెల్ల మిగులఁ గై సేసి కారు
లెల్ల హృష్టాంతరంగులై యొసఁగి రపుడు. 158

మ. ఋతుపర్ణుం డది యంతయు న్విని నలు న్వీక్షించి విశ్వంభరా
పతి వీ వక్కట! బాహుకుం డనఁగ నై ప్రచ్ఛన్నవృత్తి న్వసిం
చితి నాచెంతను; నీచకార్యములు నీచే నేను జేయించితిన్
క్షితినాథాగ్రణి! తప్పు సైఁచి దయ న న్వీక్షించి రక్షింపవే. 159

తే. అనుడు నలుఁ డి ట్లనియె నోమహామహీశ!
నాకు సంబంధి వీవు నే నీకడఁ గడు
నొప్పియుంటిని నాయింట నుండినట్లు
తప్పు చేసితి నను టది యొప్పునయ్య! 160

వ. అని నలుండు వాని నాదరించి పూజించి వాని కశ్వహృదయం బిచ్చి
పుష్పుటయు నతండును భీమరాజసత్కృతుండై యనుపంబడి వారి
వీడ్కొని నలసారథి నంద విడిచి యొండొక్కసారథిం దోడ్కొని
నిజపురంబునకుం జనియె నంత నైషధుండును గుండిననగరంబున
నొక్కమాసం బుండి భీమరాజు నామంత్రించి యొక్కరథంబును,
బదియాఱుగజంబులును, నేఁబదిహయంబులును, నాఱునూర్లపదా
తులును, గల స్వల్పబలంబుఁ దోడుకొని త్వరత్వరప్రయాణంబులం
గదలి నిషధకుం జని పుష్కరుం గని యి ట్లనియె. 161

తరువోజ.—

వినుము పుష్కర ! నాకు వి త్తంబ యగుచు
వెలఁది యుండె విదర్భవిషయాధినాథు
తనయ పణం బిడఁ దలఁచితిఁ దానిఁ
దగ నీవు పణ మిడు ధారుణీరాజ్య
మును జూద మాడఁగ బుద్ధియేఁ లేక
మొనసి నాతో నాలమునకేని రమ్ము
మనము పోరుద మందు మడసినవాని
మహిరాజ్య మోర్చినమానిసి నొందు.

తే. అని నలుఁడు వల్కఁ బుష్కరుఁ డాల మైన
మొప్ప మగు జూద మొప్పి నే మున్న వీని
నోడిచి యుంటి జయం బగుఁ బడఁతి నొంగ
వచ్చు నని లోన నెంతయు మెచ్చుకొనుచు, 163

ఉత్సాహము. నలునిఁ గాంచి యిట్లు పల్కె నాకు దేవనంబునన్
గలదు ప్రీతి గాన నాడఁ గడఁగు మేను గెల్చినన్
నెలఁతమిన్న నాది యగును నీవు గెల్చితేని నా
కలరు రాజ్య మెల్ల నీది యగునుజుమ్ము నావుడున్. 164

నలుఁడు పుష్కరు నోడించి నిజరాజ్యంబు వడయుట.

సుగంధి. వీరసేనసూతి బాహువీర్యగర్వయుక్తుఁడై
పోర లావు చాలనట్టిబుద్ధిహీను వానినిన్

జేరి వారిజాక్షిఁ గొమ్ము చిట్టకమ్ముగా నటం
చారటమ్ము దీఱఁ బిల్చి యాడి గెల్చె వ్రేల్మిడిన్. 165

వ. ఇట్లశ్రమమ్మున జూదమ్మునం గెలిచి వానిం జూచి నవ్వుచు నిట్లనియె.

పద్మనాభము.—

నిన్నిట్టు లోడించితిం గాన రాజ్యంబు
నేఁ గైకొనం గల్గె నీ కింక భైమిఁ
గన్నెత్తి చూడంగ నాడంగ శక్యంబు
గా దయ్యె దాసుండ వై తీవు మాకుఁ
మున్నన్ను జూదంబునం గెల్తు నంచుం బ్ర
మోదమ్మునఁ గర్వముం గొందు వింతే
నెన్నంగ లే వక్కలీంద్రప్రసక్తిఁ ర
హిం దూలి పో నైషధుం డయ్యె నంచున్.

మత్త. ఈవు నాపినతండ్రిపుత్త్రుఁడ వింత కెక్కువ నీకు నే
నేవిధంబున నెగ్గు సేయఁగ నెంతు రాజకులాధమా!
పోవు మెచ్చటికే శరీరముఁ బ్రోచికో నగువిత్తముఁ
జేవలంతిగఁ గొమ్మొసంగితిఁ జెల్మి నింపితి నీపయిన్. 168

వ. అని సత్కరించి వాని నంపివుచ్చి నలుం డనల్పవైభవంబునఁ బురప్రవేశంబు చేసి పౌరుల నాశ్వాసించి మంత్రుల మన్నించి పరమోత్సవం బెసంగఁ బూజ్యసామ్రాజ్యంబుఁగొని దమయంతిం బిలువనంపుటయు.

స్రగ్ధర.
ప్రీతిఁ భీముండు కూఁతుం బ్రియసుతసహితం బిల్చి నీప్రాణనాథుం
డేతన్మాత్రంబులో నాకృపణు గెలిచి నిన్నింతలో రాఁగఁ బంచెఁ
జేతోమోదంబుతో నీచెలువునిఁ గనుఁగోఁ జెల్లుఁ బొమ్మంచు లోక
ఖ్యాతం బౌరీతిఁ బుచ్చెం గడుధన మిడి సత్కారముం జేసి వేడ్కన్

తోదకము. కొడుకును గూఁతురుఁ గోర్కి దలిర్పం
గడుకొని వెంబడి గాఁ జనుదేరఁ

---

పద్మనాభవృత్తమునకు 7 తగణములు, 2 గురువులు, 13-వ యక్షరము యతి స్థానము.

గడువిభవంబునఁ గ్రాలుచు నంతన్
బడఁతి ప్రియంబున భర్తను జేరెన్. 171

వ. ఇట్లు వచ్చినధర్మపత్నిం గూడి నైషధేశ్వరుండు దేవేంద్రవైభవంబునం దేజరిల్లుచు విధిదృష్టవిధానంబున వివిధయజ్ఞంబు లొనరించి జంబూద్వీపంబునందలితనరాజ్యం బేలుచు సుఖంబుండె ధర్మజా! నీవు నట్లు నీదుఃఖం బెల్లఁ జల్లార రాజ్యంబు వడసి సకలబంధుపరివృతుండవై సుఖింపఁ గలవు పరిదేవనంబు సేయకుండు మని బృహదశ్వుండు వెండియును. 172

క. నలరాజున్ దమయంతిం, గలితయశుఁ డగుబుతుపర్ణుఁ గర్కోటకునిం
దలఁచినవారల కెప్పుడు, కలికల్మషనాశనంబు కాఁ గల దరయన్.

ఉ. ఈయితిహాసమున్ వినిర యేని పఠించిర యేని నిచ్చలున్
బాయక యొడ్లకుం దెలియఁ బల్కిర యేని సమస్తదోషముల్
వాయు శుభంబు డాయుఁ గలిబాధ లవన్నియు మాయు రోగముల్
పాయవడుం బ్రశస్తియు నపారయశంబును గల్గు నిద్ధరన్. 174

వ. అని బృహదశ్వుండు ప్రహృష్టమనస్కుండై ప్రార్థించిన ధర్మరాజు నకు నక్షహృదయం బెఱింగించి యశ్వశిరస్తీర్థంబునకు యథేచ్ఛం జనియె. 175

క. అని శౌనకాదిమునులకు వినిపించెన్ సూతుఁ డిట్లు వినయముతో ని
య్యనఘ మగునైషధీయంబును దీనిన్వినిన శ్రేయములు సమకూడున్.

ఆశ్వాసాంతము.

సుగంధి. వేఁడికోలు రాకమున్నె వేనవేలుసొమ్ములం
గూడునర్థికోటి కిచ్చి కోర్కిఁ దీర్చుదాత మే
లాడువాఁడు కామయార్యనాత్మజుండు వానికిన్
వీడనట్టిసౌఖ్య మిచ్చి వేడ్కఁ బ్రోవు మీశ్వరా.

గద్యము. ఇది శ్రీమహామహోపాధ్యాయ, కళాప్రపూర్ణ, కవిరాజ, కవిసార్వభౌమ శ్రీపాదకృష్ణమూర్తిశాస్త్రి ప్రణీతంబయిన నైషధీయచరితం బనుశృంగారతరంగిణియందు షష్ఠతరంగము.

శ్రీ. శ్రీ. శ్రీ.

చెన్నపురి: 'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము—1941.

